



ముఖచిత్రం దారి విడువుము కృష్ణా

చిత్రకారుడు వడ్డాది పాపయ్య




లేడి చమ్ గంటల కొద్దీ తీసుకొనే ఉతుకు పనిని కొద్ది నిమిషాల్లో పూర్తి చేస్తుంది. తెల్లటి నూలు బట్టలను దాదాపు నాలుగు నిమిషాల్లో, మామూలు నూలు బట్టలను రెండు నిమిషాల్లో, సింథెటిక్ బట్టలను ఒక నిమిషంలో మరియు ఉన్ని బట్టలను అర నిమిషంలో ఉతికేస్తుంది.

ఇపుడిక గంటల తరబడి బాదడం, పులమడం లాంటి బాదరబందీలు లేకుండా మీ బట్టలను శుభ్రంగా మరియు కాంతివంతంగా ఉతుక్కోగలరు. దీనిని ఉపయోగించడం ఎంతో సులభం. మీరు చేయాల్సిందల్లా ట్యాంక్‌లో నీళ్లు నింపి, డిటర్జెంట్‌ను వేసి, బాగా నురుగవచ్చేలా కలిపి, బట్టలను మెషీన్‌లో వేసి సిఫారసు చేసినంత సేపు మెషీన్‌ను నడపడమే. నిమిషాల్లో మీ బట్టలన్నీ తళతళ మెరిసేలా శుభ్రం! లేడి చమ్ సహాయంతో మీరు బట్టలను జాలించుకోగలరు కూడా.

ఇది బట్టలకు సురక్షితమైనది కూడా. మా నిర్దిష్టమైన నాణ్యతా నియంత్రణ దీనికి హామీ. మీరు కూడా ఒక లేడి చమ్ తెండి. దానితో ఇంట్లో మీకో అందమైన, ఆధునికమైన మరియు మన్నికైన చేదోడు దొరికినట్లే మరి!



# లేడి చమ్

**గంటల కొద్దీ పట్టే ఉతుకు పనిని నిమిషాల్లో పూర్తి చేస్తుంది.**

CASSE-80-203 TEL

ప్రిస్మా ఏజన్సీస్ 5 9 22/1/16 ఆదర్శనగర్ హైదరాబాద్-500 483
ఫోన్ 221349

# 1981

# చక్రపాణి అవార్డులు

తెలుగులో ఉత్తమ నవలా, కథా సాహిత్యాన్ని ప్రోత్సహించే ఉద్దేశంతో చక్రపాణి అవార్డులను ప్రతి సంవత్సరమూ బహూకరిస్తున్నాం ఈ సంవత్సరం మూడు ఉత్తమ నవలలకు, నాలుగు ఉత్తమ కథలకు అవార్డులు ఇవ్వటానికి నిర్ణయించాం

## అవార్డుల వివరాలు

| | | |
|---|---|---|
| **నవల :** | మొదటి అవార్డు — రూ | **2,000** |
| | రెండో అవార్డు — రూ | **1,500** |
| | మూడో అవార్డు — రూ | **850** |
| **కథానిక :** | మొదటి అవార్డు — రూ | **1,000** |
| | రెండో అవార్డు — రూ | **750** |
| | మూడో అవార్డు — రూ | **500** |
| | నాలుగో అవార్డు — రూ | **350** |

పై అవార్డులను పొందటానికి రచయితల, రచయిత్రుల నుంచి ఉత్తమ నవలలను, కథలను ఆహ్వానిస్తున్నాం.

***అవార్డులను పొందగోరేవారు పాటించవలసిన నిబంధనలు:***

1. నవలలు, కథలు – ఆంధ్రుల సమకాలీన సామాజిక జీవనానికి ప్రతిబింబంగా ఉండాలి.

2. నవల అరఠావు సైజులో 90 పేజీలకు మించకుండా, 70 పేజీలకు తగ్గకుండా ఉండాలి. అచ్చులో 80 పేజీలకు మించరాదు. ఒక్కొక్క పేజీలో 25 లైన్లు మించకుండా, ఒకే ప్రక్కన వ్రాయాలి

3. కథానిక అరఠావు సైజులో 16 పేజీలకు మించకుండా ఉండాలి పేజీకి ఒకవైపునే వ్రాయాలి

4. అనువాదాలూ, అనుసరణలూ అవార్డులకు ఆమోదించ బడవు. రచన స్వంతమేననీ, దేనికీ అనువాదం, అనుసరణ, ఆధారం కాదనీ హామీపత్రాన్ని ప్రతి రచనకూ జతపర్చాలి. కలంపేర్లతో వ్రాసేవారు తమ అసలు పేర్లను తప్పకుండా తెలియజేయాలి.

5. అవార్డులకు పంపే నవలల కథల కవర్లపై 'చక్రపాణి 1981 అవార్డులకోసం' అని స్పష్టంగా వ్రాయాలి.

6. అవార్డులు పొందని నవలలు, కథలు కూడా 'యువ'లో ప్రచురణకు స్వీకరించే హక్కు మాకున్నది.

7. అవార్డులు లభించని నవలలను, కథలను తిరిగి పొందగోరేవారు తగినన్ని తపాలా బిళ్ళలు అంటించిన కవర్లను విడిగా జతపర్చాలి. లేకపోతే వాటిని తిప్పిపంపడం సాధ్యంకాదు.

8. అవార్డులను ఇచ్చే విషయంలో 'యువ' సంపాదకులదే తుది నిర్ణయం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.

అవార్డుల నిమిత్తం నవలలు, కథలు మాకు చేరవలసిన ఆఖరు తేదీ సెప్టెంబరు 15, 1981.

— సంపాదకుడు, యువ



లైఫ్‌బాయ్
ఎక్కడో
ఆరోగ్యం అక్కడ
లైఫ్‌బాయ్‌తో స్నానం చేస్తే పరిశుభ్రంగా ఉంటారు మీరు. ఆరోగ్యమైన తాజాదనపు అనుభూతి పొందుతారు. లైఫ్‌బాయ్‌తో, జీవితం ఆరోగ్యప్రదం. గుర్తుంచుకోండి...
లైఫ్‌బాయ్
మురికిలో గల క్రిములను కడిగి వేస్తుంది
LIFEBUOY
for health
లింటాస్ L 78-1811 TL
హిందుస్తాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

# చందమామ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు చక్రపాణి

సంపుటి 44 ఆగస్టు 1981 సంచిక 2


విజయవాడ నగర పరిపాలనసంస్థ హోదాను మునిసిపాలిటీనుంచి కార్పొరేషన్‌గా పెంచుతూ ప్రభుత్వం నిర్ణయాన్ని ప్రకటించింది. సంతోషం.

వరంగల్, గుంటూరు నగరాల మునిసిపాలిటీలను కూడా కార్పొరేషనులుగా మారుస్తారని వినికిడి. విశాఖపట్టణం మునిసిపాలిటీని కార్పొరేషనుగా మార్చడం ఏడాదిపూర్వమే జరిగింది.

ఇవన్నీ నగరపరిపాలనా విధానం ప్రకారం అభివృద్ధికరమైన మార్పులే కావచ్చు. ఒక మునిసిపాలిటీ, కార్పొరేషన్ అయిందంటే, ఆ నగర మునిసిపల్ చైర్మను, మేయర్ అవుతాడు. కౌన్సిలర్ల సంఖ్య, హోదా పెరుగుతుంది. మునిసిపల్ సిబ్బంది హోదా పెరుగుతుంది. అంటే వారి జీతాలు, అలవెన్సులు కూడా పెరుగుతాయన్నమాట. నగర పరిపాలనకు అయ్యే ఖర్చు పెరుగుతుంది. కాబట్టి, ప్రజలు, అంటే ఇళ్ళు, వాకిళ్ళు, దుకాణాలు, ఫాక్టరీలు, సినిమాహాళ్లు కలవారు, రోడ్డుప్రక్కన సిగరెట్లు, తమలపాకులు అమ్మేవాళ్లు, వాహనాలు కలవారు, అనేక వృత్తులమీద జీవించేవాళ్లు, కట్టవలసిన పన్నురేటు పెరగవచ్చు.

పన్నులు పెరిగినప్పుడు, ధరలు పెరగడంకూడా సహజమైన ప్రకృతిధర్మం. నగరాలలో జీవించడానికి ఖర్చు పెరుగుతుంది.

వీటన్నిటివల్ల ప్రజలకు కలిగే ప్రయోజనం, చట్టప్రకారం, ఏమిటంటే, నగరంలో అన్ని ప్రాంతాలలోనూ ఎక్కువగా విద్యుద్దీపాలు, మురుగునీరు నిలవవుండకుండా డ్రెయినేజిగొట్టాలు, ప్రతియింటికీ మంచినీటి సప్లయికి కొళాయిగొట్టాలు, ప్రతి యింటినించీ పాకీగొట్టాలద్వారా మలాన్ని యెత్తివేయించడానికి సూయేజి గొట్టాలు, నగరంలో అనేక చోట్ల చిన్న చిన్న పూల తోటలు, విశాలమైన రోడ్లు, రోడ్డుప్రక్కన చెత్త, చెదారములేని కాలిబాటలు వగైరాలు, అంటే ప్రతి నగరమూ ఈగలు, దోమలు లేకుండా, పరిశుభ్రమైన వీధులతోను, ప్రశాంతినిచ్చే తోటలతోను, నిర్భయంగా త్రాగడానికి వీలైన మంచినీటి సప్లయితోను, స్వర్గనగరంలా వుంటుందన్నమాట.

నిజంగా అలా వుంటుందా ?

యాభై సంవత్సరాల పూర్వంనుంచీ కార్పొరేషనుగా వున్న హైదరాబాద్ నగరం ఎలావుంది. కొత్తగా కార్పొరేషనుగా ఏర్పడిన విశాఖపట్టణం, నగర పారిశుద్ధ్యం విషయంలో ఎంత మారింది.

ఈ దృష్టితో చూస్తే నగరపాలకసంస్థ ఒక పంచాయితీగావున్నా, మునిసిపాలిటీగావున్నా, కార్పొరేషనుగావున్నా ఒకటేనని అనిపిస్తుంది. ఏ నగరానికైనా కావలసింది, ఆ నగర పరిపాలనాసంస్థ పేరులో మార్పుకాదు; దాని హోదాలో మార్పుకాదు. ఆ సంస్థ పనిచేసే పద్ధతిలో మార్పు. ప్రజలకు కావలసిన సౌకర్యాలన్నిటినీ కలుగజేసి, పట్టణాలను పరిశుద్ధమైనవిగా వుంచగలిగిన సామర్థ్యము, స్వాతంత్ర్యము, ఆ నగర పరిపాలనాసంస్థకు కావాలి. ఏ ఏ వసతులను వెంటనే కల్పించాలి, ఏ ఏ నిబంధనల ప్రకారం నగర పరిపాలన జరపాలి అనే విషయంలో ప్రభుత్వం నిర్ణయించిన ప్రకారంగాని, నగర పరిపాలనాసంస్థ నిర్ణయించిన ప్రకారంగాని, పక్షపాతం లేకుండా నిర్మొహమాటంగా పనిచెయ్యగల సిబ్బంది, సిబ్బందిచేత అలా పనిచేయించగలిగిన కౌన్సిలర్లు కావాలి. అంతే గాని, పెద్ద హోదాగల పేరుపెట్టుకొని పన్నులను ఎక్కువచేసే పరిపాలనా సంస్థలవల్ల ప్రయోజనంలేదు. నగర పరిపాలనా సంస్థలలో, పార్టీరాజకీయాలకు స్థానం వుండకూడదు.

మాటవరసకి, ఒక నగరంలో పూలతోట వెయ్యడానికి ఒకచోటు బాగుందను కోండి. ఆ విధంగా నగర పరిపాలనాసంస్థ నిర్ణయించిందనుకోండి. అక్కడ పూలతోట వెయ్యవలసిందే గాని, ఏ సినిమాహాలో, ఏ పెద్ద హోటలో నిర్మించడానికి ఎంత గొప్ప రాజకీయ నాయకుని బంధువుకుగాని, ఎంత పెద్ద ఉద్యోగి చుట్టానికిగాని అనుమతి ఇవ్వకూడదు. అలా, నిర్మొహమాటమైన పద్ధతిలో పనిచేసిననాడే, నగర పరిపాలనాసంస్థలు, నిజమైన, న్యాయమైన పరిపాలనను జరిపే సంస్థలు అవుతాయి

ప్రస్తుతం, మన రాష్ట్రంలోని అన్ని పట్టణాలూ దుర్గంధ భూయిష్ఠంగా వున్నాయి. ఒక్క హైదరాబాదులో తప్ప మరెక్కడా డ్రెయినేజి, సూయేజి లేవు. విజయవాడలో పాతికేళ్ళనాడు ప్రారంభించిన పథకం, యీ నాటికీ పూర్తికాలేదు. పట్టణాలు రోజురోజుకీ పెరిగిపోతున్నాయి. ఇప్పటినించీ పథకాలు తయారుచేసి, వాటి ప్రకారం ప్రతి నగరంలోనూ డ్రెయినేజి, సూయేజిలను ఏర్పాటు చెయ్యకపోతే కొన్ని సంవత్సరాలలో రాష్ట్రమంతాకూడా ఒక పెద్ద మురుగుదొడ్ల సమాఖ్య అవుతుంది.

---

గమనిక

జులై సంచికలో ప్రచురింపబడిన "నింగిలోని సిరిమల్లి" నవల రచయిత్రి యామినీ సరస్వతిగా గమనించగలరు

— *ఎడిటర్*

---

# జరుగుతున్న చరిత్ర

ముజీబ్, జియా, మంజూర్–ముగ్గురు బంగ్లాదేశ్ స్వాతంత్ర్య సమర యోధులు. 1971లో స్వేచ్ఛ లభించింది. ఒక దశాబ్దం గడిచింది. 1981 వచ్చేసరికి ముగ్గురు హతమైపోయారు. స్వేచ్ఛ కోసం ముమ్మందు ఏ సీమలోనైనా ధ్వజమెత్తేవారికి ఈ దశాబ్దంలో బంగ్లాదేశ్‌లో జరిగిన చరిత్రలో కావలసినన్ని పాఠాలు దొరుకుతవి. ఏ ఆదర్శంకోసం ముక్తిని కోరుకున్నామో వాటిని విసర్జిస్తూపోతే, అల్లకల్లోలం తప్పదు.

ముజీబ్ డెమాక్రసీని ఎగరగొట్టా , చివరకు మహా క్రూరమైన దారుణమైన వంశనాశన హత్యాకాండకు గురియైనాడు (హసీనా మాత్రమే మిగిలింది). అత్యద్భుతమైన సమరశీలుడైన మహానాయకునికి రక్షణలేకుండాపోయింది. జియా వచ్చి సెక్యులరిజం లేదు పొమ్మనాడు. ఇస్లామ్ రాజ్యంగా బంగ్లాసీమను ప్రకటించలేదు గాని ఇస్లామ్ ధర్మానుసారంగా పరిపాలన జరుగుతుందని శాసించాడు. 'జనవాక్య నిర్ణయం' చేయించి, అంతకు ముందే తనకు ఆటంకం కలిగిస్తారనుకున్న దేశభక్తాగ్రేసరులను హతమార్పించి, ఒక దేశనాయకుడనిపించుకొని, ఒక రకమైన 'స్థిరత్వాన్ని' దేశానికి ప్రసాదించాడు. కాని, ముజీబ్ హయాంలో–తన హయాంలో పెరిగిన బంధుప్రీతి–అవినీతి–స్వాతిశయం మున్నగు కారణాల వల్ల, దేశంలో కదలిక రానే వచ్చింది. ముజీబ్ కుమార్తె హసీనాను దేశంలోకి వచ్చి, ప్రజలలో వుండి, ఒక పక్షానికి నాయకత్వం వహించవలసిందని పిల్చినారు. ఆహ్వానాన్ని హసీనా అంగీకరించింది. క్రమేపీ, హసీనా పక్షానికి అనుకూలమైన శక్తులు, పరిపాలించే పక్షానికి అనుకూలమైన శక్తులు పోటీపడి దేశ భవిష్యత్తును దిద్దేవి. ఇంతలో, ఓపిక లేని మంజూర్ సైన్యం సాయంతో తిరగబడి రాజ్యాన్ని వశపరుచుకుందామని గంతువేశాడు. అతడి యత్నానికి సాఫల్యం కొంతవరకు సమకూరింది. కాని, చివరకు నెగ్గలేదు. అతణ్ణి పరిపాలనలో వున్నవారు కాల్చి చంపేశారు. తిరగబడిన సైనిక చర్యను అణిచేశారు.

బంగ్లాదేశ్ అంతరంగిక రాజకీయాలలో మనం ఎన్నడూ జోక్యం కలిగించుకోము. పసతో ఆ రాజ్యానికి వచ్చిన, ముమ్మందు రాబోవు చిల్లరపేచీలను–గంగాజలాల పంపిణీకీ, కొన్ని చిన్న ద్వేషాలకూ సంబంధించిన వివాదాలను–

*మండి జగన్నాథం*

సామరస్యంతో పరిష్కరించుకోడానికి సిద్ధంగా వున్నాము.

భావుకులు, దూరదృష్టిగలవారు అనే దేమంటే, భారత - పాక్ - బంగ్లా రాజ్యాలు, హైందవ, ముస్లిం, క్రయిస్తవ, పార్శీ తదితర ధర్మాలను ఆదరిస్తూనే సామాజిక–ఆర్థిక–రాజకీయ నడవడిలో మూడూ సెక్యులర్‌గా వుండి కలిసికట్టుగా అంతర్జాతీయ వ్యవహారాలను సాగిస్తేనే, మూడు రాజ్యాల భవిష్యత్తూ ప్రకాశమానంగా వుంటుంది. నవభారత–నవపాక్–నవ బంగ్లాల చరిత్ర ఆ దిశకే మనలను నడవమని బోధిస్తున్నదని వారి అభిప్రాయం.

ఈలోగా, చరిత్రను వెనుకకు మరలించే ప్రయోగాలు ఎన్ని జరిగినా మనం కలవరపడవలసిన పనిలేదని మన హితైషుల సలహా. కాని, మనం, మూడు రాజ్యాలలో వారము, జాగరూకులమై వుండి, సరియైన త్రోవలో మనం ప్రయాణించడానికి సాయపడే బుద్ధిమంతులను ఆదరించి, అందుకు తగినట్లుగా ఆచరించగల శక్తిని సంపాదించుకోవలె నని వారు కోరుతున్నారు. వారి విజ్ఞప్తి చెడచెవినిబడదని విశ్వసిద్దాము.

* * *

ఆ ధ్యేయానికి అనుకూలంగానే పీపీ–శాహీ చర్చలు నడిచినవని ప్రాజ్ఞుల నుడువు. ఒక్క అఫ్‌గానిస్తాన్ విషయంలో మినహా మిగిలిన అన్ని విషయాలలో మనమూ–పాకిస్తాన్ సామరస్యంగా వర్తించగలమని తోస్తుంది. ఈ శుభ పరిణామం ఆనందదాయకం.

అఫ్‌గానిస్తాన్ విషయంలో ఆక్రమించిన రష్యా సేనలను ఎదిరించి పోరాడే దేశభక్తులకు సాయపడుతున్నందుకు పాక్‌సీమను అభినందించి, వారికి ఇంకా ఎక్కువ సాయాన్ని అందిస్తాం అనే ధోరణిలో, చైనా ప్రధాని పాక్ పర్యటనలో వెల్లడియైన అంశాలు పాక్ నాయకులపై కలిగించే ప్రభావాన్ని గమనించి, మనం వర్తించవలసి వుంటుంది. ఆపదలో మనలను ఆదుకున్న రష్యాతో విరోధం లేకుండా, అఫ్‌గానిస్తాన్ విషయంలో మనం చెప్పవలసిన మాటను చెబితే, మనలను రష్యనులు అపార్థం చేసుకోరాదు, చేసుకోరు. ఇటువంటి సమయాలలోనే మన **Statesmanship** అనగా హుందాగల రాజకీయ ప్రవర్తన పరీక్షకు లోనవుతుంది. పరీక్షలో మనం నెగ్గేది నిశ్చయమే. దానికి ఒకటే షరతు: మనమందరం దీనిని జాతీయ సమస్యగా భావించి, ధర్మసూత్రాలకు అనుకూలమైన ప్రాపంచిక ధోరణిలో నడుచుకోవలసివున్నది.

* * *

చైనాతోకూడా మనకు పేచీకి ఆస్కారమే లేదని ఆ సీమ ముఖ్యులందరు అభయమిస్తున్నారు. టిబెట్‌లో సగాన్ని భారతదేశం ఆక్రమించుకున్నా భయం

లేదట! మనం రష్యావైపుకు మొగ్గి, అఫ్గాన్ — కంపూచియా సమస్యలలో మన వైఖరిని దిద్దుకుంటున్నామని చైనా వారి అంతరంగిక అభిప్రాయం. ఐనప్పటికీ మనతో ఏ విధంగానూ వివాదానికైౖ చైనా దిగదలుచుకోలేదు. సరిహద్దు సమస్యలనూ, లోగడ ఆక్రమించి వున్న ప్రాంతాల సమస్యలనూ మనమూ వారూ కలిసి కూర్చొని చర్చించుకోవచ్చునన్నారు.

పాక్ నాయకులలో, చైనా నాయకులలో కలిగిన ఈ పరివర్తనకు కారణాలేమైవుండునా అని ఊహాగానం చేయక, వివేకంతో పరిస్థితిని ఎదుర్కొని మనం సంచరించవలెనని మన హితచింతకులు సలహాయిస్తున్నారు

* * *

పోలాండ్‌లో ఉదయించిన కార్మిక, కర్షక సమస్యలు పరిష్కారమైనట్లు కనబడుతుంది ఈ పరిష్కారమార్గం రష్యా నాయకులకు పూర్తిసంతృప్తి కలగకున్నా పోలాండ్‌లో వారిక కల్పించుకోరని తోస్తుంది. రుమేనియా నాయకుడు కాసెస్కూ మొదటినుంచీ అంటూనే వున్నాడు. 'ఇది పోలిష్ ప్రజలు, ప్రభుత్వం, కార్మిక - కర్షక సంస్థలు చర్చించుకుని తేల్చుకోవలసిన విషయం. అందులో ఇతరులకు జోక్యం మంచిది గాదు.' అ విధంగానే జరిగిందని సమాచారం అందుతున్నది. అధికార్లు, సంస్థల నాయకులు, మత గురువులు, పార్టీ నాయకులు ప్రదర్శించిన నిగ్రహం ఎన్నదగినది. సంకట సమయంలో ఎర్రటి సీమలకు,ఇతర సీమలకు అనుసరించదగిన మార్గాన్ని పోలిష్ సీమలో ప్రదర్శించారని అనేకమంది వ్యాఖ్యాత లన్నారు.

* * *

ఇరాన్‌లో ఇస్లాం ధర్మరాజ్య పక్షపాతులకు, లిబరల్ భావాలుగల వారికీ పడిరావడంలేదు. రెండవ కోవకు చెందిన దేశాధ్యక్షుడే తొలగిపోతున్నాడు. ఈ కల్లోలం ఆ దేశ భవిష్యత్తుకు మంచిది గాదని విజ్ఞుల అభిప్రాయమని కొన్ని వార్తలు వెల్వడినవి. త్వరలో ఆ సీమలో రాగల పరిణామాలను అగ్రరాజ్యాలవారూ ఇతరులందరూ శ్రద్ధతో గమనిస్తున్నారు.

---

సెప్టెంబర్ సంచికలో

## నాకు నచ్చిన నా కథ

జీడిగుంట రామచంద్రమూర్తి

---

# చెల్లని రూపాయి



దివ్యప్రభాకర

డైలీ పేపర్లో లిస్టు చూస్తూనే మండి పడ్డాడు_ పరమేశం. తన పేరుగాని, తన భార్యామణి పేరుగాని లేదు. ఎవరి పేరో వుంది.

"ఎవడీ దగుల్బాజీ?" అన్నాడు పరమేశం.

"పిలిచారా?" అంది రేడియో వింటున్న అతని భార్యామణి నాగ్మణి.

"ఇట్రా!" అన్నాడు కోపంగా.

ఒచ్చింది.

"మన నియోజకవర్గానికి నిన్ను సెలక్టు చెయ్యలేదు. పోనీ నన్నయినా ఏడిశారా! అదీ లేదు. వీడి పేరెప్పుడైనా విన్నావా? బంగార్రాజుట!" అన్నాడు పరమేశం_ పేపర్ని నాగ్మణి ముఖానికి తాకించి.

"బంగార్రాజా?.... ఏవిటి మీర నేది?....అయితే చైర్మన్ పచ్చి మోసం చేశాడన్నమాట! పదండి హైద్రాబాదు." అంటూ చిదుల్తొక్కింది నాగ్మణి.

నాగ్మణంటే మాటలు కాదు_ సుప్రసిద్ధ ప్రజాసేవకురాలు! ముఖ్యంగా రెండేళ్ళనుంచీ ఆవిడ తిన్నచోట తినక, పడుకున్న చోట పడుకోక నియోజకవర్గమంతా తిరుగుతోంది.

గోమయాన్ని తీసుకుని భక్తితో కళ్ళ కద్దుకుని నెత్తినెట్టుకునే దేశంలో పుట్టినా గోమయం కాలి కంటితే ముందస్తుగా కార్బాలిక్ సబ్బుతోను, అనంతరం శాండిల్ సోపుతోను కనీసం పదిసార్లు తోమితోమి, ఆనక ఓ పట్టెడు పౌడరు, సీసాడు సెంటు దిమ్మరించుకునే నాగ్మణి_ గత రెండేళ్ళుగా పట్నంనుంచి గ్రామాలకీ, పల్లెలకీ, గూడేలకీ చొచ్చుకుపోయి, రొచ్చులో_ కుక్కిమంచంలో_ కొడవలి తెగి, కుళ్ళిపోయి కంపు గొడుతున్న కాలితో మూలుగుతూ పడున్న హరిజనవాడలోని ముసలయ్య కుక్కిమంచం తాలూకు వాసంబొంగుమీద కూర్చుని యోగక్షేమాలు కనుక్కుని, పొద్దుపోయేలోపల డాక్టర్ని సప్లయిచేసింది!

"ప్రజాసేవంటే ఇంతకంటే ఏముంది?" అని ఆ రాత్రి జరిగిన మీటింగులో నాగ్మణి, ఆమె అనుంగు భర్తా, వీరిద్దరి ముద్దుల అనుయాయులూ బిల్లలు గుద్ది ప్రశ్నించారు_ ప్రజల్ని!

'ప్రజాసేవాతత్పర' అని అప్పటి కప్పుడే ఆమెకి బిరుదివ్వడానికి అభి మానులంతా అదరాబాదరా సిద్ధపడితే "బిరుదులూ, పదవులూ కాదు నాక్కావల సింది-కేవలం మీ అభిమానం మాత్రమే" అంటూ తన ప్రజాసేవాతత్పరతతో పాటు నిస్స్వార్థ బుద్ధికూడా ప్రదర్శిం చింది- శ్రీమతి నాగ్మణి.

ఆమె భర్త పరమేశం అదే సభలో మాట్లాడుతూ, "మా ఆవిడని చెప్పు కోడం కాదుగాని, ఆమెని 'ప్రజాసేవా తత్పర' అంటే సరిపోదు_ 'భూతసేవా తత్పర' అనాలి. ఇవ్వాళ హరిజనవాడలో ముసలయ్యని చూసి ఆమె హృదయం కరిగిందని మాత్రం మీకు తెలుసు కానీ, కాదుకాదు_ మీరు పూర్తిగా పొరపడ్డారు. 'భౌ' మని మొరగవలసిన పెంపుడు కుక్క 'కుయ్‌కుయ్' మన్నదంటే దాని కేదో రోగమొచ్చిందని వెంటనే గుర్తించి ప్రాంతంలోని పశువుల డాక్టర్లందరికీ కార్లు పంపిస్తుంది. ఆ కుక్కబాధ తనదిగా తెల్లవార్లూ రోదిస్తుందని నేను తమకు సవినయంగా మనవి చేసుకుం టున్నా...." అని ఉద్ఘాటించాడు.

రెండేళ్ళు గడిచాయి, ఎన్నిక లొచ్చాయి.

పార్టీలపెద్దల గోచీలు ఊడిపో తున్నాయి. సూపర్‌ఫాస్టు ట్రయిన్లూ విమానాలూ అభ్యర్థిత్వానికై టికెక్కట్లు అర్థించేవారి బరువుతో వింపాదిగా నడు స్తున్నాయి.

నాగ్మణి, పరమేశం నాలుగు చిన్న కార్లలో బయలుదేరారు. అంటే వాళ్ళిద్దరే నాలుగు చిన్నకార్లలో వెళ్ళా రని కాదు. వాళ్ళిద్దరూ ఓ కార్లోనే కూర్చున్నారు. మిగిలిన వాటిల్లో వియో జక వర్గానికి చెందిన ప్రెసిడెంట్లు, మాజీ ప్రెసిడెంట్లు లాంటి ఫిగర్స్ కూర్చు న్నారు.

అయితే శవాన్ని దింపుడుకళ్ళం ఆశతో అక్కడక్కడా దింపుతూ తీసుకుపోయినట్టు కార్లన్నీ మధ్యమధ్య ఆగుతున్నాయి. అలా అగినప్పుడు నాగ్మణి తన కార్లోంచి దిగి మరో కార్లో ఎక్కి, దాంట్లోని ఫిగర్స్‌తో స్థానిక రాజకీయాలు గుండకొట్టిపోసి, ఏ పార్టీకి ఎన్ని కిలోల గుండ వస్తుందో వాళ్ళచేత తూకాలు వేయిస్తోంది.

ఎట్టకేలకు హైదరాబాద్ చేరుకుని హైక్లాసు హోటల్లో దిగి ఆ రాత్రికి ఆరంభోత్సవం పేరిట పార్టీ చేసుకుని, తెల్లారుతూనే పార్టీపెద్దలమీద పడ్డారు.

"మీ ప్రజాసేవా చరిత్రనంతా రాసి ఇవ్వండి_రాజధానికి పంపిస్తాం" అన్నారు శ్రీవారు.

వెంటనే ఓ రాజకీయ వారపత్రిక సంపాదకుణ్ణి సంపాదించి, వాడికో బుద్ధి కొట్టించి, ఓ పచ్చ కాగితాన్ని నల్లగా నలిపి వాడి జేబులో కుక్కి- తమ చరిత్ర

నంతా బెడామడా రాయించేశారు. అది ఆఫీసు ఫైల్లోకి వెళ్ళిపోయినా వీళ్ళు మాత్రం హైద్రాబాదు వదల్లేదు. శ్రీవారి చుట్టూ శ్రీకారాలు చుడుతూనే వున్నారు.

ఎన్నికలు ముంచుకొస్తున్నాయి. మందు పార్టీలంటూ ప్రత్యేకంగా జరుపుకోడానికెవరికీ తీరకలేదు. అందుకని మందు సీసాలు పెద్దల ముందున్న బల్లల మీది కొచ్చేసి తూలుతున్నాయి.

"పోనీ ఓసారి రాజధానికెళ్ళి రారాదూ?" అని శ్రీవారు నాగ్మణికి చెవులో ఉపదేశం చేశారు.

పొలోమంటూ బోలెడుమంది ఢిల్లీ వెళ్ళొచ్చారు.

అంటే ఊరికే ఢిల్లీదాకా వెళ్ళి తిరిగొచ్చారని కాదు. వంగి వంగి దణ్ణాలు, వంగి వంగి మాటలు, ముసిముసి నవ్వులు ముద్దుముద్దు పలుకులు గట్రా కానిచ్చి చిట్టచివరికి బోర్లాపడి, వెల్లకిలాపడి తిరిగొచ్చారు.

"వెళ్ళొచ్చాం" అని శ్రీవారికి సవినయంగా చిత్తగించారు.

అంతట శ్రీవారు 'నో డౌట్, డెఫినిట్, గన్‌షాట్!' అన్చెప్పి వెళ్ళి రమ్మన్నారు.

వీళ్ళేమో ఆమాటే అందుకుని "వెళ్ళొస్తాం" మన్నారు.

"మళ్ళీ రానక్కర్లేదు— మంచిరోజు చూసి నామినేషన్ పడెయ్యటమే నాగ్మణీ!" అన్నారు శ్రీవారు.

ఆ మాట వింటూనే వీళ్ళకంటె ముందే ఊళ్ళోకొచ్చిపడిన భక్తులు రైలుస్టేషన్లో వీళ్ళకి సుస్వాగతం బోర్డు కట్టారు. చప్పట్లు కొట్టారు. వీళ్ళచేత దండలు మోయించారు.

అలాగా విజయోత్సవమే జరిపారు.

ఇది అప్పటి మాట!

తీరా యిప్పుడు లిస్టు చూస్తే పేరు లేదు. ఇదేదైనా ఇంటర్‌మీడియట్ పరీక్ష ఫలితాల్లాగా కంప్యూటర్ పొరపాటేమోనన్న డౌటు లేక పోలేదు. అయినా నాగ్మణికి మాత్రం తోలు ఒలిచి కారం రాచినట్టుంది. అందుకే అరగంటలో ప్రయాణానికి రెడీ అయిపోయింది.

పరమేశం ఎప్పుడూ సిద్ధమే – అత్తాకోడలంచు జరీ ఉత్తరీయంతో, బట్టతల మీద బోసితాతగారి కిరీటంతో!

కార్లో కూర్చున్నవాళ్ళ సంభాషణ కారంత జోరుగా సాగుతోంది.

"నా పరువు ప్రతిష్ఠలు గంగలో కలిపాడు" అన్నాడు పరమేశం.

ఎవడు? అని అడగక్కర్లేదు. శ్రీవారు!

"నా మానాభిమానాలు మంట గలిపాడు" అంది నాగ్మణి.

మళ్ళీ ఎవరని అడగాలా?

పరమేశం పళ్ళు కొరికాడు.

నాగ్మణి నాలికొర్రుకుంది.

"చెడామడా తిట్టిపారేస్తా" అన్నాడు పరమేశం.

"ఆ చెంపా ఈ చెంపా వాయిం చేస్తా" అంది నాగ్మణి.

పరమేశం గుడ్లురిమాడు.

నాగ్మణి గుటకలు మింగింది.

దార్లో కాఫీ తాగితే కోపం తగ్గి పోతుందని, కోపాన్ని రాజుకోనిచ్చి రాజధాని చేరారు. కారుని ఎకాయెకి కార్యాలయానికే పట్టించారు.

అంతా హడావుడి! చీమలు పెట్టిన పుట్టలు! ఎటుచూసినా ప్రజాసేవకులే! కాబోయే ప్రతినిధులు! అవబోయి అవ లేకపోయిన అతిరథులు!! అవలేక పోయినందుకు అనేక రకాలుగా ఓంప్ర పెడుతున్న మహారథులు!!! చచ్చి బూడిదై నెదుల్లో కలిసిన పెద్దల తాలూకు వారసులు! సెంటర్లలో మొలిచిన శిలా విగ్రహాల శిష్యపరమాణువులు!

తపన! ఆందోళన! పొగలు, సెగలు

ప్రజాసేవకోసం ఆక్రందన

"ఉన్నారా!" అని అడిగారు పీళ్ళు.

"లేరు. హైకమాండు పిలిస్తే ఎగి రెళ్ళారు."

ఎవర్ని తిట్టాలి?

"మిదేమైంది? మీదేమైంది?" పర స్పరం ప్రశ్నలు.

"మాది మాదే!"

"మాది పోయింది "

"ఏదో కిటుకుంది "

"ఏదో కిటుకుంది "

సణుగుళ్ళు, గొణుగుళ్ళు!

నాగ్మణి, పరమేశం హోటల్లో దిగారు — ఉసూరుమంటూ. కసిగా, అక్కసు కక్కుకుంటూ అన్నం తిన్నారు. అన్నం తిని మళ్ళీ అక్కసు కక్కుకున్నారు.

"రానీ....రానీ...." అని రికరింగ్‌లో పడ్డారు.

ఆ సాయంత్రం ఆకాశంనుంచి ఊడి పడ్డారు— శ్రీవారు— తుపుక్కు—తుపుక్కున చిరునవ్వులు ఉమ్మేసుకుంటూ!

ఖరారుగాళ్ళంతా కాళ్ళకి మొక్కారు. మిస్సయినవాళ్ళంతా కస్సుబుస్సుమంటూ అసింటా యిసింటా తారట్లాడారు.

నాయకులవారు సర్వసమవర్తి. అందర్నీ ఒకే లెక్కన చూస్తారు. ఒకే చూపు మాస్తారు. అందుకే ఆయన ఖరారుగాళ్ళకీ, మిస్సుగాళ్ళకి ఒకే తీరులో నొసలూ, భుజాలూ, కండువా ఎగరేశారు. అందరి ముఖానా తుపుక్కున ఓ చిరునవ్వు ఉమిసి, మత్తుగా ప్లిమత్తు దగ్గరికి సాగిపోయారు

వారు కారెక్కగానే తోకల ఊపులు ఆగిపోయాయి. తెగి, కారం అంటు కున్న తోకలు చుర్రుచుర్రు మన్నాయి.

అందరూ హడావుడిగా ఎవరి వాహ నాల దగ్గరికి వారు పరుగెత్తారు. కొందరు మ్యూజికల్ చేర్స్‌లో




ప్లేయర్సులా సీటుకోసం కార్ల చుట్టూ పరుగెత్తారు! మొత్తానికి అందరికీ గోచీలూ, కండువాలతో పాటు సిగ్గూ శరం జారిపోయాయి! యిక్కడ వీడ్కోలు యిచ్చారుగదా, మళ్ళీ ఆఫీసు దగ్గిర ఆహ్వానించాలి. అదీ అసలు సంగతి!

ఆ రాత్రి....

నాగ్మణి శ్రీవారికి హోటల్నుంచి ఫోన్ చేసింది.

"మిమ్మల్ని కలవాలి — ఎప్పుడు రమ్మంటారు?" అంది.

"మాట్లాడాలి, అంటే సరిపోయేదానికి 'కలవాలి' అంటుంది — దీనికింకా కొవ్వు అణగలా!" అనుకున్నాడు పరమేశం. పోనీ పసన్నా అయితే కొవ్వు అణక్క-పోయినా ఫరవాలేదు. ఎందుకంటే అధికారానికి పోతే కొవ్వు ఎలాగూ కావాలి!

అప్పటికే అరబాటిల్ పట్టేసిన పరమేశం పెళ్ళాంవంక ఎర్రకళ్ళతో గుర్రుగా చూశాడు.

"అంతకంటేనా! అలాగే....అలాగే సార్!" అంటోంది ఫోన్లో నాగ్మణి.

"ఏవిటలాగే!.... ఇలాగే!.... ఇలా అయితే ఎలాగే?" అన్నాడు పరమేశం పాట పాడుతున్నట్టు.

"అలాగే....ఉంటా సార్?" అంది నాగ్మణి ఫోను నోట్లో నోరెట్టి.

పరమేశం నోరు చప్పరించుకున్నాడు.

"ఏవిటా ఆత్రం?" ఫోను పెట్టాక నాగ్మణి అంది.

"ఏవిఁటా సోది ? ఇదుగో నీ పెగ్గు!" అంటూ గ్లాసు అందించాడు ఆమె పెదాలకి.

"అది కాదు_ మా ట్లాడుతూ ంచే మధ్యలో 'అలాగే యిలాగే' అంటూ మీ వెక్కిరింతలేవిఁటంట ? ఆయన సలే ఫోన్లోంచే పేగులు లెక్కెట్టేస్తాడు," అంది గ్లాసంతా ఒకేసారి గుటకేస్తూ.

"సైన్సింకా డెవలప్ కాలేదు గాని లేకపోతే ఫోన్లోంచే వాణ్ని పొడిచేసుం దును!" అన్నాడు పరమేశం ఆవేశంగా!

"ఒస్తున్నాడు – పొడవండి," అంది మళ్ళీ గ్లాసులు నింపుతూ.

"వాహట్! ఇక్కడికే! ఆలిండియా ఫిగర్! ఆల్ అం.ప్ర. పార్టీ సర్వాధికారి ఆయనే! ఆఫ్టరాల్ 'అమ్మన్నదొడ్డి' నియోజకవర్గానికి పార్టీ టికెట్టు తెచ్చు కోలేక తన పరువు ప్రతిష్ఠల్ని, తన మానాభిమానాల్ని పోగుట్టుకున్న పరమేశంగాణ్ని పలకరించడానికి_కాదు, కాదు _ పరామర్శించటానికి యిక్కడికి వస్తున్నాడా ? ఆశ్చర్యం! రానీ రానీ.... ఆయన్నో పట్టు పట్టాలిగాని నువ్వు చకచకా గ్లాసుల్లో పోసెయ్!" అని అరుస్తున్నట్టన్నాడు పరమేశం.

"మాట్లాడకుండండి. ఆయన చెప్పే దేదో ముందుగా విన్దాం! మీ తిట్లూ, నా దెప్పుళ్ళూ తర్వాత...." అంది నాగ్మణి నార్మల్ దాటుతూ.

"నేను తిట్టను ఉతుకుతా...రూడిం చేస్తా "

"ఆ తర్వాత ఆరేస్తారా ?" అంది పకపకా, ఊగిపోతూ నవ్వుతూ నాగ్మణి.

"నవ్వవే, నవ్వు ఇక్కడ కాదు మన నియోజకవర్గంలో కెళ్ళి నాలుగు రోడ్ల మధ్య నిల్చొని, నాలుగు ఫిగర్లు ఉన్నచోట నవ్వవే....నవ్వుతున్నావ్ సిగ్గులేక!" అని వెటకరించాడు పరమేశం.

"సర్లే కూచోండి....నాలుగు గ్లాసులు పడితే అసలు సంగతేదో ఆయనే చెపు తాడు. నవ్వాలో ఏడవాలో అప్పుడు తేల్చుకుందాం. ఆయన రాగానే అనవస రంగా ఎగిరిపడి నాచేత తిట్లు తినకండి" అంది నాగ్మణి.

"తిడతావా ? తిట్టు....తిట్టవే! నన్ను తిట్టాల్సిందే! నీ చేత్తాగించి సరదాకి _ బతిమాలి – తిట్టించుకోలా ? ఇప్పుడు తాగి సీరియస్‌గానే తిట్టెయ్! మరి నాతో కలిసి వాణ్ని కూడా తిట్టు_నీకు దమ్ము ఉంటే! నువ్వే ప్రజాసేవకురాలివైతే... నాతోపాటు తిట్టాలి! తిడతావా ? తిడ తావా ?" అంటూ రెట్టిస్తున్నాడు పరమేశం.

అట్టి సమయంబున కవాటముపై ఢమరుక ధ్వనులవలె టకటక ధ్వనులు!

"ఇష్! ఆయనొచ్చారు...." అంది నాగ్మణి లేస్తూ.

"ఆయనొచ్చారా ? ఆయన ? మరి ఈయనెవరే, ఈయన" అంటూ తన గుండెలమీద కొట్టుకున్నాడు.

"నోరు మూస్తారా, లేదా ?" అంది రహస్యంగా.

"గుప్‌చుప్ !... స్వాగతం పలుకు... పలుకు అంటా పలుకు."

నాగ్మణి తలుపు తీసింది. తీస్తూనే వినయంగా వంగి దణ్ణంపెట్టింది.

శ్రీవారు చిరునవ్వులు తుపుకు తుపుక్కున ఉమ్మేసుకుంటూ గదిని పావనం చేశారు. చేస్తూనే "ఆ! అంతా బావున్నారా? మనవాళ్ళంతా కులాసా? ఆ! ఈయనా ఇక్కడే వున్నారే! నైస్ నైస్," అన్నారు.

"కూర్చోండి" అంది నాగ్మణి తలుపు వేసివస్తూ.

ముగ్గురూ కూర్చున్నారు.

"మేము తమర్ని కలిసి ముప్ఫయి రోజులయింది. రోజుకి రెండు చొప్పున ముప్ఫయి రెళ్ళ అరవై నమస్కారాలు శ్రీవారూ!" అన్నాడు పరమేశం వినయాన్ని తెచ్చిపెట్టుకుంటూ.

"మనవాడప్పుడే విమానమెక్కేశాడే ?" అన్నారు శ్రీవారు.

"విమానం ఎక్కాం, రైలెక్కాం, కారెక్కాం.... ఆఖరికి రెండెడ్ల బండి ఎక్కాం. ఇక మా నియోజకవర్గంలో గాడిదెక్కడవే తరవాయి.... తమ దయ వల్ల...." అంటూ పరమేశం సాష్టాంగం పడిన ఫోజుపెట్టాడు.

శ్రీవారు చిద్విలాసంగా నవ్వారు. నాగ్మణి తోడుకి నవ్వింది. నవ్వి, గ్లాసు నింపి ఆయన చేతికిచ్చింది.

"తెలుసుగా నా డోసు...." అన్నారు శ్రీవారు నొసలు ఎగరేసి నవ్వుతూ.

"తెలుస్తెలుస్తెలుస్తెలుసు" అంటూ చేతులుతిప్పుతూ డాన్స్‌చేశాడు పరమేశం.

గ్లాసు పూర్తిచేసి టేబిలుమీద పెడ్తూ శ్రీవారు అన్నారు. "మనవాడు నామీద చాలా కోపంగా ఉన్నాడే!"

"కోపవా? లేదులేదు. భక్తే! అప్పుడప్పుడు దేవుళ్ళని కూడా తిడుతూండటం మన సంప్రదాయం కదండీ! రామదాసు ఏమన్నాడు? 'ఎవడబ్బ సొమ్మని కులుకుతూ తిరిగేవు - రామచంద్రా!' అని తిట్టలేదూ!" అంటూ రాగయుక్తంగా పాడాడు పరమేశం.

మొగుడు ముక్కుమెయ్యా తాగినా సమయానికి తగినట్టు లౌక్యంగా శ్రీవారి గుండెల్లో గుద్దుతున్నందుకు నాగ్మణి సంబరపడింది.

మరోసారి మూడు గ్లాసులూ గాల్లో తేలి ముద్దెట్టుకున్నాయి - ఛంగున!

"జరిగిన సంగతి చెప్పనా?" అన్నారు శ్రీవారు నాగ్మణి మాంగల్య ప్రాంతీయాభివృద్ధిని కౌతుకంగా, తమకంగా గమనిస్తూ.

"జరిగిన సంగతి - మా పరువు ప్రతిష్ఠల్ని, మానాభిమానాల్ని పడదోసి పార్టీ టికెట్లు మీదనుంచి దూకుకు పోవడం! ఇక జరగవలసిన పని.... మేమిద్దరం మా ప్రజాసేవా కార్యక్రమాలకి మంగళం పాడుకుంటూ ముసుగేసుకు

బొక్కి-చోడం " అంటూ పరమేశం పెళ్ళాం పయిటచెంగు లాగి నెత్తినేసుకున్నాడు.

"మిష్టర్ పరమేశం! నెక్ట్స్‌టైమ్ బెటర్ లక్ అనుకోవాలిగాని అలా జావ కారిపోతే ఎలాగయ్యా!" అని ఊరడింపబోయారు శ్రీవారు.

"ధనమానాలని ధారపోసింది ఇప్పుడూనూ బెటర్‌లక్ నెక్ట్స్‌టైముకీనా? ఈ లోపల మా నియోజకవర్గంలో మా తలలు వాలినవి వాలినట్టే వుండిపోయి నెక్ట్స్‌టైముకి పండేపోతాయి," అన్నాడు నిష్ఠూరంగా పరమేశం.

"నిజం సార్! మా బతుకులు బజారున పడ్డాయి. దానికి విడుగుదుగా ఈ టికెట్టేదో ఒస్తుందీ, గెలుస్తాం, దాంతో అన్నీ పరిసిదారిపోతాయ్ – అనుకున్నాం. కానీ .... మీరు .... మీరు" మత్తుతో, మత్తులో కోపంతో, కోపంతో ఒణుకుతో నాగ్మణి అంది. ఆమె మాంగల్యాలు ఒణుకుతున్నాయి.

"నేను ?" అంటూ కొంచెం సీరియస్ గానే అడిగారు శ్రీవారు చూపులు మార్చుకుంటూ.

"మీరు....మీరు....మోసం చేశారు" అని చకచకా అనేసింది నాగ్మణి.

లేవదీసుకుపోయినవాడు అన్నీ దోచుకుని, నడినగరంలో వదిలేసిపోతే పాతివ్రత్యాన్ని బజారున పెట్టినట్టూ, ఆ తర్వాత కొంతకాలానికి వదిలేసిపోయిన వాడు నడిరోడ్డుమీద ఎదురయినట్టూ అనిపిస్తోంది నాగ్మణికి! చురుగ్గా, చుల్కనగా, వాడిగా, వేడిగా మళ్ళీమళ్ళీ అంది "మోసం చేశారు, మోసం చేశారు" అని!

శ్రీవారి ముఖం గంభీరంగా మారింది. మందు ముఖానికెక్కి అప్పటికే అది కందగడ్డలా వుంది. ఆపైన వినరాని మాట విన్నట్టు ఆ కందగడ్డ తుకతుక ఉడుకుతోంది. శిరోవేష్టనాన్ని తీసి దులిపి మళ్ళీ పెట్టుకుని, తీసి బల్లమీద పడేసి, గ్లాసులో వున్నదాన్ని కాస్తా గొంతులో ఒంపేసుకుని "చాలా నిర్మొహమాటంగా మాట్లాడుతున్నావ్ నాగ్మణీ!" అన్నారు! ఆయన చూపుడు వేలు నాగ్మణి ముఖానికి దగ్గరగా వొచ్చి బెదిరిస్తోంది.

"మా బాధని బట్టి...."అంది నాగ్మణి

"మా భంగపాటుని బట్టి కూడా...." అని పూర్తిచేశాడు పరమేశం.

"సరే అయితే....వినండి...." అని ఏదో కథ మొదలుబెట్టబోతున్నట్టు అని, ఆగి.... "మన సెలక్షన్ కమిటీ చైర్మన్ గారి వయస్సెంతా ?" అనడిగాడు – అష్టావధానంలో అప్రస్తుత ప్రశ్నలా!

"వారు లేకుండానే వారి షష్టిపూర్తి చేశాంగా – మా వూళ్ళో...." అన్నాడు పరమేశం – 'వారు లేకుండానే వారి శవాన్ని దహనం చేశాంగా' అన్నట్టు!

"అవునా!.... నీ వయస్సెంత




ఏమండీ పిల్లలకి పొట్టచించినా తెలుగు ముక్కరాదు
వాళ్లని కాన్వెంట్ మాన్పించి తెలుగు బళ్లో చేర్పిద్దామా

నాగ్మణీ !" అన్నారు శ్రీవారు – మూడు ముడతల మీదున్న నాగ్మణి పొట్టవంక చూస్తూ.

"దాని వయస్సు అది చెప్పదు. చెప్పినా నిజం చెప్పదు. నిజం చెప్తుతా నన్నా నేను చెప్పనివ్వను. అందుకని దాని వయస్సు అడక్కండి. కానీ.... అది.... ఇరవయ్యేళ్ళ కూతురికి తల్లని మాత్రం చెప్పగల్ను...." అంటూ పక పకా నవ్వాడు పరమేశం.

నాగ్మణి అతన్ని మింగబోయింది. పరమేశం పెదాలు బిగించి, రెండు చేతుల్తో వాటిని మూసుకున్నాడు.

మిలిట్రీలోకి రిక్రూట్ చేసుకుంటున్నట్టు ఇప్పుడీ వయస్సు కొలతలూ, ఒంటి తూకాలూ ఎందు కవసరమయ్యాయో నాగ్మణికి అర్థంకాలా ! నొసలు చిట్లించి శ్రీవారి చూపులకి అడ్డంగా కొంగు తెర వేసేసింది.

"చైర్మన్‌గారి వ్యవహారం, చేస్తూ మీకు తెలియవులా వుంది. ప్రజాసేవకు రాళ్ళ సేవలతో ఆయన ఒళ్ళు మొద్దుబారి పోయింది. మీ నియోజకవర్గాని కిప్పుడు టిక్కెట్టిచ్చాం చూడండి...."

"ఎవడు వాడు ? బంగా ర్రాజా ? ఎక్కడి వాడు ? వాడి ప్రజాసేవా చరిత్రేవిఁటి?" అని ఎగిరాడు పరమేశం.

"ఎక్కడి వాడైతేనేఁ ? చరిత్ర ఏదైతేనేఁ ?.... ఇదుగో ఈ ఫోటో చూడండి...." అంటూ శ్రీవారు తమ లాల్చీజేబులోనుంచి ఓ ఫోటోతీసి బల్ల మీద పడేశారు.

చూస్తూనే పరమేశం పరవశమై పోతూ "రంభా? ఆహా! ఎవరీ స్టారూ? ఏమా ఫిగరూ?" అన్నాడు.

నాగమణి అతన్ని మోచేత్తో ఒక్క పోటు పొడిచి "ఉన్నదాన్ని ఒదులుకోడానికి సిగ్గులేదు. లేనిదాన్ని ఆశించడానికి అంత కన్నా సిగ్గులేదు." అని కసిరి, ఫోటో వంక ఓసారి చూసి, ఈసుపడి, మళ్ళీ చూసి, గ్లాసులోని విషం తాగి, మరింత విషం కక్కుతూ "ఎవరీ పిల్లముండ?" అంది.

శ్రీవారు ఈసడింపుగా చూశారు. యాష్ట్రేలోని సిగరెట్టు పీకని చూసి నట్టు చూశారు. రేపు రిటయిరయ్యే లంచ గొండి వంక చూసినట్టు చూశారు.

"పిల్లముండా?? పిల్లముండా కాదు బాలరండా కాదు బంగార్రాజు రెండో యిల్లాలు! ఇరవయ్యేళ్ళ బంగారప్పిల్ల గుర్రం. ఇంతకీ నాగమణీ! నీకు సూటిగా చెప్పేదేవిటంటే" అంటూ తాపీగా వెనక్కి జార్లబడి "ఇది చైర్మన్‌గారి ఛేస్టు," అన్నాడు శ్రీవారు.

మిగలపండిన సీతాఫలాన్ని చేత్తో ఒత్తినట్టుంది - నాగమణి వల! పాములు ఉండలు చుట్టుకుంటున్నట్టున్నాయి నాగమణి కడుపులో పేగులు!

పరమేశం మంచుకి బిగిసి ఎప్పచ్చిన మనిషిలా వున్నాడు!



శ్రీవారు వాళ్ళ గొడవ పట్టించుకో లేదు. 'మీరు మోసం చేశారు' అని తన ముఖానే వాళ్ళన్నందుకు ఆ మాత్రం ఎదురుదెబ్బ చాలదనే అనుకుంటున్నారు.

సీసాలో వున్నదంతా గ్లాసులోకి వచ్చేసింది. శ్రీవారు గ్లాసుని దించకుండా దిగమింగి లేచి నిల్చున్నారు.

"మిష్టర్ అండ్ మిసెస్ పరమేశం! నెక్స్ట్‌టైమ్ బెటర్‌లక్! ఈ సారికి బంగార్రాజు తరపున ప్రచారం చెయ్యండి ఎప్పుడే అస్త్రం ఒదలాలో తెలియాలయ్యా! అయినా ఇరవయ్యేళ్ళ కూతురుండగా" అంటూనే చరచరా నిష్క్రమించారు శ్రీవారు!

పరువుప్రతిష్ఠలూ, మానాభిమానాలూ ధనధనా పేలిపోతున్నాయా గదిలో!!!

———




ఏపుగా గుబురుగా ఉన్న చెట్ల నీడలు విశాలంగా పరచుకుని ఉన్నాయి. పిల్లలు వాటిక్రింద ఆడుకుంటున్నారు. కొందరు పెద్దలు అక్కడక్కడ కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ- లేదా పత్రికలు తిరగేస్తూ కూర్చున్నారు.

ఉన్నట్లుండి పత్రికలు చదువుతున్న ఒకడు ఒక బొమ్మ చూపించి నవ్వుతున్నాడు. మిగతావారు కూడా చూచి పకపక నవ్వారు. రాజారావు వారి దెస కుతూహలంతో చూడటం వారు గమనించి అతడికి చూపారు. అది ఒక కార్టూన్. ఒక నిరుపేద చెట్టునాటుతూ కొడుకుతో అంటున్నాడు- "పెద్దయ్యాక ఉండటానికి నీకు వసతి కల్పిస్తున్నాను." అని. వాడు అర్థంచేసుకోలేక దేబిరించి చూస్తున్నాడు.

రాజారావు నవ్వాడు. పుస్తకం తిరిగి స్వంతదారు చేతిలోకి వెళ్ళిపోయింది.

రాజారావు ఆ చిత్రాన్ని గూర్చి ఆలోచిస్తున్నాడు. ఆ నిరుపేదవాడైన తండ్రి గొప్ప సత్యాన్ని బోధపరుస్తున్నాడు. చెట్టు నాటాడు. అది ఒకరోజు మహావృక్షమై ఎందరికో నివాసస్థానంగా ఉంటుంది. కొడుకుతో నీకు నీడ కల్పిస్తున్నాను-అన్నాడు. అది అతడి బాధ్యత. "ఒరేయ్ నువ్వు నాటు- పెద్దయ్యాక నాకు పనికివస్తుంది" అనలేదు. ఆ చెట్టు నీడలో తనుకూడ హాయిగా ఉండవచ్చు.

రాజారావు హృదయం భారభరితమైంది. హృదయంలోంచి పొర్లి కన్నీటి ద్వారా బహిర్గత మవ్వాలని ప్రయత్నించే అతడిలోని ఆవేదనను బలవం

తంగా అదిమిపట్టి మెల్లగా లేచి గృహోన్ముఖుడయ్యాడు.

ఇల్లు జేరగానే దుఃఖం కట్టలు త్రెంచుకుంది. లోపల చాలాసేపు ఒంటరిగా కూర్చుని ఉపశమన మందిన తరువాత బైటికొచ్చాడు.

జేబులో ఉత్తరాన్ని బైటకితీసి దీపం వెలుగులో మరీ చదువుకున్నాడు. రెండు పేజీలు ఏవేవో రాశాడు కొడుకు. అదంతా తాను ఎంత ఖర్చుల్లో ఉన్నాడో– ఎంత పొదుపు చేయవలసి వస్తుందో– భార్యకు ఎంత అనారోగ్యంగా ఉందో– రాశాడు. చివరికి తేల్చి చెప్పిందేమిటంటే 'నిన్ను ఇక్కడికి పిలిపించుకోవటం కష్టం' అని.

ఆ ఉత్తరాన్ని నాలుగైదుసార్లు చదువుకున్నాడు ఆ రోజు. మరి దాని ఆవశ్యకత లేదు. పర్మని చింపి చిన్న చిన్న ముక్కలుగా చేసి పారేశాడు.

పిల్లలు– పెద్దలు– రైతులు ఒక్కొక్కరే తన దగ్గరకు వచ్చి ఏవేవో ప్రశ్నలు వేసి సమాధానాలందుకుని వెళ్తున్నారు. రాజారావుకు సంధ్యవేళలో అదే పని. చెట్ల విషయం అందరికి సలహా లిస్తాడు. పురుగుపట్టిన చెట్లకు మందులు కూడ ఇస్తాడు. అంతా వెళ్ళిపోయారు. రాత్రి ఎనిమిది గంటలైంది. ఒక్కడు బైటకుర్చీలో కూర్చుని వున్నాడు. అతడి మనసు మళ్ళీ ఆ చిత్రంమీదకి, ఆ ఉత్తరం మీదకి మళ్ళింది ఆ పేదవాడు ఎంత బుద్ధిమంతుడు– అనుకుంటూ ఉండేసరికి ఒక్క పిల్లతెమ్మెర నారింజ పూత వాసల్ని మోసుకొస్తూ అతడిని మెల్లిగా తాకింది. మరి కాసేపటికి మరో పిల్లగాలి పూవుల పరిమళాన్ని వెదజల్లుతూ దాటిపోయింది.

చుట్టూతా చూచాడు. అన్నీ తన చెట్లే! ఎంత బాగా పెరిగాయి! ఎంత అందంగా ఉన్నాయి!

ఆ రోజుల్లో బి. ఎస్సీ పాసయి అగ్రికల్చర్ ఆఫీసులో గుమాస్తాగా చేరాడు. అక్కడే కొంత భూమి సంపాదించి ఇల్లు కట్టుకుని స్థిరపడిపోయాడు. అతడికి తోట పెంపకం హాబీ– తోటలో రకరకాల చెట్లు నాటటం ఎంతో సరదా– మొక్కలు తెప్పించి నాటించటం–ఎరువు వేసి నీళ్ళుపెట్టి శ్రద్ధగా చూచుకోవటంలో ఎంతో ఆనందాన్ని పొందేవాడు. ఒక్క ఆకును పురుగు కొరికివేస్తే బాధపడిపోయేవాడు. ఒక్కో మొక్క ఆకు వేసి మారాకువేసి లేతకొమ్మలతో నిగనిగలాడితే చూచి అమితంగా సంతృప్తి చెందేవాడు. కూరగాయ–పూలమొక్కల్లా ఈ చెట్లు ఎందుకు పెరుగవో! అని బాధపడిపోయేవాడు. చెట్లన్నీ అసంఖ్యాకాలైన కొమ్మలతో ఆకులతో గుబురుగా ఉంటే దాని నీడలో పేద తీరటంలో ఉన్న ఆనందం దేనికి సాటి?

తను చిన్నగా ఉన్నప్పుడు తన తండ్రి

బోధపర్చాడు. "కూరగాయల మొక్కలు వాటి కాలంలో కాపు ఇస్తాయి. కానీ ఫలవృక్షాలు ఇతర వృక్షాలు అలా కాదు. ప్రతి సంవత్సరం కాపుకువచ్చి కాయలు కాస్తాయి. కొన్ని సంవత్సరాలు వాటి ఫలాల్ని మనం అరగించి ఆనందిస్తాము. కనుక అవి మెల్లగా పెరుగుతాయి. ఫలానికి కావలసిన బలాన్ని, రుచిని ఇవ్వటానికి, ఆ ఫలం బరువుమోయటానికి కావలసిన శక్తిని కొమ్మకు ఇవ్వటానికి అవి కొన్ని సంవత్సరాలు పెరగాలి," అని రాజారావుకు అయినా విసుగ్గానే ఉండేది.

ఒక్కరోజుకు - ఒక్క చిన్న ఆకు తొడిగితే.... ఆ ప్రకారంగా పెద్ద వృక్షం కావటానికి ఎన్ని సంవత్సరాలు పడ్తుందో! తను ఆ రోజుల్లో చిన్నవాడు! ఏడాదికి మూడు నాల్గు సెంటిమీటర్లు మాత్రం పెరిగేవాడు!

ఇల్లు కట్టుకున్న తరువాత చుట్టూ ఉన్న స్థలంలో తోటవేశాడు. కొంత భాగంలో పళ్ళచెట్లు నాటాడు. తోట చుట్టూ కంచె వేయించాడు, పశువుల బెడదకన్నా పిల్లల అల్లరి ఎక్కువని. ఇంటిప్రక్కన ఎలిమెంటరీ స్కూలు ఉంది.

మొక్కలు నాటుతుంటే పిల్లలు సహజ ఉత్సుకతతో ఒక్కొక్క మొక్క పేరు అడిగి తెలుసుకున్నారు. ఎన్ని రకాల చెట్లు అవుతాయి! ఈ పిల్లలు మహదానందంతో గంతులువేస్తూ వెళ్ళారు. కొన్నాళ్ళకు అవి కాయలు కాస్తాయని అప్పుడు రాళ్ళు రువ్వి ఆ కాయల్ని కొట్టి తినవచ్చునని ఉవ్విళ్ళూరారు. కాని కొందరి ఆలోచనలు భిన్నంగా ఉన్నాయి మరి!

వారం రోజుల్లో మొక్కలు వ్రేళ్ళు విస్తరింపజేసుకుని పాతుకుపోయాయి. ఆకులు సూర్యునివేపు తలెత్తుకుని నిగనిగలాడాయి. రాజారావు ఒక్కొక్క మొక్కను అపురూపంగా చూచుకునేవాడు.

వచ్చీపోయేవాళ్ళు హాస్యం చేసేవాడు. "ఏమండోయ్ .... ఈ పళ్ళు కాయలు మాకూ్కడా" అనేవారు.

కొందరు అపహాస్యంగా "ఈ పళ్ళు కాయలు తమరు తినాలనే?" రాజారావు నవ్వేవాడు. "మరుక్షణంలో ఏంజరుగుతుందో చెప్పలేము. ఈ చెట్ల కాయలు నేను తినకపోయినా మన పిల్లలు తింటారు. మన తరంవారు తింటారనే కదండీ మన తండ్రులు, తాతలు చెట్లు నాటించి తోటలు పెంచారు. వాళ్ళు ఆ విధంగా చేయబట్టి కదా మనం ఈ నాడు ఆ పళ్ళను తినగల్గుతున్నాము."

"ఔనౌను. తుంగభద్ర నీళ్ళు - మీ పళ్ళు తియ్యగా ఉంటాయిలెండి" అని నవ్వుతూ వెళ్ళిపోయేవారు.

రెండు రోజులు గడచిపోయాయి.

మూడవరోజు మధ్యాహ్నం ఒక నిద్ర తీసి రాజారావు తోటలోకి వెళ్ళాడు.

అంతే మానుపడిపోయాడు!

చిన్నరకం గాలివాన వచ్చినట్లున్నది. మొక్కలన్నీ పీకిపారేసి ఉన్నాయి. తుంపులుగా చేసి, నలిపివేసి, ఆకులు దూసేసి, కాళ్ళతో త్రొక్కి ఎన్ని విధాలుగ నాశనం చేయగలరో అన్ని విధాల నాశనంచేశారు. ఆ మట్టిమీద అడుగులనుబట్టి నేరస్థులెవరో తెలిసిపోయింది.

అతని హృదయాన్ని నలిపివేసి త్రొక్కివేసినట్లైంది. ఆ చిన్న అడుగుల త్రొక్కిడి తన హృదయంలోనే పడినట్లుగా బాధపడిపోయాడు.

ఆ పిల్లలు ఎందుకిలా చేశారు?

నాశనంచేసి తద్వారా ఆనందించాలన్న పైశాచికానందం ఈ పిల్లల కెలా వచ్చింది? కలకల్లాడుతూ కనులపండువుగా ఉన్న ఆ చిన్న మొక్కల్ని ఎలా పీకివేసి త్రొక్కి నాశనం చేయగల్గారు? సహజంగా పిల్లల్లో దేన్నైనా విరగ్గొట్టి లోపల ఏమున్నదో చూడాలని-ఎక్కి-త్రొక్కి అల్లరిచేయాలన్న బాల్య చాపల్యపు బుద్ధి ఉండటం సహజం. విచక్షణాజ్ఞానంగాని, మంచి-చెడు తెలియని ఈ వయసులో వారికి న్యాయాన్యాయ విచారణ చేయగల జ్ఞానం ఉండదు. కాని తప్పుచేస్తున్నట్లు తెలిసికూడా తప్పు చేయటం ఈ చిన్న వయసులో నిరసింపదగ్గ విషయం.

రాజారావు ఆ బీభత్సాన్ని చూస్తూ చాలాసేపు దీర్ఘాలోచనలో పడిపోయాడు.

కొంతసేపటికి పిల్లల అరుపులు గోలగోలగా వినబడింది. అటు కేసి చూచాడు. కొమ్మలు కొట్టి వాటిని లాక్కొని వెళ్తున్నారు పిల్లలు. ఆ కొమ్మలమీద కొందరు కూర్చుని "ఫ్రీ రైడ్" ఎంజాయ్ చేస్తున్నారు. అది వారి వాహనం అన్నమాట. అంతా బడివైపుకు వెళ్ళారు. రాజారావునుగాని తోటవైపుగాని చూచీ చూడనట్లు దాటిపోయారు.

రాజారావు కంచెను కట్టి మెల్లగా యింటి వైపుకు వెళ్ళిపోయాడు.

పిల్లలకు జ్ఞానోదయం కావాలి. ఇలాంటి అల్లరి పనులు- దేన్నైనా మొదలంటా నాశనంచేయాలన్న దుర్బుద్ధి వారిలోనుండి పూర్తిగా తొలగించాలి. అప్పుడే తను తోటవేసి నిర్భయంగా పెంచవచ్చును. అంతవరకు వనాన్ని చెరిచే కోతులకు భయపడవలసినదే.

జూన్ నెల. బళ్ళు తెరిచారు. సమితి ప్రెసిడెంట్ బడిని చూడటానికి వస్తున్నారు. అంతా వారి రాకకోసం సిద్ధం చేస్తున్నారు.

రాజారావుకు ఆహ్వానం వెళ్ళింది.

ఆయన చాలాసేపు ఆలోచించారు. పిల్లలకు చెట్లయొక్క అవశ్యకత- దైనిక జీవితంలో వాటి ప్రాముఖ్యత తెలుయజేయాలి. మొక్కల పెంపకంలో

చెట్లు నాటి శ్రద్ధగా చూచుకోవటంలో వారికి ఆసక్తి కల్గించాలి. ఏటి ఒడ్డున ఉన్న మనిషికి నీటిఎద్దడి ఎలా ఉంటుందో తెలియదు. నీడపట్టున ఉన్న మనిషికి చెట్టునీడలో ఉన్న హాయి అనూహ్యం. రాజారావు చాలాసేపు ఆలోచించాడు. ఆ సాయంత్రమే ప్రెసిడెంట్‌ను కలవటానికి వెళ్ళాడు. మరుసటి రోజు వెళ్ళి ఒక్కొక్క ఉపాధ్యాయుణ్ణికలిసి వారితో మాట్లాడివచ్చాడు.

తత్ఫలితంగా ప్రెసిడెంట్ ప్రోగాంలో మార్పు వచ్చింది. ఆయన ఉదయం ఎనిమిది గంటలకు రావటం లేదు. పదకొండు గంటలు దాటాక వస్తారుట! పదకొండు గంటలకు పిల్లలు ఇంటికి పరిగెత్తుకుని వెళ్ళి ఆవురావురు మంటూ అన్నాలు తింటారు. ఆ సమయంలో వారిని ఇళ్ళకు పంపకుండా బడిలోనే ఉంచేయాలి.

పిల్లలంతా శుభ్రంగా తయారై వచ్చారు. క్లాస్ రూంలు శుభ్రంగా చేశారు. నల్లబల్ల బెంచీలు, కుర్చీలు, చాపలు అన్నీ తుడిచి దులిపి సర్ది ఉంచారు. ప్రెసిడెంట్ వస్తున్నారంటే పిల్లలు భయంతో ప్రశాంతంగానించి అల్లరితగ్గించి గప్‌చిప్‌గా ఉన్నారు.

పదకొండు గంటలకు గంటకొట్టారు. బిలబిలమంటూ అంతా బైటికొచ్చారు.

ఎంతో ఉత్సాహంతో బార్లుదీరి నుంచున్నారు. పదకొండున్నర అయింది ఆయన రాలేదు.

ఆకలి-ఎండ- కదలకుండా అరగంట నుంచునే సరికి పిల్లలు అలసిపోయారు. టీచర్లకు జాలివేసింది. బాసిపట్లేసుకుని కూర్చోమన్నారు. ఎండ మాడ్చివేస్తోంది. స్కూలు ఆవరణంలో చెట్లు లేవు. ఉన్న రెండు చెట్లు చాలా దూరంలో ఉన్నాయి.

వేడిగాలి వీస్తోంది.

ఒక టీచర్ అన్నాడు "వెధవది ఒక్క చెట్టు కూడా లేదు." ఇంకో అతను విసుక్కున్నాడు. "ఉన్న నాల్గు చెట్లను విరిచి కొమ్మలు కొట్టి- ఆకులు పీకి- రాళ్ళతో కొట్టి నాశనంచేశారు. అవి ఏపుగా పెరగకముందే చంపేశారీ వెధవలు. "అంతటితో ఒదిలారా- కొమ్మన్న పండుగకి ఎన్ని కొమ్మల్ని నరుక్కువస్తారో!" ఇంకో టీచర్ క్రోధంతో అన్నాడు. పిల్లలు వింటున్నారు. నోరెత్తి ఒక్కమాట అనలేకపోయారు. టీచర్లు చూరుకింద నీడలోకి జారుకున్నారు. కొత్త చిన్నపిల్లలు నసిగారు; "క్లాసులో కూర్చుంటాం సార్"

"అరె.... ఒద్దు.... ఈలోగా ఆయన వచ్చేస్తేనో?"

ఆహ్వానితులు, పెద్దలు స్కూలు వరండాలో కూర్చునిఉన్నారు. రాజారావు ఒక మూలగా నుంచుని చూస్తున్నాడు. మరో పావుగంట గడిచేసరికి పిల్లల ముఖాలు వాడిపోయాయి. చొక్కాలెత్తుకుని తలలమీద వేసుకున్నారు చిన్నపిల్లలు.

ఇంతలో హెడ్ మాస్టరు వచ్చి అందర్నీ వరండాలోకి వెళ్ళమన్నాడు.

పిల్లలు పరుగులమీద నీడలోకి వెళ్ళారు. కొందరు పంపుదగ్గరికి వరిగెత్తారు.

రాజారావు అనుకున్నాడు: ఇంత చిన్న పెదవుల చిన్నబుర్రల్లోకి ఒక సత్యాన్ని ప్రవేశపెట్టి జ్ఞానోదయం కల్గించటానికి ఎంత బాధపడవలసి వస్తోంది! అని.

సరిగ్గా పన్నెండున్నరకి ప్రెసిడెంట్ గారి కార్ హార్న్ వినిపించింది. పిల్లలు క్షణంలో వారివారి స్థానాల్లోకి వెళ్ళి అటెన్ షన్ లో నుంచున్నారు.

ప్రెసిడెంట్ - ఆయన పరివారమంతా వచ్చారు. పిల్లలకు బుద్ధిమాటలు చెప్పి బడిని ఒకమారు చూచి వెళ్ళిపోయారు. అంతసేపు పిల్లలు ఎండలో మాడిపోయారు. ఆయనటు వెళ్ళగానే పిల్లలు ఇళ్ళకు పరుగులు దీశారు.

పైకి అన్లేక ప్రెసిడెంట్ ఆలస్యాన్ని లోలోపల తిట్టుకున్నారు పెద్దలు.

ఇలా ఆలస్యం చేస్తారని టీచర్లకు హెడ్ మాస్టర్ కు తెలుసునని ఎవ్వరికీ తెలియదు.

కర్నూలు దగ్గర సుంకేసుల ఆనకట్ట ఉంది. పిల్లల్ని తీసుకుని ఎక్స్ కర్షన్ కు వెళ్ళాలనుకున్నారు టీచర్లు. వనభోజనాలకు విహారయాత్రలకు పిల్లలను తప్పకుండా తీసుకుని వెళ్ళాలి. సుంకేసులలో ఫిషరీస్ వారి కేంద్రం ఉంది. రకరకాల చేపల్ని గాజుతొట్లలో ఉంచి ప్రదర్శించే కేంద్రం ఉంది. చేపలు పెంచే విధానాన్ని చిన్నచిన్న నీటిమడుగులను చూడవచ్చు. వీరి పల్లెనుండి సుంకేసుల పదిన్నర మైళ్ళుండవచ్చు.

చాలామంది సైకిల్స్ మీద బయలుదేరారు. కాని పిల్లగుంపంతా రెండు ఎద్దుల బళ్ళలో ఎక్కి కూర్చున్నారు. సుంకేసులలో తనకు కూడ పనిఉన్నదంటూ రాజారావు సైకిల్ మీద బయలుదేరాడు. సైకిల్ కేరియర్ మీద పెద్ద మూట ఉన్నది.

సైకిళ్ళు లేనివారు - బళ్ళలో ఎక్కి కూర్చుని ఆడపిల్లల్లా వెళ్ళటానికి నామోషిగా ఉన్న కుర్రవాళ్ళంతా టిఫిన్ కేరియర్లు డబ్బాలు పెట్టిన సంచులను పట్టుకుని పనిమిదిగంటలకంతా హుషారుగా నడవటం ప్రారంభించారు.

బండ్లు మైలు దూరం వెళ్ళాయి. రాజారావు వాటి వెంట వెళ్తున్నాడు. సైకిళ్ళ గుంపులు ఎప్పుడో కనుమరుగైపోయాయి.

బండివాడు రాజారావుతో అన్నాడు- "అయ్యా- ఈదారంట పోయి ఎడం పక్క కాలిబాటెంట తీసుకొనిపోతివంటే సుంకేసుల ఐదు మైళ్ళే" అన్నాడు.

రాజారావు అందరిని సంప్రతించాడు. ఐదు మైళ్ళు తగ్గినా తగ్గినట్లే కదా? నడుస్తూ వెళ్ళేవాళ్ళకి ఈ మార్గం సులభమౌతుంది.




పిల్లల నవ్వులతో ఎద్దుల మెడలోని మువ్వల శబ్దం కలసిపోయింది. బండ్లు ముందుకు సాగిపోయాయి. రాజారావుకు ఇద్దరు టీచర్లు కాలినడక పిల్లలు తోడుగా ఉన్నారు. బడిప్యూన్ రాజారావు మూట అందుకని తలమీద పెట్టుకున్నాడు. ఒక కిళ్ళీ దుకాణం దగ్గర సైకిల్‌ను ఒదిలి పెట్టాడు. అంతా కలసి అడ్డదారిలో వెళ్ళి మంకేసులను చేరాలని ఉత్సాహంతో కాలి నడకను కొంతదూరం వెళ్ళి బండివాడు చెప్పినట్లు ఎడమ ప్రక్కనున్న కాలి బాటను ఎక్కారు.

కొంత దూరం వెళ్ళి మలుపులు తిరిగి ఈతచెట్లు దాటి పొలాల్లో పడ్డారు.

"మేష్టారండి.... ఇటు కాదేమో" అన్నాడొక కుర్రవాడు.

"ఇటునుండి కూడా దారుంది. పదండ్రా" అన్నాడు మరొకడు. కాలి బాట లేదు! పొలాల గట్టుమీద నడుస్తున్నారు. కాలువగట్టు ఎక్కాలి. అక్కడి నుండి ఇంకెంత? ఒక్క గంటలో చేరిపోవచ్చును.

మూడు మైళ్ళు నడిచినా కాలువ రాలేదు. అది తారురోడ్డు కాదు. పిల్లలు అలసిపోయినట్లున్నా తెచ్చికోలు ఉత్సాహంతో ఓపికగా అడుగు వేస్తున్నారు. వేగం తగ్గింది. సూర్యుడు బాగా పైకి వచ్చేశాడు. ఎండ తీక్షణంగా ఉంది. ఆ ఏడాది వర్షాలు ఆలస్యమైనందువల్ల చిన్న గుంటలలో మడుగులలో నీరులేకుండా పోయింది. పొలం మధ్యలో వెళ్తున్నారు.

ఒక్క చెట్టు లేదు. ఏదైనా ఉన్నా

అవి చిన్న పిచ్చి పొదలు. సంచులు తలలమీద పెట్టుకున్నారు,

కాని ఆ వేడిమివి ఆ లేతశరీరాలు భరింపలేకపోయాయి.

"ఎక్కడా నీడ లేదా ?"

"ఒక్క చెట్టు లేదు !"

"కాళ్ళు కాలుతున్నాయి."

"వెనక్కి పోదాం"

"కాలువ ఇంకా రాదేం ?"

"ఎక్కడైన కూర్చుని తిందామంటే నీళ్ళు లేవు" పిల్లల ముఖాలు వాడి పోయాయి. తలలు వ్రేలాడబడి పోయాయి.

"ఇంకెంత ? నాలుగడుగులు" నౌకరు తలమీది మూటను సర్దుకున్నాడు.

"నాలుగడుగులు వేస్తే నీరొస్తాదా ?" పిల్లలు పిచ్చికోపంతో అన్నారు. మాష్టార్లు రాజారావు కబుర్లు చెప్పుకుంటూ వెళ్తున్నారు. వాళ్ళకేం కాళ్ళకు చెప్పు లున్నాయి. లాల్చీలు వేసుకున్నారు. కండువాల్ని తలలకు చుట్టేశారు. పిల్లలు కసిగా చూస్తున్నారు.

నిజంగానే కాస్త దూరంలో పొలం మధ్యలో చిన్నరకం దిబ్బ కనబడింది. దాని అటువైపు కూడా చదునుగా ఉన్న పొలమే కానవస్తోంది. అంతా ఆ దిబ్బను ఎక్కారు. అటువేపు చూడగానే వాళ్ళ ముఖాలు ఆనందంతో విప్పారినై.

బావి ! అక్కడ పెద్ద బావి ఉంది !

తొంగిచూశారు. నీళ్ళున్నాయి !

"అరె - నీళ్ళున్నాయి. చేద కూడా ఉంది. తినేద్దాం" కొందరు చిన్న వాళ్ళన్నారు.

ఈసురో అనే రకం పిల్లలు "ఇంత ఎండలోనా ?" కసిగా అన్నారు.

"ఈ బావిదగ్గర నాలుగైదు చెట్లు నాటించి ఉంటే బాగుండేది" ఒక పిల్లడు తలమీద సంచి పెట్టుకుని కూర్చుంటూ అన్నాడు.

రాజారావు అన్నాడు వెంటనే. "అబ్బాయీ - ఒకసారికాదు చాలసార్లు చెట్లు నాటించారు. మీలాంటి వాళ్ళెవరో పీకి పారేశారు. ఆ చెట్లను అలాగే ఉండ నిచ్చినట్లైతే ఈ వేళకి ఏపుగా పెరిగి మనకు కావలసినంత నీడను ఇచ్చేవి."

"ఎవరు పీకేశారో.... వాళ్ళకు బుద్ధి లేదు" కోపంగా అన్నాడు.

"మీలాంటి పిల్లలే.... నా తోట.... మిగతా చెట్లు మీరేగా పీకేది!" రాజారావు మెల్లగా అన్నాడు.

అంతా మౌనందాల్చారు.

"బొత్తిగా మరి మనం అలసిపోయి సేద తీర్చుకోవటానికి చెట్లు కావాలి. కాని వాటిని నాటగానే పీకేస్తాము. లేదా పెరగ నిచ్చి లాగిపారేస్తాము. పెరిగి పెద్ద వృక్షాలయిన తర్వాత కొమ్మలు విరిచేసి పొయ్యిలో పెట్టుకుంటాము. ఇంకెక్కడి చెట్లు, పిల్లలు పాడుచేసి పెద్దలు కొట్టించివేస్తే ఇంకెక్కడి చెట్లు ?" ఒక మేష్టారు విసుగ్గా అన్నాడు. చేదవేసి నీళ్ళ

తొడుకున్నారు. ముఖాలు కడుక్కున్నారు. మండుతోన్న ఎండలో - భరింపరాని వేడి గాలిలో ఆ నీరు ఎంతో హాయిగా చల్లగా ఉన్నాయి. పిల్లలు నీళ్ళు త్రాగారు.

కాస్త దూరంలో రాజారావు తన చేతిలో ఉన్న కర్రను పాతేశాడు. నౌకరు మూటవిప్పి పెద్ద టార్పాలిన్‌ను వేశాడు. దానిని కర్రమీద మధ్యగా వేసి చుట్టూ పరిచారు. దానికున్న నాల్గుకొసల త్రాళ్ళను లాగి, నేలలో కర్రముక్కలను పాతి వాటికి కట్టారు. అంతా పదినిమిషాలు పట్టలేదు.

"అరె ఇది గుడారం."

"ఇది టెంటు" అని పిల్లలంతా దాని క్రిందికి దూరారు.

"అక్కడ మాకు కేంపుకు పనికి వస్తుందని తీసుకెళ్తున్నాను" అన్నాడు రాజారావు. నీడలోకి జేరి పిల్లలు, పెద్దలు సేదదీరి ఉత్సాహాన్ని పుంజుకుని కేరేజీలు విప్పి కొంచెం తిని నీళ్ళు త్రాగారు. నీడలో హాయిగా లేకపోయినా కొంత ఎండబాధ తగ్గినందుకు ఆనందించారు.

"ఎక్కడ పడితే అక్కడ మనకు పెద్ద గొడుగులాంటి చెట్లను భగవంతుడు ఇచ్చాడు. అందుకే వాటిని భద్రంగా అపురూపంగా చూచుకోవాలి. అవసరానికి ఆదుకుంటాయి. అందుకే అశోక చక్రవర్తి చెట్లు నాటించాడు" ఒక మేష్టారు అన్నాడు.

"ఏంచెయ్యాలి? ఇక్కడినుండి ఎంత దూరం వెళ్ళాలి?" అంతా అనుకున్నారు. చివరికి నౌకర్ని అడిగారు.

"కాలవగట్టు జేరాలంటే ఇంకా రెండున్నర మైళ్ళు పోవాల" అనగానే నిరుత్సాహపడిపోయారు. "అక్కడ నుండి ఐదుమైళ్ళు పోవాలి." అంతా ఆ బండివాడిని కసిదీరా తిట్టుకున్నారు. "ఐతే ఇదేం దగ్గరదారి? మెయిన్ రోడ్డు కన్నా దూరంపడింది" అనుకున్నారు పిల్లలు.

"చల్లటి ఉదయాన కబుర్లు చెప్పుకుంటూ వెళ్తే దగ్గర దారిగా అనిపిస్తుందేమో" రాజారావు బోధపర్చుతున్నలా అన్నాడు.

"ముందుకా - లేక వెనక్కి మళ్ళటమా?" పెద్ద సమస్య అయిపోయింది. కాని పొలాల్లో నడవటంకన్నా వెనక్కి వెళ్ళటమే మంచిదనుకున్నారు.

వరుణ్ణి కాశీ యాత్రకు తీసుకెళ్ళే సమయంలో ఒక గుడ్డ మధ్యలో కర్ర ఉంచి దాని నాలుగు కొసలను నలుగురు పట్టుకుని వెళ్ళినట్లు పిల్లలు కొంతదూరం ఆ గుడారాన్ని పట్టుకుని సంబరంగా వెళ్ళారు.

మెయిన్‌రోడ్ రాగానే చాల సంతోషించారు. వారి విహారయాత్ర ఈ విధంగా మలుపు తిరుగుతుందనుకోలేదు.

పిల్లలు కాళ్ళీడ్చుకుంటూ గృహోన్ముఖులయ్యారు. రాజారావు సైకిల్ తీసుకున్నాడు.

కొంతదూరం ముగ్గురూ మౌనంగా నడిచారు. ఆ తరువాత ఒకరు అడిగారు "మీరింత శ్రమతీసుకుని ఈ విధంగా నడిపించారు కదా! పిల్లలకు జ్ఞానోదయం అయిందంటారా? రేపు మళ్ళీ మొదలు పెడ్తారేమో?"

"ఏమో! కాని వారికి జ్ఞానోదయం కలిగేవరకు నేను ఒదలను. రేపే వారికి పరీక్ష."

అనుకున్నట్లు మరుసటి రోజు రాజారావు తన తోటలో మొక్కల్ని నాటించాడు.

పిల్లలు వస్తూ పోతూ చూస్తూనే ఉన్నారు. రాజారావుకు టీచర్లకు ఒక్క అనుమానం లేకపోలేదు. కొండపరుసుంకేసులవరకు వెళ్ళారు. వారు లక్షణంగా విహారయాత్ర ముగించుకుని తుంగభద్రలో స్నానంచేసి వచ్చారు. వారికి ఎండా - నీడా మార్చి మార్చి లభించాయి. నీడకోసం వారు తహతహలాడిపోలేదు. ఎండలో తల్లడిల్లి పోలేదు. వారు చెట్టునీడ ఆవశ్యకతను తెలుసుకోలేకపోయారేమో! వారికా అవసరం లేక పోయింది.

పక్షం రోజులు గడిచిపోయాయి. ఒక్క చినుకు పడి వానలు మొదలయ్యాయి. మరొకమారు మొక్కలు పచ్చగా నిగనిగలాడాయి. రెండుపూటలు ఆదుర్దాగా తోటవేపుకు వెళ్ళేవాడు - ఆనందంతో తిరిగి వచ్చేవాడు రాజారావు.

ఆగస్టునెల వచ్చింది. పదిహేనవ తారీఖున రాజారావు కూడ బడికి వెళ్ళాడు. జండాను ఎగురవేసిన తర్వాత హెడ్మాస్టర్ చిన్న ఉపన్యాసం ఇచ్చారు. మిఠాయిలు పంచకముందు అందర్నీ కూర్చోమన్నాడు, "రాజారావుగార్ని మీరంతా ఎరుగుదురు. వారొక వక్కాని తోటను వేసుకున్నారు. మన స్కూలు ఆవరణలో కూడ మొక్కలు నాటిస్తామంటున్నారు. మీరంతా వారికి సహాయం చేయాలి."

జవాబుగా పిల్లలందరు ఏక కంఠంతో అరిచారు. "మేం చేస్తాం-మేం చేస్తాం" అని.

దాదాపు ఇరవై ఐదు సంవత్సరాలు కాలగతిలో లీనమయ్యాయి. ఈ ఇరవై ఐదు సంవత్సరాలలో స్కూలు ఆవరణంలో వేసిన మొక్కలు వృక్షాలై చల్లని నీడనిస్తున్నాయి. వారి పోలూరు పల్లెకు అందాన్నిచ్చాయి ఆ వృక్షాలు.

రిటైర్ అయిన తర్వాత రాజారావుకు అత్యంత ప్రియమైన చోట్లలో స్కూలు ఆవరణం ఒకటి. ఆనాడు తనతో వెళ్ళిన కుర్రాళ్ళలో ఒకడు టీచరై వచ్చాడు. అతడు రాజారావుకోసం చెట్టుకింద కుర్చీ వేయిస్తాడు. ఆ చెట్టు నీడ ఎంత హాయిగా ఉంటుంది!

ఆమధ్య శ్రీశైలం వెళ్ళాడు. కొండలన్నీ రాళ్ళగుట్టలే! ఒక్కచెట్టు ఉండకుండా కొట్టేసుకున్నారు శ్రీశైలం

డాంలోని కూలీలు- మిగతా కంట్రాక్టర్లు- పేదవారు! దాంతో వాతావరణం మారి పోయింది! అలాగే హిమాలయ కొండ చరియల్లో కూడా చెట్లు కొట్టేశారు. అడవులకు అడవులు తుడిచిపోగొట్టే శారు. వర్షావసానం వర్షలేమి - అనా వృష్టి! చెట్లు నాటించాలని "చిప్కో" మూమెంట్ వచ్చింది

రాజారావు చెట్లక్రింద కూర్చుని ఆలోచించేవాడు.

అందరిలాగానే ఇద్దరు కొడుకులను ఒక కూతుర్ని ముచ్చటగా పెంచి పెద్ద చేశాడు. అమ్మాయిని బి.ఏ.,బి.ఇడి. చదివించాడు. ఆమె భర్త లెక్చరర్. ఆమె గుంటూరులో ఉంది. ఇద్దరు కొడుకులు పోస్టుగ్రాడ్యుయేట్లు. హైద్రాబాద్‌లో ఉద్యోగాలు చేసుకుంటు న్నారు.

వారికి తలిదండ్రుల అవసరంలేదు. అసలు పట్టించుకోరు. చెట్టంత కొడుకు అని చెప్పుకోవటంవరకేగాని ఇరువురిలో ఒక్కరైనా వారికి ఆశ్రయం ఇవ్వలేదు. భార్య మరణించి రెండేళ్ళయింది. తండ్రి ఒక్కణ్ణి పల్లెలో వదిలి వెళ్ళారు. తమ నీడలో చోటులేకుండా చేశారు. పిల్లల చదువులకని తన చేతులతో పెంచిన తోట అమ్మేశాడు. ఇల్లు సగం అద్దెకు ఇచ్చాడు ముప్పై రూపాయలు వస్తాయి. పెన్షన్ వస్తుంది. దీంతో కాలం వెళ్ళ బుచ్చుతూ కూతురు వచ్చినప్పుడు ఆమెకు-అల్లుడికి మర్యాదలు జరపగల్గు తున్నాడు.

నిస్వార్థంతో చెట్లు నాటించాడు. అవి ప్రత్యుపకారం చేస్తున్నాయి. నిస్వార్థం తోనే కొడుకుల్ని చదివించాడు. ఎండి పోయిన చెట్లలా వారు ప్రేమానురాగాలు చూపకపోయారు. తండ్రిమాట తల పెట్టని కృతఘ్నులై పోయారు.

ఆ రెండు నీడ ఇవ్వని - ఫలించని చెట్లు!

రాజారావు భారభరిత హృదయాన్ని రంజింపజేస్తూ పిల్లలు గుంపులుగా వచ్చి చుట్టూ కూర్చున్నారు. వారి ప్రశ్న లకు జవాబులు చెప్పటం- కథలు చెప్ప టంతో అతడి హృదయం తేలికపడ్తుంది.

"తాతగారూ - మా యింట్లో రెండు జామచెట్లున్నాయి. అవి సరిగా పెరగవ్. కాయలు కాయవు. ఎందుకు?" అని ఒకడు అడిగాడు.

రాజారావు పేలవంగా నవ్వాడు. "నాయనా - మా యింట్లో కూడ రెండు చెట్లున్నాయి. అవి కూడ నీడ ఇవ్వవు. ఫలించవు ఏంచేస్తాం" అన్నాడు.

ఆ వింత జవాబు అర్థంతెలీక పిల్లవాడు అమాయకంగా చూస్తుండిపోయాడు.

---

# ఆమె-అతడు

వై శేఖర



పున్నమి చంద్రుడు శీతలకిరణాలు నిండుగా ప్రసరిస్తున్నాడు. హోరుగాలి "ఝూంమ్"మని వీస్తోంది. ఎందరొచ్చినా తనకేమీ చింతలేదన్నట్లు నోరు తెరుచుకుని చూస్తోంది బంగాళాఖాతం. రాత్రి పది గంటల సమయం. అది విశాఖపట్నం బీచ్.

ఆమె....వయసు పాతిక సంవత్సరాల లోపు ఉంటుంది. పచ్చని శరీరం. విశాల నేత్రాలు. అందగత్తె అనడానికేం సందేహం లేదు. బీచ్‌లో గబగబ అడుగులు వేసుకుంటూ సముద్రంవైపు వెళుతోంది.

అతడు.... 22 సంవత్సరాలుంటాయి. విశాలమైన నుదురు. నిండైన విగ్రహం ఉంగరాల జుట్టు. ఆ ముఖంలో చూపరులను ఆకర్షించే తీరిక లున్నాయి. బీచ్‌లో ఓ మూల కూర్చుని ఉన్నాడు.

వాళ్లిద్దరి మధ్య వందగజాలకు పైగా దూరం ఉంటుంది. ఆలోచనల్లో ఉన్న ఆ యువకుడు మొదట్లో ఆమెను గమనించలేదు. ఉన్నట్లుండి తలెత్తి చూసాడు. తనకు కొంత దూరంలో ఒక స్త్రీ వెళ్తోంది. మరికొంత సమయం గడిస్తే ఆమె సముద్రానికి బలైపోతుంది.

అతను చివాలున లేచి ఆమె వెనుక చకచక అడుగు లేసుకుంటూ వెళ్తున్నాడు.

తన వెనుక ఎవరో వస్తున్న అలికిడి వినగానే ఆమె వెనుదిరిగి చూసింది. పరుగెత్తుకొస్తున్న ఆ యువకుడిని చూడగానే కలవరపడి తనూ పరుగెత్తడం మొదలెట్టింది.

అతనింకా పదిగజాల దూరంలో ఉండగా ఆమె సముద్రపు నీటిలో ప్రవేశించింది. అతనూ పరుగు పరుగున వచ్చి సముద్రంలో దూకాడు. అంతలోనే విసిరిందో కెరటం. అంతా గజిబిజి అయింది. అతను ఆమెను బయటకు తీసే ప్రయత్నంలో నిమగ్నమయ్యాడు.

అతని శ్రమ ఫలించింది. ఆమెను సజీవంగా ఒడ్డుకు చేర్చాడు. కొంత సమయం బరువుగా గడిచింది. ఇద్దరూ కూడా ఎలా మాట్లాడాలో తెలియక వెనుకాడుతున్నారు.

"నీకు నేనేం అన్యాయం చేసాను బాబూ ? నాకింత శిక్ష విధించావు ?" చీర పిండుకుంటూ అన్నది ఆమె.

"ఓ ఆడపడుచు చేజేతులా తన జీవితాన్ని అంతంచేసుకోబోతుంటే...."

"ఆ అనంతయాత్రలో నాకు దొరికే శాంతి నీకేం తెలుసు బాబూ ? నాలాంటి వాళ్ల బ్రతికి రోజూ చచ్చేకంటే ఒకేసారి ఇలా చావడంలో...."

"అంత మాట అనకండి....ఎంతయినా బ్రతుకంత భాగ్యం లేదంటారు. చచ్చి ఏం సాధిస్తాం. సమస్యలను ఎదుర్కొని నిర్భయంగా నిలబడాలిగానీ వాటికి లొంగి మనల్ని మనం ఎందుకు నాశనం చేసుకోవాలి ?"

"నీకేం బాబూ ? నువ్వు మగాడివి. అలాగే చెపుతావు. నేను ఆడదానివి."

"నేను ఆడదానిని....అనుకుంటూనే స్త్రీజాతి తనను తాను నాశనం చేసుకుంటోందనుకుంటాను. ఆ నిస్పృహే ఆమె బ్రతుకును దిగజార్చుతోంది. మీ సమస్య ఏమిటో చెప్పండి. దానినుంచి బయటపడడానికి, ఒక ఒడ్డుకు చేరటానికి నా శాయశక్తులా తోడ్పడతాను."

ఆమె సముద్రపు అలల వంక చూస్తోంది. ఆ అలలలో తన జీవితం కూడా అలలు అలలుగా కన్పిస్తోంది.

* * *

ఆమె పేరు శారద. ఆమె తండ్రి మురహరిరావు. అతనిది రాజమండ్రి. ఆమె తల్లి గిరిజది కపిలేశ్వరపురం దగ్గర చిన్న పల్లె. శారద తాతకు ముగ్గురు ఆడపిల్లలు. గిరిజ మూడవది. పిల్లల పెళ్ళిళ్ళకోసం ఆయన పడిన బాధ ఇంతా అంతా కాదు. రెండెకరాల పొలంలో జీవితం గడుపుకుంటూ వాళ్ల పెళ్లిళ్ల

చెయ్యాలి ఆయన. పెద్ద పిల్లల పెళ్ళిళ్లలానే గిరిజ పెళ్ళి కోసం కూడా ఆడపిల్లల తండ్రి అయిన ఒక్క-రైతు పడవలసిన నరకమంతా అనుభవించాడు ఆయన.

చివరకు ఎవరో బంధువు ద్వారా మురహరిరావు గురించి తెలుసుకున్నాడు. అతనికి మొదటి భార్య పోయి రెండు సంవత్సరాలు దాటింది. వయసు నలభై దాకా ఉంటుంది. కాని అంతకన్న బాగా ఎక్కువ ఉన్నట్లు కన్పిస్తాడు. వెనక ఆస్తి ఏమీలేదు. ప్రైవేట్ కంపెనీలో హెడ్ గుమస్తాగా పనిచేస్తున్నాడు.

అయినా గిరిజ తండ్రి అతనికి తన కూతుర్ని ఇవ్వడానికి అంగీకరించాడు. ఆ సంబంధంపోతే తను బ్రతికుండగా ఆమెకు పెళ్ళి చేయలేననుకున్నాడు ఆయన.

గిరిజ చూపులకు బాగుండేది. వయసుకాని వివాహంతో మురహరిరావుకు మొదటినుంచీ ఆమెపై అనుమానమే. పొలుసులు రేగిన శరీరంతో, నెరుస్తున్న తలతో ఉన్న మురహరిరావు తన స్వరూపాన్ని ఆమెతో పోల్చుకుని ఉలిక్కి-పడుతుండేవాడు. అనుమానాలతో ఆమెను చంపుకుతినేవాడు.

శారదకు ఊహ తెలిసినప్పటినుంచి తన తల్లిదండ్రుల మధ్య జరిగిన కొన్ని సంఘటనలు ఎప్పుడూ గుర్తొస్తుంటాయి. తను ఆఫీసుకు వెళ్లినపుడు వేసిన తలుపు తిరిగి వచ్చేవరకు తియ్యకూడదనేవాడు మురహరిరావు.

ఒకరోజు రాత్రి మురహరిరావు గాలికోసం తెరిచిన కిటికీ తెల్లవారాక వెయ్యడం మరచిపోయింది గిరిజ. సాయంకాలం అతను తిరిగి వచ్చేసరికి ఎదురింటి కాలేజీ విద్యార్థి వాళ్ల ఇంటి గేటులో నిలబడి ఉన్నాడు. గిరిజ అప్పుడు వంట చేస్తోంది. మురహరిరావుకు అవన్నీ అక్క-ర్లేదు. కిటికీ తెరచిఉండటం, ఎదురింటి గేటులో ఒక యువకుడు ఉండటమే అతనికి కావలసింది.

"ఏమే....! అంత ఒళ్లు మరచిపోతున్నావా?" అంటూ ఇష్టంవచ్చినట్లు తిట్టాడు వనజను.

గిరిజ తన వైవాహిక జీవితంలో మొదటిసారి గడప దాటి అడుగు బయట పెట్టింది తండ్రి చనిపోయినపుడు మాత్రమే. ఆమె తల్లి, తోబుట్టువులు నాలుగు రోజులుంచమని ఎంత బతిమాలుతున్నా వినకుండా మర్నాడే తీసుకొచ్చాడు మురహరిరావు.

"ఏమే....? నాలుగు రోజులుంటావా అక్కడ? ఏం నాటకాలాడదామని?" అంటూ ఆమె మీద విరుచుకుపడ్డాడు రాజమండ్రి రాగానే.

తరువాత కొన్నాళ్లకు గిరిజ తల్లికి జబ్బుగా ఉన్నదని ఆమె మేనమామ వచ్చాడు.

"అమ్మకు జబ్బుగా ఉందట. మామయ్యొచ్చాడు" గిరిజ భయపడుతూ, భయపడుతూనే అన్నది.

"జబ్బుగా ఉంటే కార్డు రాస్తే సరిపోలా? అందుకోసం మనుషులు బయలుదేరి రావాలా.... ?" అన్నాడు మురహరిరావు. ఆ వచ్చిన పెద్దమనిషి నిలువునా చచ్చిపోయాడు. అక్కడ నిలవలేక వెంటనే వెళ్ళిపోయాడు. ఆయన వచ్చినందుకు గిరిజను నానా దుర్భాషలాడాడు మురహరిరావు.

గిరిజ తల్లి ప్రాణం కూతుర్ని చూడాలనే కోర్కెతో, ఆమె గురించిన బాధలోనే పోయింది. ఆమె చనిపోయాక మిగిలిన అరెకరం పొలంలో తన వాటాకు మాత్రం కావలసినంత భాగోతం నడిపాడు మురహరిరావు.

అనుమాన పిశాచంతో, మురహరిరావు గిరిజను ఏదో ఒక మిషమీద సాధిస్తుండేవాడు. దాంపత్యజీవితంలో ఆమె కోర్కెలు అభిలాషలు అన్నీ మట్టిలో కలిసిపోయాయి. జీవచ్ఛవంలా ఉండేది. ఆమెను చూస్తే శారదకు, రాజాకు జాలి వేసేది. తండ్రి భయంతో గోడను కరుచుకున్న బల్లుల్లా ఉండేవారు.

శారదకు పదమూడో ఏట మురహరిరావుకు రాజమండ్రి నుంచి కాకినాడలోని తమ కంపెనీ హెడ్డాఫీసుకు ప్రమోషన్‌మీద బదిలీ అయింది. అప్పటికి శారద థర్డ్‌ఫారం చదువుతోంది. రాజా ఫస్టు ఫారం చదువుతున్నాడు.

ఒక రోజు శారద, రాజా ఆల్బంలో బొమ్మలు అతికించుకుంటున్నారు. అంతలో ఇంటిముందు కారు ఆగింది. ముప్పైఐదు–నలభై సంవత్సరాల మధ్య వయసు గల వ్యక్తి లోపలికి వచ్చాడు. అతను మురహరిరావు పనిచేసే కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్ రమణారావు.

"పాపా! మీ నాన్న ఉన్నాడా ?"

"స్నానం చేస్తున్నారండీ.... రండి.... కూర్చోండి...." అని శారద కుర్చీ చూపించింది. రమణారావు కుర్చీలో కూర్చుని అటూయిటూ చూస్తూ దేనికోసమో వెదుకుతున్నాడు.

స్నానం చేసివచ్చిన మురహరిరావు, ఎదురుగా కుర్చీలో ఉన్న రమణారావుని చూసి ఆశ్చర్యపోయాడు.

"నమస్కారమండీ...."

"వచ్చావా మురహరిరావు. చాలా అర్జంటు పని పడింది."

"కబురంపితే వచ్చేవాడిని గదండీ "

"డ్రైవర్ రాలేదు. వాడికి జ్వరం అట. పద. వెంటనే ఆఫీసుకు వెళ్లాలి."

"తమరు మాలాంటివాళ్ల ఇళ్ళకు రావడమే అదృష్టం. తమరు ఏమీ అనుకో నంటే కాఫీ తాగి వెళదాం...."

"ఇప్పుడు కాఫీ అదీ ఎందుకయ్యా....?"

"ఎంతసేపండీ.... రెండు నిముషాలు... గిరిజా ఎం. డి. గారొచ్చారు. కాఫీ పట్టుకురా...." అన్నాడు మురహరిరావు.

శారదకు ఆశ్చర్యం వేసింది. 'తన తండ్రి తన తల్లిని పరాయి మగాడి ఎదుటకు పిలవడమా....?'

కాఫీ తాగడం అయ్యాక మురహరిరావు రమణరావు వెంట వెళ్లాడు. సాయం కాలం ఆఫీసునుంచీ వస్తూనే....

"గిరిజా.... నా బట్టలు సర్దు.... విశాఖపట్టణం వెళ్లాలి" అన్నాడు.

భోజనం వడ్డించి బట్టలు సర్దింది గిరిజ. భోంచేసి వెళ్లిపోయాడు మురహరి రావు.

ఒక రాత్రి వేళ రాజా పాస్‌కి లేచాడు. బయటకు వెళ్లటానికి భయం వేసి అక్కను లేపాడు. బయటకెళ్లొచ్చాక రాజా నిద్రమత్తులో పడుకున్నాడు. శారదకు పక్కగదిలోంచి అస్పష్టమైన సంభాషణలు వినిపిస్తున్నాయి.

ఎవరో పురుషుడు తన తల్లితో గుసగుసలాడుతున్నాడు. ఆ మగ కంఠం ఎవరిదో శారద గుర్తుపట్టింది. తలుపు పక్కనే వున్న రమణారావు బూట్లు ఆమె ఊహని ధృడపరచాయి.

వారం గడిచాక ఒక రోజు అర్ధరాత్రి సమయంలో మురహరిరావు తిరిగి వచ్చాడు. శారదకు మెలకువ వచ్చినా తలుపు తీసేందుకు ధైర్యం చాలలేదు.

మురహరిరావు ఊహించని విధంగా రావడంతో గిరిజ వణికిపోయింది. రమణారావు కూడా కంగారుపడ్డాడు. మెల్లగా బీరువా చాటున నక్కాడు.

తలుపు తీయడం ఆలస్యమయ్యేసరికి మురహరిరావు "గిరిజా" అంటూ బిగ్గరగా కేకపెట్టాడు.

"వస్తున్నా" అంటూ వెళ్లింది గిరిజ.

"ఏం అంత మొద్దునిద్ర ?" అంటూ లోపలికి వచ్చిన మురహరిరావుకు సెంటు వాసన ముక్కులు పగిలేలా గుప్పున కొట్టింది. రేగిన జుట్టు, నలిగిన చీర తలలో వాడిన మల్లెలు చెమటలు పట్టి, వణుకుతున్న శరీరంతో గిరిజను చూడ గానే అతనికి అనుమానం కల్గింది.

సరాసరి పక్కగదిలోకి వెళ్లి అంతా వెదికాడు. ఎవరూ కనపడకపోయేసరికి







ముందు గదిలోకి వచ్చాడు. రమణారావు బూట్లు అతన్ని వెక్కిరించాయి. వెనక్కి వెళ్లి మంచం క్రింద తొంగిచూసాడు. ఎవరూ లేరు.... బీరువా చాటున చూసాడు. రమణారావు తాపీగా బయటికొచ్చాడు.

"రాస్కెల్....! నువ్వా! నన్ను విశాఖపట్టణం పంపింది ఇందుకా....? నాకు ఇంత ద్రోహం చేస్తావా....?" అని అతనిమీద పడ్డాడు మురహరిరావు.

రమణారావు అతన్ని గోడమీదకు తోసాడు.

"జాగ్రత్త! మర్యాదగా పడుండు. లేదా.... ఉద్యోగం ఊడుతుంది" అని వెళ్లిపోయాడు.

నిశ్చేష్టుడైన మురహరిరావు అతను వెళ్లిపోయాక గిరిజను పట్టుకుని ఇష్టం వచ్చినట్టు బాదాడు. ఎప్పుడూ అతను కొడితే కొట్టొద్దని ప్రాధేయపడే గిరిజ ఈసారి జడపదార్థంలా ఉండిపోయింది. ఎంతసేపటికీ అతను కొట్టడం మానక పోయేసరికి ఒక్క తోపు తోసింది. మురహరిరావు మంచంమీద వెల్లికిలా పడ్డాడు. తెగిన నవ్వారు పట్టీ అతన్ని చూసి ఫక్కున నవ్వింది.

రమణారావు వచ్చి పోతూనే ఉన్నాడు. అతన్ని ఏం చెయ్యాలో మురహరి రావుకి అర్థంకాలా. అతను ఆ వూరిలోని పెద్ద షావుకార్లలో ఒకడు. తను అతని చేతి క్రింద బతికే మనిషి. ఈ ఉద్యోగాన్ని కాదనిపోయే ధైర్యం లేదు. తన అసమర్థతను తిట్టుకుంటూ చూసీ చూడనట్లు ఉండేవాడు.

త్వరలోనే ఈ విషయం పేట అంతా పాకింది. బజారులో అడుగుపెడితే మురహరిరావుకు వికటకలు పకపకలు విన్పించేయి. అవహేళన, అపహాస్యం ఎదురయ్యేవి.

మురహరిరావు పౌరుషం దెబ్బతిన్నది. ఒకరోజు ఉద్రేకంతో రమణారావుని ఖూనీ చెయ్యడానికి కెళ్లాడు. రమణారావు అతన్ని నాలుగు తన్ని బయటకు ఈడ్పించాడు. అక్కడినుంచి తిరిగివస్తూ మురహరిరావు లారీ ప్రమాదంలో చనిపోయాడు. ఆ లారీ రమణారావే పంపాడని కొందరన్నారు. కాదని మరి కొందరన్నారు.

తండ్రి చనిపోయాడని శారద, రాజా ఏడ్చారు. లోకంకోసం గిరిజ కూడా ఏడ్చింది. రమణారావు వాళ్ల మకాం మరో చోటుకు మార్చాడు.

మురహరిరావు పోయాక గిరిజ స్వేచ్ఛాజీవి అయింది. రమణారావుతో కలిసి ప్రపంచాన్నంతా కలియజూసింది.

రోజులు గడుస్తున్నాయి. శారద ఇంటర్మీడియట్ ఫైనల్ కొచ్చింది. రాజా స్కూల్ ఫైనల్‌కు వచ్చాడు. శారద టైపురైటింగ్, షార్ట్‌హ్యాండ్ నేర్చుకుంటోంది.

పెద్దవాడవుతున్న కొద్దీ రాజాకు తల్లిమీద వ్యతిరేకత ప్రారంభమైంది. ఆమెతో మాట్లాడటం మానేసేంతవరకూ వెళ్లింది. శారద ప్రాణాలన్నీ తమ్ముడి మీదే పెట్టుకు బతుకుతుండేది. అతనికీ అక్క అంటే పంచప్రాణాలు

రాజాకు ఒకసారి మశూచి వచ్చింది. భయంకరంగా పోసింది.

"అక్కా! నేను చచ్చిపోతున్నాను. నేను పోయిన బాధలో నువ్వూ చచ్చి పోవాలనుకోకు. ఎట్లాగైనా బతుకు" అంటూండేవాడు రాజా అంత జబ్బులోనూ.

పదిహేను రోజులు ఆ మహమ్మారితో పోరాడి చివరకు అక్కను దిక్కులేవి దాన్ని చేసిపోయాడు రాజా. శారద పిచ్చిదానిలా ఏడ్చింది.

తమ్ముడి మరణంతో శారద నిర్జీవంగా తయారైంది. యాంత్రికంగా ఇంటర్మీడియట్ పూర్తిచేసి బి.ఏలో చేరింది. రోజులు బరువుగా గడుస్తుండేయి. తమ్ముణ్ణి తల్చుకుని కుమిలిపోయేది. నిరాశ, నిస్పృహ ఆమెను ఆవరించాయి.

అదే రోజులలో ఆమెకు శ్యామ్‌తో పరిచయం అయింది. ఆమె అతనికి జూనియర్. అతని తండ్రి మన్మధరావు లక్షాధికారి. శ్యాం మాత్రం సంపన్నుల బిడ్డలా కన్పించేవాడు కాదు.

శ్యామ్ అభ్యుదయ భావాలు కల యువకుడు. సంఘసేవా కార్యక్రమాలలో

మునిగిఉండేవాడు. అన్యాయాన్ని సహించేవాడు కాదు. తన వ్యక్తిత్వంతో అందరినీ ఆకట్టుకునేవాడు. అలాగే శారదనూ ఆకర్షించాడు.

తనకు అతనికి ఆస్తిలోను, సామాజిక స్థితిగతులలోను చాలా అంతర మున్నదని అందువల్ల తన ప్రేమ ఫలించదని శారద అనుకున్నది. తన భావాలను తనలోనే దాచుకున్నది. కానీ శ్యామ్‌కూడా ఆమెను ప్రేమించాడు.

"శారదా! మీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలి. మీకు అభ్యంతరం లేకుంటే సాయంత్రం మీ ఇంటికి వస్తాను." అన్నాడు ఒకరోజు శ్యామ్ ఆమెతో.

శారదకు విషయమేమిటో అర్థంకాలేదు. అడిగితే సభ్యతగా ఉండదని పించింది. "అలాగే రండి" అన్నది. శ్యామ్ సాయంత్రం ఆమె దగ్గరకెళ్లాడు.

కాలేజీ విషయాలు మాట్లాడాక,

"శారదా! నేను మిమ్మల్ని వివాహం చేసుకోవా లనుకుంటున్నాను" అన్నాడు శ్యామ్ అతిసామాన్యంగా.

శారద విస్మితురాలైంది.

"శ్యామ్ మీరు అంటోంది....?"

"నిజమే శారదా....! మీ రెందుకు అలా అయిపోయారు?"

"మీ అభ్యుదయానికి మన అంతస్తుల తేడా తెలియకపోవచ్చు. కానీ మీ పెద్దవాళ్ళు...."

"వివాహం నా జీవిత సమస్య. ఆ విషయంలో వాళ్లకేమీ అధికారం ఇవ్వను నేను. మీరు నన్ను ఎరగరా శారదా? నేను ఎలాటివాడినో మీకు తెలియదా? వాళ్లు మంచిగా ఒప్పుకుంటే సరేసరి. లేకుంటే మనదారి మనకే ఉంటుంది...."

"క్షమించండి శ్యామ్.... నా మూలంగా మీ కుటుంబంలో కలతలు రేగడం నాకు ఇష్టం ఉండదు."

"నాకు కావలసింది కులగోత్రాలు, ఆస్తిపాస్తులు కాదు. మీది నిర్మల హృదయం. మీ గుండెలలో నా స్వరూపాన్ని నే నెపుడో చూసాను. మీ కంటి పాపలో నా ప్రతిబింబానికి మినహా తావులేదని నాకు తెలుసు. నాకు కావలసింది అదే." అంటూ శ్యామ్ ఆమె సమాధానానికైనా ఎదురుచూడకుండా వెళ్లి పోయాడు.

ఇంటికి వెళ్లి తండ్రితో శారద విషయం ప్రస్తావించాడు శ్యామ్. ఆ మాట వినగానే ఆయన నిప్పులు గ్రక్కాడు.

"ఆ నీతిలేనిదాని కూతుర్ని చేసుకుంటావా?"

"నేను చేసుకునేది శారదని. వాళ్ల అమ్మ చేసిన తప్పుకి ఆమె బాధ్యురాలా?" అన్నాడు శ్యామ్.

శ్యామ్ తల్లి మినహా ఇంటిల్లిపాదీ అతనిమీద కారాలు మిరియాలు నూరారు. మర్నాడు శ్యామ్ శారద దగ్గరకొచ్చాడు.

"శారదా.... పెద్దవాళ్లతో నాకు నిమిత్తంలేదు. నాకు కావలసింది మంచి మనసు. పెద్దవాళ్లకోసం మిమ్మల్ని వదులుకునే మూర్ఖుణ్ణి, అసమర్థుణ్ణి కాదు."

"క్షమించండి శ్యామ్. నేను అంగీకరించలేను. నాకు అంత శక్తి లేదు."

"ఎవరో ఏదో అంటారని నాకు అన్యాయం చేస్తారా శారదా? వాళ్ల ఆస్తి పాస్తులు మనకొద్దు. మన బ్రతుకు మనం బ్రతకగలం."

"వద్దు శ్యామ్. నా మూలంగా మీ యిల్లు కలతలపాలు కావడం నేను భరించలేను. మీ పెద్దలకు నచ్చిన యువతినే పెళ్లిచేసుకోండి. మీరు సుఖంగా ఉంటే...."

"శారదా....! అర్థంలేని కబుర్లు చెప్పొద్దు. ఇక్కడ ఉండటం మీకు ఇష్టం లేకపోతే ఎక్కడైనా వెళ్లిపోదాం...."

"నన్ను మరచిపోండి.... నావల్లకాదు...."

"చాలు.... నేను వెళ్తున్నాను. మిమ్మల్ని అనవసరంగా బాధపెట్టినందుకు క్షమించండి...." అని వెళ్లిపోయాడు శ్యామ్.

శ్యామ్ నాయనమ్మ ద్వారా ఆ వార్త అందరికీ పాకింది. శారద మర్నాడు కాలేజీకి వెళితే అంతా విచిత్రంగా చూసేవాళ్లే. వెకిలిగా గుసగుసలాడేవాళ్లే....

శ్యామ్ ఉడికిపోయాడు. సహజంగా ఆవేశపరుడైన యువకుడు. ఇంటికి వెళ్లి నాయనమ్మను ఛడామడా తిట్టాడు.

"ఏమిటీ? దిక్కులేని వాడివని జాలిపడి పెంచిందికాక నా మనవరాల్నిచ్చి ఆస్తంతా కట్టబెట్టా లనుకున్నాను. నన్నింత మాటలంటావంటరా?" అన్నది ఆమె.

శ్యామ్ తెల్లబోయాడు. ముసలమ్మ అవతలకు వెళ్లిపోయింది. శ్యామ్ తల్లి దగ్గరకు వెళ్లి అసలు సంగతి ఏమిటని అడిగాడు. అత్త అన్నమాటలను ఆమె కూడా విన్నది. పైకి ఏమీ కనబడనీయకుండా ఉండటానికి ప్రయత్నిస్తూ,

"ఏమిటి బాబూ అట్లా అడుగుతావు? నీకేమీ పిచ్చి పట్టలేదు గదా...." అన్నది.

"కాదు.... నిజం చెప్పు. నేను నీ కన్నకొడుకునేనా?"

"కాకుంటే మరెవరివి? నీకు ఈ అనుమానం ఎందుకొచ్చింది?"

"అమ్మా.... నీ ముఖంలో, మాటలో ఆ తత్తరపాటు నిజం చెపుతున్నా నువ్వు అబద్ధం చెపుతున్నావు.... నువ్వు జాలిపడి నన్ను పెంచినమాట వాస్తవంకాదా?"

శ్యామ్ మాటలతో ఆమెకు దుఃఖం ఆగలేదు. అతన్ని గుండెలకు హత్తుకుని ఏడ్చింది.

"బాబూ....ఇరవై రెండు సంవత్సరాల నుంచీ గుండెల్లో పెట్టుకుని నువ్వే జీవితమనుకుని బ్రతుకున్నాను. నేను నీకు తల్లినికాదా నాయనా?.... నీ మీద జాలిపడి కాదు బాబూ.... 'అమ్మా' అనే పిలుపుకోసం దప్పిగొని ఎండి మోడయి పోయిన నా జీవితంలో.... మాతృత్వపు అనుభూతికోసం నేను పడిన ఆవేదన చూసి ఆ భగవంతుడే ఇచ్చాడనుకున్నాను. నా కంటిపాపలా నువ్వు మినహా మరో లోకమే లేకుండా నన్ను మరచిపోయి పెంచుకున్నాను. చెప్పుబాబూ....! నేను నీకు తల్లిని కాదా....?"

ఆమె విలాపం శ్యామ్‌ను కలచివేచింది. "జన్మజన్మలకూ నువ్వే నా తల్లి వమ్మా" అన్నాడు.

శ్యామ్ మన్మధరావు దంపతుల కన్నకొడుకు కాదు. అతనో అనాధ. బిడ్డలు లేక వాళ్ల అతన్ని పెంచుకున్నారు.

మన్మధరావు తల్లి మొదట్లో శ్యామ్‌ని పెంచుకోడానికి అంగీకరించలా. అలా కాకపోతే ఆస్తినంతా రామకృష్ణ మఠానికి రాసేస్తానని ఆయన బెదిరించాడు. ఆ మాట వినగానే ఆమె గుండెలవిసిపోయాయి. అంత ఆస్తి పోతుందనే భయంతో కిక్కురుమనకుండా ఊరుకుంది.

మన్మధరావుకు ఒక చెల్లెలుంది. ఆమెకో కూతురు. శ్యామ్‌ను ఆ పిల్లకిచ్చి ముడిపెడితే ఆస్తి బయటకుపోకుండా ఉంటుందని ఆమె తాపత్రయం. వాళ్లిద్దరికీ పెళ్లిచేసి తీరాలని పట్టుబట్టింది.

శ్యామ్ తనను తిట్టడంతో ఆమె సహించలేకపోయింది. కోపంలో అసలు విషయం బయటపెట్టేసింది. శ్యామ్ సున్నితహృదయం ఆ అఘాతాన్ని భరించ లేకపోయింది. ఇల్లువిడిచి వెళ్లిపోయాడు.

మన్మధరావు భార్య మనోవేదనతో మంచంపట్టింది. శారదవల్లనే శ్యామ్ జీవితం నాశనమైందని అంతా ఆమెను ఆడిపోసుకున్నారు.

ఆ రోజుల్లో శారద అనుభవించిన నరకం అంతా ఇంతా కాదు. ఆశా జ్యోతిగా ఉన్న తమ్ముడు అన్యాయంచేసి పోయాడు. ప్రేమించిన వ్యక్తి

సమయానికి తగిన నిర్ణయం తీసుకోలేని తన శక్తిహీనతే శ్యామ్‌న అన్యాయం చేసిందని ఆమె బాధపడుతుండేది. అలాగే బి.ఏ. పరీక్షలు రాసింది

ఒకరోజు తలంటుకుని వరండాలో కూర్చుని జుట్టు ఆరబెట్టుకుంటోం శారద. గతాన్ని గురించిన ఆలోచనలతో పరధ్యానంలో పడింది. అంతలో రమణారావు వచ్చాడు. శారద అతని రాకను గమనించలేదు. అతను పక్క ఉన్న కుర్చీలో కూర్చుని ఆమెను చూస్తూ దగ్గాడు.

శారద అప్పటికి లోకంలోకి వచ్చింది. పైట జారిపోయి ఉండటం గమని చింది. ఒక్క అంగలో గదిలోకి వెళ్ళిపోయింది. రమణారావు అంతకుముంద కూడా ఒకటి రెండుసార్లు శారదను ఓరగా చూస్తూ నవ్వాడు. కాని అత మనసులో అంత విషం ఉందని ఆమె గ్రహించలేకపోయింది.

ఆ రాత్రి....అర్ధరాత్రి సమయం. శారద మంచి నిద్రలో ఉన్నది. అజాను బాహావు అయిన ఒక మనిషి ఆమెమీద పడి తన కౌగిట్లో ఇముడ్చుకున్నాడు. శారద కెవ్వున కేకపెట్టింది. అతను ఆమె నోరు నొక్కేసాడు. అతని బా నుంచి తప్పించుకోడానికి తన శక్తికొద్దీ పెనుగులాడుతోంది. అతనిముందు ఆమె ప్రయత్నం విఫలమవుతోంది.

అదే సమయంలో గదిలో దూకింది పెంపుడు కుక్క టైగర్. రాజా దానిని ఎంతో ప్రేమతో పెంచుకున్నాడు. అతను పోయాక శారద జాగ్రత్తగా చూస్తోంది.

టైగర్ రావడంతో అతను దానిని పట్టుకోడానికి లేచాడు. శారద తప్పించు కుని బైటు వేసింది. ఎదురుగా రమణారావు. టైగర్ అతనిమీద రెండుకాళ్ళ వేసి నిల్చుని ఉంది. శారద పక్కగదిలోకి వెళ్ళి తలుపు గడి పెట్టుకుంది. రమణారావు టైగర్‌ను విడిపించుకుని వెళ్ళిపోయాడు.

శారదకు తల్లిమీద జుగుప్స, రమణారావు అంటే భయం కలిగాయి. ఎట్టైనా వెళ్ళిపోవాలని నిశ్చయించుకుని విజయవాడ చేరుకున్నది.

ఒక హోటల్‌లో దిగి, కొన్ని కంపెనీలకు ఫోన్‌చేసి, స్టెనో, టైపిస్ట్ పోస్టు లేమైనా ఖాళీగా ఉన్నాయేమో సమాచారం సేకరించింది. ఒక ఫిలిం డిస్ట్రిబ్యూ టింగ్ కంపెనీ మేనేజరు వచ్చి కలుసుకోమన్నాడు. శారదకు ప్రాణం లేచి వచ్చినట్లయింది.

రూమ్‌నుంచి బయటకు వచ్చేసరికి తన పరిస్థితి అర్థమైంది. ఆమెకు వరండాలో నిల్చునివున్న పురుషపుంగవులు ఆమెవంక రెప్పవాల్చకుండా చూస్తున్నారు. వారి వెకిలి మాటలతో ఆమెకు ముచ్చెమటలు పోసినంత పనైంది.

అవన్నీ గమనించనట్లు వెళ్ళిపోయింది. మేనేజరు శారదను చూడగానే ఎగిరి గంతేసాడు. పైకి కనపడనీయకుండా ఆమెకు కొన్ని ఉత్తరాలిచ్చి టైప్ చెయ్యమన్నాడు. ఆమె చేసుకొచ్చాక ఫోజుపెట్టి,

"బాగానే ఉంది....ఇంకా ఇంప్రూవ్ కావాలి," అని ఆ రోజునుంచే డ్యూటీలో చేరమన్నాడు.

శారద అతనికి, తన పరిస్థితి అంతా వివరించి ఎలాగైనా ఒక మంచి ఇంట్లో తనకో రూమ్ కుదిర్చిపెట్టమంది. 'ఇంతేనా' అంటూ అతను తనకు తెలిసినచోట రూమ్ కుదిర్చిపెట్టాడు. శారద ఊపిరి పీల్చుకున్నది. కానీ అది తాత్కాలికమే.

ఆమె ఇంట్లో చేరిన కొద్దిరోజులకే ఓనర్‌కు భార్యమీద ప్రేమ పొంగుకొచ్చి పుట్టింటికి పంపాడు. మేనేజర్ రోజూ వచ్చి పొద్దుపోయేవరకు కదిలేవాడు కాదు. సినిమాకు వెళదాం రమ్మనేవాడు. పక్కరూమ్‌లో ఉన్న కాలేజీ విద్యార్థులు ఎప్పుడూ ఆ రూమ్ ముందునుంచే అటూ ఇటూ తచ్చిట్లాడుతుండేవారు. ఆఫీసు మెట్లెక్కితే తోటి ఉద్యోగుల గుసగుసలు వినబడుతుండేయి.

శారదకు దారి అగమ్యగోచరం అయింది.

నాలుగు రోజులు పోయాక మేనేజరు బయటపడి మీద చెయివేసాడు. చివాట్లేసింది. ఉద్యోగం నుంచి తీసేస్తానని బెదిరించాడు. మరో రెండు రోజులు పోయాక ఇంటివాడు లోపలనుంచి తలుపు తట్టాడు. ధర్మం కాదని నచ్చజెప్పబోయింది. రూమ్ ఖాళీ చెయ్యమన్నాడు. చుట్టుపక్కల కాలేజీమూక అనే మాటలకు చెవులు చిల్లులు పడుతుండేయి. ఒళ్ళంతా తేళ్ళు జెర్రులు పాకుతుండేవి ఆమెకు.

రోజులు గడుస్తున్నకొద్దీ అక్కడ బతకడం కష్టమైంది. బయలుదేరింది. గమ్యంలేని ప్రయాణం. ఎక్కడకు వెళ్ళాలా అని ఆలోచిస్తూ హైదరాబాద్‌కు టిక్కట్టు తీసుకుని రైలెక్కింది.

హైదరాబాద్ చేరుకుని ఒక హోటల్లో దిగి మళ్ళీ ఉద్యోగాన్వేషణ ప్రారంభించింది. ఒక ప్రైవేట్ కంపెనీ నుంచి సమాధానం వచ్చింది. తీరా వెళ్ళేసరికి మేనేజర్ ఏదో అర్జంటుపనిమీద ఉన్నాడని, మర్నాడు రమ్మన్నాడు.

హోటల్‌కు తిరిగి వచ్చి డ్రెస్ మార్చుకుని ఏదో పుస్తకం చదువుకుంటోంది. అంతలో ఎవరో తలుపు తట్టారు. భయపడుతూ తీసింది. అరవై సంవత్సరాల వయసు కల ఒక వ్యక్తి నిలబడి ఉన్నాడు.

"నన్ను గోపాలకృష్ణయ్య అంటారమ్మా....మాది విశాఖపట్నం."

"కూర్చోండి," శారద ఆయనకు కుర్చీ చూపింది.

ఆయన కుర్చీలో కూర్చున్నాడు. శారద బెడ్‌మీద పక్కగా కూర్చుంది.

"బెజవాడలో నువ్వు రైలెక్కుతున్నప్పుడు చూసానమ్మా .... ఎవరో ప్రయాణీకురాలు అనుకున్నాను. ఈ హోటల్లో చూసాక నువ్వేదో పరిస్థితిని ఎదుర్కొంటున్నట్లు అనిపించింది. తండ్రిలాంటివాడి ననుకోమ్మా. నా చేత నైన సాయంచేస్తాను," అన్నాడాయన.

"ఉద్యోగంకోసం వచ్చానండీ."

ఆయన నెమ్మదిగా ప్రశ్నలు ప్రారంభించి లౌక్యంగా ఆమెను గురించి అంతా తెలుసుకున్నాడు.

"నాకు ఆస్తి అంతస్తు కావలసినంత ఉన్నాయమ్మా. వ్యాపారంలో లక్షల పైద లక్షలు సంపాదించాను. కాని ఐదారు నెలలనుంచీ మనశ్శాంతి లేకుండా పోయింది," అన్నాడు.

శారద ప్రశ్నార్థకంగా చూసింది.

"నా రెండో కొడుకు బి.టెక్. ఫస్టు క్లాసులో ప్యాసయ్యాడు. అమెరికా పంపించాను. ఎం.ఎస్. డిస్టింక్షన్‌లో పాసై తిరిగివచ్చాడు. పెద్ద కెమికల్ ఫ్యాక్టరీ స్థాపించడానికి లైసెన్సు కూడా తీసుకున్నాను. మెషినరీ కూడా వచ్చే ంది. కానీ నా ప్రయత్నాలన్నీ వృథా అవుతున్నాయి....

"....వాడు ఇక్కడికి వచ్చిన కొద్ది రోజులకు మా గుమస్తాలలో ఒక అతని కూతుర్ని చూసాడు. ఆ పిల్ల పెద్ద అందగత్తె కాదు. సామాన్యంగా ఉండేది. ంతగా చదువుకున్నదీ కాదు. టీపటాగా పనిచేస్తుండేది. ఆ అమ్మాయి మీద 'డికి మనసైంది. ఆ అమ్మాయితోటిదే జీవితమని కలలు కంటుండేవాడు.

"సహజంగా అది నాకు అయిష్టాన్ని కలిగించింది. అవతల లక్షలకు క్షలు కట్నం ఇస్తామని సంబంధాలు వస్తున్నాయి. అలాటివి వదిలి నా దగ్గర మస్తాగా పనిచేస్తున్నవాడి కూతుర్ని కోడలిగా స్వీకరించడమేమిటి నిపించింది.

"గుమస్తాను రహస్యంగా పిలచి కూతురు పెళ్లి చేసెయ్యమన్నాను.



"గుమస్తా ముఖం చేటంత అయింది. అదే స్కూల్లో పనిచేస్తున్న ఒక కుర్రాడుతో ఆమెకు ముడిపెట్టేశాడు

"మావాడికి ఆ విషయం తెలిసింది. ఆ రోజు నుంచి మనిషి కాకుండా పోయాడు. ఏ దురలవాటు లేనివాడు ఒక్కసారిగా మారిపోయాడు. తాగుడు జూదం అలవాటు చేసారు చుట్టూ ఉన్నవాళ్లు. క్లబ్బు కెళ్ళి తప్పతాగి వచ్చేవాడు. ఆ నిషాలోనే ఒకరోజు రోడ్డుమీద పడుంటే ఎవరో తెలియక కానిస్టేబుల్ తీసు కెళ్లి లాకప్‌లో పెట్టాడు.

"పరువు ప్రతిష్ఠ బజారుపాలు అయ్యాయనే కోపంతో వాడిమీద చెయి చేసుకున్నాను. అ రోజు నుంచీ అన్నం నీళ్లు మానేసాడు. వాళ్లమ్మ కూడా ఉపవాసం ఉండేసరికి ఎంగిలిపడుతున్నాడు. నేను కనబడితే అసహ్యంతో ముఖం తిప్పేసుకుంటున్నాడు.

"తిండి తిప్పలు సరిగా లేకపోవడంతో చిక్కి శల్యమైపోయాడు. ఎపుడూ

ఇంటి సీలింగువైపు చూస్తుంటాడు. కొంతకాలం పోతే వాడు నాకు దక్కడేమో నని భయంగా ఉన్నది.

"వాడి మనసు మార్చి మళ్ళీ మనిషిగా తయారుచేసే అమ్మాయి ఎవరైనా దొరుకుతుందేమోనని వెదుకుతున్నానమ్మా. నిన్ను చూసాక నాలో ఆశ కలిగింది."

"క్షమించండి ...నేను వివశురాలిని ...నా వల్ల మీకు ఏ సహాయమూ జరగదు" అన్నది శారద.

"అంత మాట అనకమ్మా. నేను నీ మీద కొండంత ఆశతో ఉన్నాను. నా ఆశలు వమ్ముచెయ్యకు."

"పెద్ద ఇళ్లతో సంబంధాలు నాలాటి సామాన్యులకు యమపాశాల్లాంటివి. నేను అంగీకరించలేను."

"చూడమ్మా శారదా. ఒకనాడు నేను మానవత్వం లేకుండానే ప్రవర్తించాను కానీ ఈనాడు నా తప్పు తెలుసుకుని దానికి పరిహారం కోసం వెదుకుతున్నాను" అంత పెద్దమనిషి చిన్నపిల్లాడిలా అన్నాడు.

"నేను అశక్తురాలినండీ నన్ను మన్నించండి ."

"నా మీద నీకు నమ్మకం కలగకపోవచ్చు. జీవితంలో ఇప్పటికే పెద్ద దెబ్బ తిని ఉన్నాను మళ్ళీ అదే తప్పుచేసి జీవితాన్ని మరింత భయంకరంగా చేసుకుంటానా చెప్పు? నీ జీవితానికి ఏ సమస్యా రాకుండా చూసుకుంటాను. నామాట కాదనకమ్మా.

"వాడిమీద నేను ఎన్నో ఆశలు పెట్టుకున్నాను. వాడినో పెద్ద పారిశ్రామికవేత్తని చెయ్యాలని నా ఆశ. మిగతా బిడ్డలంతా ఒక ఎత్తు వాడు ఒక ఎత్తు. నా పరిస్థితి అర్థంచేసుకోమ్మా" ఆయన కళ్లనీళ్ల పర్యంతం అయ్యాడు.

శారద ఆయన అభ్యర్ధనను మళ్ళీ తిరస్కరించింది.

"ఆలోచించమ్మా! ఒక నిండు కుటుంబాన్ని ఆదుకున్న దానివవుతావు. నేను నిన్ను మళ్ళీ కలుసుకుంటాను," అని లేచాడు గోపాలకృష్ణయ్య.

ఆయనను వెళ్లనిచ్చి ఆలోచనల్లో పడింది శారద. ఉద్యోగం దొరికినా ఒంటరిగా బ్రతకాలంటే మళ్ళీ ఎన్ని సమస్యలు ఎదుర్కొవాలోనన్న భయం ఒక వంక ఆయన మాట అంగీకరించి అంత ఆస్తిపరుల ఇంట్లో అడుగుపెట్టాలంటే భయం మరో వంక.

మర్నాడు హైదరకంపెనీకి వెళ్లింది. తన పని చూసి 'ఓ.కె.' అన్నాడు మేనేజరు. అప్పాయింట్‌మెంట్ ఆర్డరు తీసుకుని పనిలో చేరింది.

ఆ సాయంకాలం గోపాలకృష్ణయ్య వచ్చాడు.

"....నాకు ఉద్యోగం వచ్చిందండీ...."

"అయితే నా మాట పూర్తిగా మరచిపోతావన్నమాట" నవ్వాడు ఆయన.

శారద మృదువుగా నవ్వింది. గోపాలకృష్ణయ్య తన యింటి విషయాలన్నీ ఆమెకు వివరంగా చెప్పాడు. తనకు ఆరుగురు కూతుళ్లు, ఇద్దరు కొడుకులనీ, ఆడపిల్లలకు, పెద్ద కొడుక్కీ పెళ్లిళ్లు అయిపోయాయని, చిన్న కొడుకు రమేశ్ అని చెప్పాడు.

శారద మర్నాడు ఆఫీసు కెళ్లింది. లంచ్ అవర్‌లో ప్యూన్‌చేత కాఫీ టిఫిన్ తెప్పించుకుని తీసుకుంటున్నది. వరండాలో స్టాఫ్‌మెంబర్లు మాట్లాడుకుంటున్నారు.

"అదృష్టవంతుడంటే బాస్‌ను చెప్పాలి. రంభలాంటి పిట్టను పట్టాడు."

"మనిషి అలాంటి దానిలా అగుపించడంలేదు గురూ."

"పైకి పతివ్రతల్లా కనిపించే వాళ్లేనోయ్ పెద్ద చేతులు."

"నువ్వు అసలే సినిక్‌వి. నీ కళ్లకు ప్రతివాళ్లూ అలాగే కన్పిస్తారు."

"ముందు ముందు బయటపడుతుందిగా."

"ఇంతవరకు బాస్ వలలో పడనిదెవరు గురూ ? కాలాంతకుడయ్యె."

శారద నిట్టూర్చి టిఫిన్ తినడం పూర్తిచేసింది.

ఆ సాయంత్రం గోపాలకృష్ణయ్య మళ్లీ వచ్చాడు. ఆయన ఆమెను తన వెంట తీసుకెళ్తున్నట్లే మాట్లాడుతున్నాడు. ఆమె విని ఊరుకుంటోంది.

మూడు రోజులు గడిచాయి.

"అమ్మా....నా పనులన్నీ అయిపోయాయి. అనుకున్నదంతా చక్కగా జరిగిపోయింది. రేపు ఉదయం ప్లేన్ ఉంది. దానికే వెళదాం. ముందు నిన్ను ఆ యింట్లోకి తీసుకెళ్లాలి." అన్నాడు గోపాలకృష్ణయ్య.

శారదకు ఏం మాట్లాడాలో తెలియలేదు. కళ్లవెంట నీళ్లొచ్చాయి.

"పిచ్చితల్లి....ఏడుస్తావెందుకమ్మా.... నీకు నేనేం అన్యాయం చెయ్యను. నా బిడ్డలలో బిడ్డగా చూసుకుంటాను. నీ బాధ నాకు తెలుసు....నువ్వు నిశ్చింతగా ఉండమ్మా....నీకు ఏ లోటూ రానివ్వను. అంతా నిన్ను ప్రేమతో గౌరవంతో చూస్తారు. నా వెంట పదమ్మా...."

శారద పంటితో పెదవి నొక్కిపట్టి దుఃఖం ఆపుకున్నది.

మర్నాడు శారదతో ఇల్లు చేరుకున్నాడు గోపాలకృష్ణయ్య. భార్యను పిలచి అంతా వివరంగా చెప్పాడు. శారదను ఆమెకు అప్పగించాడు.

"రాజీ జరిగిందేదో జరిగింది. శారద వాడిలో తప్పక మార్పు తీసుకు రాగలదని నా ఆశ. చాలా అభిమానవంతురాలు. ఆమెను ఒప్పించేసరికి గగనమై పోయింది. ఆమె పట్ల ఇంటిల్లిపాదీ జాగ్రత్తగా ఉండాలి"

రాజేశ్వరి తల ఊపింది.

"ఈ పాపంలో నాకూ భాగం ఉందమ్మా. అనుకుని ప్రయోజనం ఏముంది? చేతులారా వాడి జీవితాన్ని నాశనం చేసాం. నీ శాయశక్తులా ప్రయత్నించు. వాడిని మళ్ళీ మనిషిని చేయగలిగితే నీ పేరు చెప్పి ఇంట్లో దీపం పెట్టుకుంటాను" శారదతో అన్నది.

"ప్రయత్నిస్తానండీ" అంది శారద.

మర్నాటి ఉదయం బాత్‌రూమ్‌కి వెళతూ శారదను చూసాడు రమేశ్. రాజేశ్వరి కొడుక్కి భోజనం, టిఫిన్ తనే పట్టుకెళ్ళేది. మూడు గంటలు ప్రతిమాలి మూడు ముద్దలు తినిపించేసరికి ఆమెకు తలప్రాణం తోకకొచ్చేది. పదునైన మాటలతో ఆమెను ఎగతాళి చేస్తుండేవాడు రమేశ్. వందమాటలు పడినా అతనితో ఒక ముద్ద తినిపించగలిగితే చాలు అనుకునేది రాజేశ్వరి.

"అమ్మా....ఎవరో కొత్త అమ్మాయి తిరుగుతున్నదే మీ ఇంట్లో...." టిఫిన్ తెచ్చిన తల్లితో అన్నాడు రమేశ్.

"పాపం....ఆ అమ్మాయికి నా అనేవాళ్ళు ఎవరూ లేదంట చిన్నీ....హైదరాబాద్‌లో ఒంటరిగా బ్రతుకుతూ నానా ఇబ్బందులూ పడుతోందట. మీ నాన్నగారికి ఆమె పరిస్థితి చూస్తే బాధేసిందట. తన వెంట తీసుకొచ్చాడు. బి. ఏ. చదువుతోందట...."

"ఏమిటీ? గోపాలకృష్ణయ్యగారు ఒక దిక్కులేని పిల్లను చూసి బాధ పడటమా? ఆమెను తన ఇంటికి తీసుకురావడమా! అమ్మా....విశాఖపట్నం సముద్రం ఒడ్డునే ఉందా? లోపలికి దిగిపోయిందా....? బిజినెస్ మోటివ్ లేకుండా ఆయన ఒక పని చేసాడంటే ఇంపాజిబుల్. దీని వెనుక ఏదో ప్లాటు ఉండి ఉంటుంది."

"చూడు చిన్నీ....ఏవో అభిజాత్యాలడ్డొచ్చి జీవితంలో చెయ్యరాని పని చేసా మనుకో....అందువల్ల నీ మనసు గాయపడింది. నీకు జరిగిన అన్యాయానికి మేం పరిహారం చెల్లించుకోలేని మాట నిజమే. కాని నువ్వు అనుక్షణం వాడి మాటలతో మమ్మల్ని హింసిస్తే నీకు జరిగిన అన్యాయం సమసిపోతుందా....? వయసు మళ్ళిన వ్యక్తి....తను చేసిన తప్పుకి కుమిలిపోతున్నాడు. ఆయన పరిస్థితి చూస్తుంటే...."

"అమ్మా . కసాయివాడు తను చేసిన పనికి కుమిలిపోతాడా ? వెయ్యిమంది కటికవాళ్ళ గుండెలలోని కర్కశత్వాన్ని కలబోసినా గోపాలకృష్ణయ్య ముందు రద్దే ఆయనకి పశ్చాత్తాపమా ... ? ఆయన కుమిలిపోవడమా. ?"

"చిన్నీ నీకు పుణ్యం ఉంటుంది నాయనా . అంత కఠినంగా మాట్లాడకురా.... విన్నారంటే... "

"అవునులే....నువ్వు భారత స్త్రీవి గదూ....మొగుడు ఎన్ని తప్పులు చేసినా తలాడించడమే భారత స్త్రీ కర్తవ్యం...."

"నీ కాళ్ళ పట్టుకుంటానురా....నన్ను అర్థంచేసుకో నాయనా....పిచ్చి పిచ్చి మాటలు మాని రెండు ముద్దలు తిను...."

"నాకు ఈ ఉప్మా ఇష్టంలేదు...."

"మరేం కావాలో చెప్పు. చేసుకొస్తాను."

"మనిషి మాంసం లేతది ఫ్రై వేసి తీసుకురా.... గోపాలకృష్ణయ్యగారు మనుషుల జీవితాలను తింటాడు. నేను ఆయన కుమారుణ్ణి.... ఆయన కంటె ఎక్కువ చదివినవాడిని కాబట్టి మనుషులనే తింటాను."

"చిన్నీ...." బిగ్గరగా అరిచింది రాజేశ్వరి.... "నీకు పిచ్చిగానీ పట్టలేదు గదా....?"

"పట్టినా బాగుండేది నా డ్రీమ్‌లాండ్‌లో నేను ఉండేవాడిని."

"అంతగా ద్వేషం పెంచుకోకు నాయనా.... నన్నిలా ఎంత కాలం ఏడ్పిస్తావురా....? రెండు ముద్దలు తిను."

"ఊఁ" అంటూ లేచి ఎంగిలిపడ్డాడు రమేశ్. రాజేశ్వరి గ్లాసు, ప్లేట్లు ట్రేలో పెట్టుకుని బయటికి వచ్చింది.

శారద హాలులో గుమ్మం పక్కన నిలబడి ఉన్నది.

"విన్నావు గదమ్మా.... అదీ వరస.... వాళ్ళ నాన్నగారిమీద కక్ష చాలా లోతుగా నాటుకుపోయింది."

వారం రోజులపాటు శారద ఇంట్లో అటూఇటూ తిరుగుతూ ఆ పని ఈ పని చేస్తూ కనబడింది రమేశ్‌కు. మరో రెండు రోజులు గడిచాక ఇల్లు సర్దుతూ రమేశ్ రూమ్‌లోకి కూడా వెళ్ళింది. ఆమె రూమ్‌లోకి వెళ్ళగానే రమేశ్ బాల్కనీలోకి వెళ్ళాడు. పుస్తకాలు, బెడ్‌షీట్లు సర్ది వచ్చేసింది శారద.

అలా కొన్ని రోజులు గడిచాయి. ఒక రోజు శారద తనే స్వయంగా టిఫిన్ పట్టుకెళ్ళింది రమేశ్ కోసం. రమేశ్ తల పక్కకు తిప్పుకున్నాడు.

"టిఫిన్ తీసుకొచ్చానండీ...."

రమేశ్‌కు ఆమెతో మాట్లాడక తప్పలా.

"మీరేమో క్రొత్తవారు. నే బ్లంట్‌గా మాట్లాడితే ఫీలవుతారేమో....ఇది నాకు సయించదు.... అల్ రైట్ తింటాను లెండి...." అని రమేశ్ తుంచీ తుంచీ రెండు పూరీలు తిన్నాడు.

"మీ దగ్గర మంచి లైబ్రరీ ఉన్నదటగా.... నేను బుక్స్ తీసుకోవచ్చా... ?" అని అడిగింది శారద.

"తీసుకోండి. కానీ జాగ్రత్తగ ఉంచాలి సుమా.... ఇపుడే తీసుకుంటారా ?"

"కాదు_ పనయ్యాక వస్తాను." అని శారద ట్రే తీసుకుని వెళ్లిపోయింది.

రమేశ్ మంచంమీద పడుకుని ఆలోచిస్తున్నాడు.

ఒక గంట గడిచాక వచ్చింది శారద.

"మీరు వచ్చారా ? నా రూమ్‌లోకి రావాలంటే ఎవరికైనా ఎన్ని గట్స్ వుండాలో తెలుసా....? మా అన్నయ్యకు అమ్మకు తప్ప ఇంకెవ్వరికీ ఆ ధైర్యం లేదు. మీరు రెండ్రోజుల నుంచీ వస్తున్నారు. ఇవ్వాళ టిఫిన్ తెచ్చి నన్ను మాట్లాడించారు కూడా.... నన్ను చికాకు పరిస్తే ఎంత కోపం వస్తుందో తెలుసా ?.... కానీ ఎందుకనో మిమ్మల్ని ఏమీ అనలేకపోతున్నాను." అన్నాడు రమేశ్.

"నేను మీకు అంత బాధ కలిగిస్తున్నానా ? మీ రూమ్ సర్దటం, మీకు టిఫిన్ తేవటం చేయకూడని పనులా ?"

"చేయకూడనివి కాదనుకోండి.... మీరు నా మంచికే చేస్తున్నారు.... కానీ మా పెద్దవాళ్ళతో అసోసియేట్ అయినవాళ్లంటే నాకు తగని కోపం. మా వాళ్లకు ప్రేమ, అనురాగం లాంటివి అర్థంకావు."

"అనాథనయిన నన్ను చేరదీసి ఆదరిస్తున్నారు. అదేమిటంటారు మరి !"

"ఆదరణా... మీరూ పెద్దానన్నమాట.... ముష్టి డబ్బుకోసం కన్నకొడుకు జీవితాన్ని నాశనం చేసిన మా నాన్న ఒకరిని ప్రేమతో ఆదరించడమే ? ఇది పెద్ద బిజినెస్ లొకాలిటీ. ఇక్కడ ఏది జరిగినా దాని వెనుక బిజినెస్ మోటివ్ అంటే వ్యాపార లక్ష్యం ఉండి తీరుతుంది."

"నాలాంటి దిక్కు_మొక్కు_ లేనివాళ్ల వల్ల మీ పెద్దవాళ్లకు ఒరిగేదేమిటండీ!"

"గొర్రె కటిక వాడినే నమ్ముతుందండీ.... ఇంతకూ దీని వెనుక ఏమీ లేదంటారా ? ఇవ్వాళ్ళ పైపైన ఇల్లు సర్దిస్తున్నారు. ఎల్లుండి ఊడ్పిస్తాడు..... ఆ

తరువాత పనంతా మీ నెత్తిన పడతాయి. మీరు చూస్తారు.... మా నాన్న సంగతి మీకేం తెలుసండీ..? నాకు ఆయన చేసిన ద్రోహం "

"మీరు చెప్పేది వింటుంటే అయోమయంగా ఉన్నది "

"అయితే అసలు విషయం మీకు తెలియదన్న మాట. నేను ఇంత డెస్పాండెంట్‌గా తయారవడానికి నా లైఫ్ ఇలా రూయిన్ అవడానికి కారణం ఏమిటను కుంటున్నారు .?"

"మీ అమ్మగారు చెప్పారు. మీరు ఎవరినో ప్రేమించారనీ దురదృష్ట వశాత్తూ ఆమెకు మరొకరితో వివాహమైందనీ "

"ఆమె చెప్పారు. మీరు నమ్మారు. సరిపోయింది. మా అమ్మ నాన్న మేనత్త మేనమామ బిడ్డలు. పైగా వాళ్ళది లౌ మేరేజి. అందుకే మా అమ్మ మా నాన్న చేసే తప్పుడు పనులన్నింటినీ కప్పిపుచ్చడానికి ప్రయత్నిస్తుంది. నేను సవితని ప్రేమించానని తెలిసి మా నాన్న నాకు తెలియకుండా ఆమెకు వివాహం చేయించాడు.

"దానితో నాకు లైఫ్ మీద డిజక్షన్ కలిగింది. సవితను నేను ఎంతగా ప్రేమించానో తెలుసా.? ఓహ్! షియీజ్ మై లైఫ్ ఆమె తప్ప నాకు ఈ ప్రపంచంలో ఏమీ కన్పించదు. ఆమె ముఖంలో ఎంత గ్రేస్ ఉండేదో తెలుసా.? కళ్లు తెరిస్తే చాలు ఆమె ప్రతిబింబమే కనిపిస్తుంది ."

"ఏమోనండీ నాకు నమ్మబుద్ధి కావడం లేదు. ఇదెవరో కల్పించి ఉంటారు... అసూయ మానవ సహజం "

"మీ రెందుకు నమ్ముతారు? మీకు ఈ యింటి నీళ్లు బాగా పడినట్లున్నాయి. మీకు తెలియదండి ఈ డబ్బున్న జాతి ఉన్నది చూసారూ ? దీనంత ప్రమాదకరమైనది ఇంకోటి లేదు

"క్రూర జంతువులు మాంసాన్ని కుళ్ల బెడతాయి. ఈ డబ్బున్న సమాజం ప్రేమను, అనురాగాన్ని, మంచినీ, మానవత్వాన్ని కుళ్లబెడుతుంది. కొంపలో పుట్టడం అంత దౌర్భాగ్యం మరోటి లేదు. అందువల్లనేగా సవిత నాది కాకుండా పోయింది ?

"ఇదంతా మీకెందుకు లెండి ! నేనో పూర్ ఫెలోని నా ఖర్మకు నన్ను వదిలెయ్యండి. ఇవిగో కీస్ మీకు కావల్సిన బుక్స్ తీసుకెళ్లండి " అని బాల్కానీలోకి వెళ్లాడు రమేశ్.

శారద అల్మైరా తెరచి రెండు పుస్తకాలు తీసుకుని తాళంచేతులు టేబుల్ మీద

పెట్టి తన గదిలోకి వచ్చింది రమేశ్ ప్రతి మాటలోను హావభావాల్లోను కసి, పగ, పసితనం అగుపించాయి ఆమెకు. ప్రయత్నిస్తే అతనిలో మార్పు అసంభవం కాదనిపించింది.

శారద అప్పటినుంచీ రోజురోజుకూ రమేశ్‌తో సంభాషణ పెంచింది. మొదట్లో చిరాకు కనబరిచినా అతను నెమ్మదిగా ఆమెపట్ల గౌరవభావం పెంచుకున్నాడు.

"శారదా సాహిత్యాన్ని గురించి మీ అభిప్రాయం ఏమిటి?" అల్మైరా నుంచీ పుస్తకాలు తీసుకుంటున్న శారదను అడిగాడు రమేశ్.

"మనల్ని మనం తీర్చిదిద్దుకోటానికి సాహిత్యం చాలా ఉపయోగపడుతుందండీ... "

"యు అర్ కరెక్ట్.. ఒప్పుకుంటాను. కాని సాహిత్యంకన్న కూడా అనుభవం మనిషి తనను తీర్చిదిద్దుకోడానికి ఎక్కువ ఉపయోగపడుతుందనుకుంటాను. "

"తప్పకుండా..." అంది శారద.... "ఇవన్నీ తెలిసికూడా తమ ఉనికిని గుర్తించలేనివాళ్లుంటారు... "

"ఓ. నన్ను దెబ్బకొట్టారన్నమాట... "

"మిమ్మల్ని దెబ్బకొట్టడంవల్ల నాకేం లాభం చెప్పండి రమేశ్ మీ జీవితాన్ని వృధాచేస్తున్నారని నా బాధ.. "

"మీకు తెలియదు శారదా నాలో నిరాశ నిస్పృహ ఎంతగా గూడుకట్టుకుపోయాయో ? నన్నేం చెయ్యమంటారు చెప్పండి? అన్నం సయించదు. ఏపనీ చెయ్యబుద్ధి కాదు ఎప్పుడూ పిచ్చి పిచ్చి ఆలోచనలు వస్తుంటాయి. సవిత స్వరూపం కళ్లలో ఎప్పుడూ కదులుతుంటుంది. ఆమె మాటలు చెవుల్లో ప్రతిధ్వనిస్తుంటాయి."

"మీ బాధను నేను అర్థచేసుకోలేదనుకోకండి. భగ్నప్రేమను మించిన బాధ మరోటుండదు. కానీ అంతకంటె దుర్భర జీవితాలను గడుపుతున్న వారు ఎందరులేరు చెప్పండి? మనుషులు పరిస్థితులకు దాసులు కాగూడదు. తన బాధను పక్కనపెట్టి కర్తవ్య పథంలో ముందుకు సాగిపోవాలి.

"ఆ మధ్య మీరొక మాటన్నారు. పేదరికం రోజు రోజుకు పెరిగిపోతున్నా ఈ దేశంలో జనం బాధ్యతలేకుండా పిల్లల్ని కనేస్తున్నారని.

"మీరు చేస్తున్నదేమిటి చెప్పండి ? మీకు చదువు, సంస్కారం, విజ్ఞానం

అన్నీ ఉన్నాయి. గొప్ప సాంకేతిక విద్య మీ చేతుల్లో ఉన్నది. అయినా కర్తవ్య భ్రష్ఠులై మీ శక్తి సామర్థ్యాలను ఈ గది గోడలమధ్య వృధాచేయడం దేశానికి అన్యాయంచేయడం కాదా.. ?"

"నా మాటలు నాకే అప్పగిస్తున్నారు . అటు సున్నితంగాను చెపుతున్నారు. .. ఇటు చురకలు తగిలిస్తున్నారు. మీరు చెప్పింది నిజమే.... కానీ మీరు నన్ను అర్థంచేసుకోగలిగేది నా పరిస్థితిలో ఉన్నపుడే. మీరూ జీవితంలో ఒకరిని ప్రేమించి పొందలేకపోయి ఉంటే నా బాధ అర్థమయ్యేది ?"

"సర్వస్వంగానే కాదండీ ... ప్రాణాలకు ప్రాణంగా చూసుకుని పోగొట్టుకున్నాను... "

"మీరూ నాలాగా ఊండెడ్ సోల్జరేనన్నమాట మీరు ప్రేమించిన వాడు కూడా డబ్బున్న కొంపల్లో పుట్టిన సౌభాగ్యుడేనా ?"

శారద ఉలిక్కిపడింది. తెప్పరిల్లి వెంటనే అన్నది.

"నే నంతగా ప్రేమించింది మా తమ్ముడినండీ .."

"మనిద్దరం దెబ్బతిన్న వాళ్లమే. రూట్స్ వేరు. మీ తమ్ముడు. ..?"

తమ్ముడు తలపుకు రాగానే శారదకు కన్నీళ్లొచ్చాయి.

"చనిపోయాడా. . ? ఎట్లా . ?"

"మశూచి వచ్చి పోయాడు ..."

"మిమ్మల్నెలా ఓదార్చాలో నాకు తెలియడంలేదు. ఒక్కందుకు మాత్రం చాలా సంతోషంగా ఉన్నది. మా నాన్న ఏ మోటివ్‌తో చేసాడోగానీ కన్నీటి విలువ తెలిసిన ఒక వ్యక్తిని ఇంట్లోకి తెచ్చాడు . "

"రమేశ్. మాటమాటకూ మీ నాన్నగారిని అంత కఠినంగా మాటలంటే మీకు వచ్చేదేమిటి చెప్పండి ? ఆయన తప్పుచేసారే అనుకుందాం. చేసిన దానికి చాలా పశ్చాతాప పడుతున్నారు. ఎంత విచారంగా ఉంటున్నారో చూడండి . "

రమేశ్ మళ్లీ మౌనంగా ఉండిపోయాడు. శారద అతని మౌనాన్ని గమనించింది. సంభాషణ అక్కడ ఆపడం మంచిదనిపించింది ఆమెకు.

"నే వెళ్తానండీ .. మిమ్మల్నేమైనా బాధపెట్టి ఉంటే మన్నించండి . " అని పుస్తకాలు తీసుకుని వెళ్లిపోయింది.

రెండు రోజులు కొంచెం సుభావంగానే ఉన్నాడు రమేశ్. భోజనం, టిఫిన్ తనే తీసుకువెళ్లినా అతన్ని సంభాషణల్లోకి దించకుండా వచ్చేస్తోంది శారద. మూడో రోజు సాయంత్రం అతన్ని కదిలించింది.

"నా మీద మీకు బాగా కోపం వచ్చిందనుకుంటాను. మాట్లాడటమే మానేసారు."

"నాకు మీ మీద కోపమా? ఎందుకండీ? నా మంచికోసం చెప్పిన వాళ్లమీద కోపం తెచ్చుకుంటానా....? నా బాధ ఒక్కటే.... మీరు నా ఆవేదనను అర్థం చేసుకున్నారేగానీ దాని వెనుకగల అగ్నిగోళాలను గమనించడంలేదు. అయినా నాకు మిమ్మల్ని చూస్తుంటే చాలా సంతోషంగా ఉన్నది. నన్ను గురించి ఆలోచించేవాళ్లు ఒకరైనా ఉన్నారని తృప్తి... "

"అదేమిటండీ.... ఇంటిల్లిపాదీ మీ కోసం ఎంతో బాధపడుతుంటే అలాగ అనొచ్చా....?"

"బాధపడుతున్నారండీ.... నిజమే.... కానీ వాళ్లు బాధపడుతోంది నా ఆవేదనను చూసి కాదు. పెద్ద స్థితిలో ఉండవలసిన నా జీవితం ఇలా కావడంవల్ల తమ అంతస్తుకు భంగం వాటిల్లినదనీ, నన్ను నేను నిష్కారణంగా చేజేతులా నాశనం చేసుకుంటున్నాననీ వాళ్ల అభిప్రాయం.

"పోనివ్వండి.... కనీసం ఇన్నాళ్లకైనా మీరు దొరికారు, ప్రేమతో పలకరించడానికి, సానుభూతితో మాట్లాడడానికి. నాకు పొగడ్తలు రావు శారదా.... అప్‌రైట్‌గా మాట్లాడతాను.... మీరు దగ్గర ఉన్నంతసేపు చల్లని నీడలో ఉన్నట్లుంటుంది."

"పొగడ్తలు రావంటూనే పొగిడేస్తున్నారు. నా మీద కోపం వస్తుందన్నారుగా?"

"వస్తుందనుకోండి. అది టెంపరరీయే.... నిజం శారదా.... పొగడ్తకాదు. ఫ్రెండ్షిప్ చాలా వాల్యూబుల్.... ఫ్రెండ్ ఇన్ నీడ్ ఈజ్ ఎ ఫ్రెండ్ ఇండీడ్ అన్నారు. దానిని మీరు సార్థకం చేస్తున్నారు."

వాళ్లు మాట్లాడుకుంటుండగా శారదకు గోపాలకృష్ణయ్య నుంచి ఫోను వచ్చింది. ఆమె వెళ్లి ఫోను అందుకోగానే....

"శారదా.... నేనమ్మా! గోపాలకృష్ణయ్యని.... మీ రిజల్ట్సు ప్రకటించారంటే యూనివర్సిటీకి ఫోనుచేసి తెలుసుకున్నాను. నీకు సెకండుక్లాసు వచ్చింది, కంగ్రాచ్యులేషన్స్.... మరి మా అందరికీ మంచి పార్టీ ఇవ్వాలి." అన్నాడు.

"థాంక్స్.... అలాగే...." అన్నది శారద.

"ఉంటాను" అని ఫోనుపెట్టేశాడు గోపాలకృష్ణయ్య.

శారద ఆ విషయం రాజేశ్వరికి చెప్పి రమేశ్ దగ్గరకు వచ్చింది.






"రిజల్ట్సు వచ్చాయట రమేశ్ . మీ నాన్నగారు ఫోన్ చేసారు. నాకు సెకండు క్లాసు వచ్చింది."

"ఈ జిట్ వెరీగుడ్ కంగ్రాచ్యులేషన్స్. మరి పార్టీ?"

"ప్లెజర్ ఈ రాత్రికే ఇస్తాను.... తప్పక వస్తారుగా "

"నే నొక్కడినే అయితే వస్తాను."

"ఆ మాట అంటారని నాకు అనుమానంగానే ఉంది. మిగతావాళ్లందర్నీ వదిలేస్తే బాగుంటుందంటారా?"

"అయితే నన్ను వదిలేయండి."

మరీ చిన్నపిల్లాడిలా మాట్లాడితే ఎలా రమేశ్. ఎన్నో రోజుల తర్వాత నా జీవితంలో సంతోషకరమైన విషయం ఇది. మీలో ఎవరులేకున్నా బాధ కరమే అవుతుంది. ఫ్రెండ్షిప్‌కి మీరు ఎంతో విలువ ఇస్తారు. ఆలోచించండి. ఈరోజు కూడా నాకు బాధాకరంగా గడవాల్సిందేనా ?"

రమేశ్ కాసేపు మౌనంగా వున్నాడు.

"అంతేనంటారా ? పోన్లెండి నాలాటి అభాగ్యులు అలా ఆశించడమే తప్పు."

"ఆల్‌రైట్ వస్తానులెండి. నన్ను అక్కడ అవీ ఇవీ తినమని బలవంతం చేయకూడదు."

"అలాగే.. మీకు నచ్చినంతే తినండి. నేను కోరేది ఒక్కటే....టచ్ మి నాట్‌లా వుండొద్దు...."

అన్నమాట ప్రకారం రమేశ్ అందరితోపాటు డిన్నర్‌కి వచ్చాడు.

"శారదా నేను నీకు చాలా రుణపడి ఉన్నానమ్మా. చాలా రోజుల తర్వాత ఈ ఇల్లు మళ్లీ కళకళలాడుతోంది. అన్నింటినీ మించి మా నాన్న ఈ రోజున నన్ను క్షమించి నా సరసన భోంచేస్తున్నాడు," అన్నాడు గోపాలకృష్ణయ్య.

శారద రమేశ్‌వంక చూసింది. అతను తల పక్కకు తిప్పుకున్నాడు.

"శారదా....నాకు లిటరేచర్ ఎం.ఏ. చదవాలని ఉండేది. కాని నాన్నగారి కోరిక ప్రకారం నేను 'లా' చదివాను ఈ యింట్లో ఒక లిటరేచర్ ఎం.ఏ. ఉండాలని నా కోరిక. దాన్ని నువ్వు నెరవేర్చమ్మా," అన్నాడు రమేశ్ అన్న నరేశ్.

"నేనా?....నేను ఎం.ఏ చదివాలనుకోవడం లేదండీ....ఏదైనా ఉద్యోగం చెయ్యాలనుకుంటున్నాను."

"అదేమిటమ్మా....? నువ్వు నాకేమైనా బరువై పోతావా? ఈ ఇంట్లో అడుగెట్టిననాడే నా బిడ్డల్లో బిడ్డయ్యావు. ముందు ఎం.ఏ. చదువు. తరవాత సంగతి తరవాత చూద్దాం-" అన్నాడు గోపాలకృష్ణయ్య.

"నాకు ఇష్టం లేదండీ" అంది శారద.

"అది కాదమ్మా....నువ్వు ఆలోచించు. ఇప్పుడు ఉద్యోగమంటే మళ్లీ క్లర్కు....స్టెనోయో.... అంతే గదా! అలా ఎందుకు? ఎం.ఏ. చదువు. ఉద్యోగం తప్పనిసరి అనుకుంటే లెక్చరర్‌గా చేరుదువుగాని....ఆ ఏర్పాట్లు నేను చేస్తాను."

"వారు చేసిన పాపాల్ని ఇపుడొక మంచిపనితో కడుక్కోవాలని చూస్తున్నట్లున్నారు శారదా.... చేసిన పాపం అంత తేలికగా పోదు.... ఒక్క విషయం. మీరు మాత్రం చదువు ఆపొద్దు.... ఆ పాపపు సొమ్ము ముట్టుకోవద్దు లెండి. నేను స్టేట్స్‌లో ఉండగా సంపాదించినదానిలో ట్వెంటీ థౌజెండ్ వరకూ ఇంకా మిగిలివుంది. అందులో నుంచి మీకు కావలసినంత వాడుకోండి. ఏజ్.. ఏ.... ఫ్రెండ్...." అన్నాడు రమేశ్.

గోపాలకృష్ణయ్య కొడుకువంక దీనంగా చూసాడు.

తరువాత కూడా రమేశ్ శారదను ఎం.ఏ. చదవమని ఒత్తిడి చేసాడు. ఆమె ఎం.ఏ. లిటరేచర్‌లో చేరింది.

రోజులు గడుస్తున్నాయి. రమేశ్ శారద దగ్గర చనువు పెంచుకుంటున్నాడు. దొరికిన అవకాశాన్నల్లా ఉపయోగించుకుని అతనిలో మార్పుకు ప్రయత్నిస్తోంది శారద.

"రమేశ్....ఎప్పుడూ యింట్లో కూర్చోకపోతే రోజూ కాసేపు గేమ్స్‌కి వెళ్ళగూడదూ...." అంది ఒక రోజు.

"ఏమో.... ఆ సొసైటీలోకి పోవాలంటే నాకు ఇష్టం ఉండదు."

"పోనీ మనకు ఇంత గ్రౌండ్ ఉన్నదిగా .... షటిల్ కోర్టు వేయించనా? రోజూ కాసేపు ఆడుకోవచ్చు."

"మీకు షటిల్ వచ్చా? దెన్ అయామ్ రెడీ" అన్నాడు రమేశ్.

శారద కోర్టు వేయించింది. రమేశ్ రోజూ షటిల్ ఆడుతున్నాడు. అతన్ని సినిమాలకు బీచ్‌కి తీసుకెళ్ళడం ప్రారంభించింది శారద. క్రమంగా అతనిలో మార్పు వస్తోంది. దొరికిన అవకాశాన్ని జారవిడవకుండా వాతలు పెడుతోంది శారద.

"రమేశ్....మనిషికి ఏదో కార్యక్రమం ఉండాలి. అలా కాకుండా ఎప్పుడూ ఒంటరిగా ఉంటే పిచ్చి పిచ్చి ఆలోచనలు వస్తాయి. రోజు కాసేపు కొత్తగా కడుతున్న ఫ్యాక్టరీ దగ్గరకు వెళ్ళిరారాదూ?"

"మీరూ వస్తారా నా వెంట?"

"నాకు ఎలా వీలుపడుతుంది? వద్దంటే వినకుండా ఎం.ఏ.లో చేర్పించారా? వీలుదొరికినపుడల్లా వస్తూనే వుంటాను గదా."

"మీరు లేకుంటే ఇన్‌సెక్యూరిటీగా ఉంటుంది."

"ప్లీజ్ చెప్పినపుడు అర్థంచేసుకోండి."

రమేశ్ అయిష్టంగానే తలాడించాడు.

కాలం గడుస్తుంటే రమేశ్‌లో మార్పు వస్తోంది. మార్చి, మార్చి అతనిని మనిషిని చేసింది శారద. కొత్తగా నిర్మిస్తున్న కెమికల్స్ ఫ్యాక్టరీ పని తానే చూసుకోవడం మొదలెట్టాడు రమేశ్. అన్నింటినీ మించి గోపాలకృష్ణయ్యతో మాట్లాడుతున్నాడు.

తన బాధ్యత తీరినందుకు హాయిగా నిట్టూర్చింది శారద. ఆమె తమకు పుత్రభిక్ష పెట్టిందన్నారు రాజేశ్వరి, గోపాలకృష్ణయ్య.

శారద ఎం. ఏ. మొదటి సంవత్సరం పూర్తిచేసింది. మరో ఏడాది గడిస్తే వాళ్ళిద్దరికీ వివాహం చేయాలనుకున్నారు గోపాలకృష్ణయ్య, రాజేశ్వరి.

మూడు నెలలు గడిచాయి! ఫ్యాక్టరీ తెరిచేరోజు రేపనగా ఏర్పాట్లన్నీ పూర్తిచేసుకుని ఇంటికి తిరిగొస్తున్నారు.

"రమేశ్ . నాకు టైప్, షార్ట్‌హ్యాండ్ వచ్చు. ఎం. ఏ. చదువుతున్నాను. మీ ఫ్యాక్టరీలో స్టెనో పోస్టిస్తారా ?" అన్నది శారద.

"శారదా.... మీరు నాకు పూజనీయులు. నేను అర్థరువేసే స్టెనో పోస్టు కాదు.... ఫ్యాక్టరీ విషయంలో లోపాలు ఎత్తిచూపి నన్ను సరిదిద్దే కంట్రోలర్ పోస్ట్ మీకు ఉండనే ఉంది." అన్నాడు రమేశ్.

గోపాలకృష్ణయ్య, రాజేశ్వరి ముఖాలు చూసుకున్నారు.

పదిహేను రోజులు గడిచాక ఓ రోజు రమేశ్ ఫ్యాక్టరీనుంచి తిరిగివచ్చాడు. రాజేశ్వరి, శారద హాలులో కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

"శారదా.... ఒక్క నిముషం కళ్లు మూసుకోండి."

"ఏమిటి విశేషం ?"

"అబ్బ మూసుకోండి చెబుతాను."

శారద కళ్లు మూసుకుంది. రమేశ్ తన చేతిరుమాలు మూట విప్పి అందులోని గులాబీలు తీసి ఆమె పాదాలచెంత పెట్టాడు. రాజేశ్వరి నివ్వెరపోయి చూస్తోంది.

"ఇప్పుడు కళ్లు తెరచి చూడండి...."

శారద కళ్లు తెరచి చూసి తృళ్లిపడింది.

"ఇదేమిటి రమేశ్.... ?"

"శారదా....నిరాశ నిస్పృహలలో కొట్టుమిట్టాడుతున్న నన్ను చేరదీసి మనిషిని చేసారు. మీ ఋణం తీర్చుకోలేనిది. ఫ్యాక్టరీ ఆవరణలో మనం పెట్టిన గులాబీ చెట్లు పూచిన మొదటి పూలు మీకు అర్పిస్తున్నాను. అంతే...." అని వెళ్లిపోయాడు రమేశ్.

రాజేశ్వరి, శారద బొమ్మల్లా చూస్తుండిపోయారు. పరిస్థితి చేయిదాటుతున్నదనిపించింది రాజేశ్వరికి. రాత్రికి రమేశ్‌ను కదిలించింది.

"చిన్నీ శారద నీకు చేసిన సహాయానికి ఆమెకు నువ్వు ఏమి ఇవ్వాలనుకుంటున్నావు.... ?"

"ఏదైనా ఇస్తే తీరేదా అమ్మా ఆమె సాయం. ఆమెకోసం ఏమైనా చేస్తాను."

"నువ్వంటే తనకు చాలా ఇష్టం చిన్నీ....నిన్ను ఎంతగానో ప్రేమిస్తుంది. తను దొరికాక నాకు నిన్ను గురించి భయంపోయింది. కంటికి రెప్పలా కాపాడుకుంటుంది. నిన్ను తన చేతిలో పెడితే "



"అమ్మా....ఏమిటి నువ్వు అనేది ?"

"మీ ఇద్దరికీ వివాహం జరిగితే నా గుండె బరువు తీరుతుంది."

"అమ్మా" రమేశ్ బిగ్గరగా అరిచాడు.

"శారద నా పాలిట దైవం. ఆమెను నేను వేరే దృష్టితో ఏనాడూ చూడలేదు. ఆమె నిర్మలమైన ముఖంలో చల్లటి వాక్కులో నాకు స్నేహితురాలు కన్పించిందే గానీ స్త్రీ కన్పించలేదు. ఆమెను నేను ఆరాధించగలను....కానీ" రమేశ్ అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

"అమ్మా" అని రమేశ్ పెట్టిన కేకకు పక్కగదిలో ఉన్న శారద ఉలిక్కి పడింది. వెంటనే గుమ్మం దగ్గరకు వచ్చింది. రమేశ్ చెపుతున్న మిగతా మాటలు విన్పించాయి.

"తొందర పడ్డారమ్మా....ఇలాంటి ప్రసక్తి తేవద్దని చెపుదామనుకుంటూనే ఏదో ఆలోచనల్లో పడి మరచిపోయాను మీరేం బాధపడకండి" అని రమేశ్ గదిలోకి వెళ్ళింది శారద.

రమేశ్ చీకట్లో టేబుల్‌మీద తల ఆన్చి విచారంగా కూర్చున్నాడు. శారద లైటు వేసింది. అతను చివాలున తల ఎత్తాడు.

"శారదా....మీరా? అమ్మవాళ్లు నాకు ఎటువంటి సమస్య తెచ్చారో విన్నారా? స్నేహితుడిగా తప్ప నేను ఎప్పుడైనా మీతో వేరే విధంగా ప్రవర్తించానా. నన్ను మన్నించండి....మిమ్మల్ని ఆ రూపంలో చూడలేను." అంటూ ఆమె దగ్గర వాలి పోయాడు.

"రమేశ్....ఏమిటిది? మనం సన్నిహితంగా ఉండటం గమనించిన పెద్ద వాళ్లు తమ అభిప్రాయాన్ని మార్చుకుంటారు. దానికోసం ఇంతగా బాధపడాలా?" అంది శారద అతన్ని లేవనెత్తుతూ.

"స్త్రీ....పురుషుడు సన్నిహితంగా ఉంటే వీళ్లకు పెళ్లి మినహా ఇంకేం కన్పించదా....?" అన్నాడు రమేశ్.

"రమేశ్....వాళ్లను అపార్థం చేసుకోకండి. మీ జీవితం ప్రశాంతంగా సాగి పోవాలని వాళ్ల ఆశ. నేను మిమ్మల్ని జాగ్రత్తగా కాపాడుకుంటాననే ఉద్దేశ్యంతో, దానికో శాశ్వత సంబంధాన్ని కల్పించాలని సంకల్పించారు. మీ దగ్గర నా జీవితమూ సాఫీగా సాగిపోతుందని భావించారు....ఇలాటి ప్రస్తావన మళ్లీ ఇంకెప్పుడూ రాదు. కాని రమేశ్....దీన్ని గురించి ఆలోచిస్తూ మనసు పాడుచేసుకోనని నాకు వాగ్దానం చెయ్యాలి. కర్తవ్య నిర్వహణలో లోపం రానివ్వనని నాకు మాట ఇవ్వాలి"

"మీ నీడలో నాకు ఏలోటూ ఉండదు శారదా" అని చేతిలో చేయివేసి చెప్పాడు రమేశ్.

శారద పెద్దవాళ్లకు సర్ది చెప్పింది. మళ్లీ రమేశ్ దగ్గర ఆ ప్రస్తావన తేవద్దన్నది. రమేశ్ మొదటి రెండు రోజులు బాధపడినా మళ్లీ మామూలుగా అయ్యాడు.

మరో ఆరు నెలలు గడిచాయి. ఓ సాయంకాలం రమేశ్ గంతులు వేసు కుంటూ వచ్చాడు.

"శారదా....భలే శుభవార్త....మనకి ఎక్స్‌పోర్ట్ లైసెన్స్ వచ్చింది. మీకేం కావాలో కోరుకోండి...."

"మీ ఫ్యాక్టరీలో పనిచేసే వర్కర్స్‌నీ, మిగతా స్టాఫ్‌ని, వాళ్ల కష్టసుఖాలు తెలుసుకుంటూ కనిపెట్టి ఉండండి"

"అదెలాగూ చేస్తాను....మీ కోసం ఓ కోరిక కోరుకోండి."

"అలా అనుమానంగా అడుగుతారెందుకు ? ఎప్పుడైనా మీకు ఇచ్చిన మాట తప్పానా ?"

"ఇంతవరకు తప్పలేదనుకోండి అయితే చెప్పనా. ? మీరు పెళ్లి చేసుకోవాలి...."

"ఇదా మీ కోరిక....నా వల్ల కాదు...."

"అంటే ఇచ్చిన మాట తప్పే స్థితికి వచ్చారన్న మాట. ఇప్పుడేగా పెద్ద గొప్పగా అన్నారు.... 'ఏనాడైన ఇచ్చిన మాట తప్పానా' అని.... అసలు బుద్ధి తక్కువ నాది. మీరు నన్నేదో గౌరవిస్తున్నారని నన్ను నేను మభ్యపెట్టుకున్నాను."

"అంత మాట అనకండి శారదా."

"రమేశ్.... ఇంకా నన్ను మభ్యపెట్టా లనుకుంటున్నారా ? మీ ది మాట తప్పని ఉన్నత వ్యక్తిత్వ మనుకున్నాను. కాని నిజం ఇప్పుడే తెలుసుకున్నాను. చాలు.... ఇంతటితో చాలు...."

"శారదా.... ఏమిటి ఇవ్వాళ మీరు ఇంత ఆవేశంగా మాట్లాడుతున్నారు. ఆలోచించుకునేందుకు నాకు కొంచెం సమయమివ్వండి."

"అలాంటి వాళ్లు నాకు మాట ఇవ్వకుండా ఉండవలసింది. తప్పు నాది రమేశ్. మిమ్మల్ని నిజమైన స్నేహితుడని నమ్మి మోసపోయాను. మీకు నా మీద గౌరవం ఉన్నదనే భ్రమలో మీ డబ్బుతో ఎం. ఏ. చదువుతున్నాను, ఇంక నాకు ఇదేమీ అక్కర్లేదు. ఈ ఇంట్లో నాకు చోటు లేదు. నా దారి నేను వెదుక్కోవాలి." అని తన గదిలోకి వెళ్లింది శారద.

"శారదా.... నామాట వినండి...." ప్రాధేయపూర్వకంగా అడుగుతూ ఆమె వెనుకే వెళ్లాడు రమేశ్.

"నేను వినను. మీరు ఇక్కడినుంచి వెళ్లండి. మీ నుంచి నేను డబ్బు ఎంతో తీసుకున్నాను. బతికి బాగుంటే ఎప్పటికైనా తీర్చుకుంటాను. లేకుంటే ఎవరో దిక్కులేనిదానికి దానం చేశాననుకోండి...."

"శారదా.... మీరు ఇంత బాధపడతారనుకోలేదు. నన్ను క్షమించండి. మీ మాటకు ఎదురు చెప్పను. నా మాట నిలుపుకుంటాను. ఒక్క అభ్యర్థన. కొంత కాలం పోనివ్వండి "

"నాకేం అక్కర్లేదు. మళ్లీ రేపటి నుంచీ అన్నం నీళ్లు మానేసి నన్ను నానా మాటలు అన్పించడానికా ?"

"లేదు శారదా హృదయపూర్వకంగా చెబుతున్నాను. నా మాట నమ్మండి...."

శారద హాయిగా నిట్టూర్చింది. తను అంత బాగా నటించగలనని ఆమె ఎన్నడూ అనుకోలేదు.

"ఇంకా నా మీద కోపం తగ్గలేదా మీకు?" రమేశ్ ఏడుపు ముఖంతో అన్నాడు.

"నాకు మీ మీద కోపమా? లేదు రమేశ్.. మీరు ఇచ్చినమాట కాదనేసరికి బాధేసింది.... అయిపోయిందిగా...."

"ఏదైనా పిక్చర్‌కి వెళదామా.... రిలీఫ్‌గా ఉంటుంది."

శారద 'సరే' అన్నది. ఇద్దరూ డ్రెస్ మార్చుకుని సినిమా కెళ్లారు. సినిమా చూస్తూ మధ్య మధ్యలో అతన్ని గమనిస్తోంది శారద. ఇంటర్వెల్‌లో లైట్లు వెలిగాయి. శారద పక్కకు తిరిగింది. తన కళ్లను తనే నమ్మలేకపోయింది.

"శారదా....! మీరా?" అన్నాడు శ్యామ్.

"శ్యామ్.... మీరిక్కడ ఉన్నారా?" అన్నది శారద.

"నా భార్య రజని.... రజనీ! ఈమె శారద. నా కాలేజీ మేట్...." అని పక్కనున్న స్త్రీని శారదను పరస్పరం పరిచయంచేసి రమేశ్‌వంక చూసాడు శ్యామ్.

"నా ఫ్రెండ్ రమేశ్....నేను వారి ఇంట్లోనే ఉండి ఎం.ఏ. చేస్తున్నాను."

శ్యామ్ రమేశ్ పలకరించుకున్నారు.

"మా అమ్మ చెప్పారు శారదా మీ విషయాలన్నీ.... సంతోషం.... ఒక ఒడ్డుకు చేరారు."

"అసలు సంతోషం మీరు, మీ అమ్మగారు కలవడం. బాగున్నారా ఆమె ఎక్కడున్నారు?"

"బాగున్నారు.... నా దగ్గరే ఉన్నారు" అన్నాడు శ్యామ్.

సినిమా అయ్యాక శ్యామ్‌ని, రజనిని ఇంటి దగ్గర దిగబెట్టాడు రమేశ్.

శ్యామ్ ఇల్లు వదిలినపుడు సరాసరి విశాఖపట్నం వచ్చాడు. మాసిన గడ్డంతో నిరాశగా బీచ్‌లో తిరుగుతున్న అతన్ని ఒక రోజున రజని తండ్రి శివరామయ్య చూసాడు. సంభాషణ ప్రారంభించి వివరాలడిగాడు. తను ఓ అనాధననీ, అప్పటి వరకు ఒకళ్లు పెంచారనీ, తరువాత వాళ్ళకు తనకు సరిపోక వచ్చేసి ఉద్యోగం కోసం వెదుకుతున్నాననీ చెప్పాడు శ్యామ్.

శివరామయ్యకు కుర్రవాడు రత్నంలా అగుపించాడు. ఉద్యోగం చూపిస్తానని




అతి బలవంతంమీద శ్యామ్‌ని తన ఇంటికి తీసుకెళ్లాడు. ఆయన ఒక ప్రైవేటు కంపెనీలో పెద్ద హోదాలో ఉన్నాడు. తన పలుకుబడితో శ్యామ్‌కు ఉద్యోగం చూపాడు. శ్యామ్ వేరే రూమ్‌తీసుకుని ఉంటానంటే వీలులేదని తన ఇంట్లోనే అట్టిపెట్టుకున్నాడు.

శివరామయ్య మెల్లగా శ్యామ్ మనసు కనిపెట్టాడు. అతన్ని అల్లుడిగా చేసుకోవాలనుకున్న శివరామయ్యకు శ్యామ్ పెళ్లిమాట ఎత్తవద్దనటంతో ఆశాభంగమైంది. ఎలాగైనా అతన్ని చెయ్యి జారనివ్వగూడదనుకున్నాడు.

శివరామయ్య పరమ లౌకికుడు. ప్రపంచానుభవాన్ని కాచి వడపోశాడు. శ్యామ్– రజని గురించి గోడలమీదకు ఎక్కించాడు. చుట్టుపక్కల అంతా నిముషాల మీద అల్లుకుపోయింది ఆ వార్త. రజని గొల్లున ఏడ్చేసింది. శ్యామ్‌కు తెలిసి ఆమెను ఓదార్చబోయాడు.

"ఇంక దానికి పెళ్లెక్కడ అవుతుంది" అన్నది రజని తల్లి. శ్యామ్ ఇరకాటంలో పడ్డాడు,

ఇంకా నాలుగు ఘట్టాలు నడిపాడు శివరామయ్య. నలుగురు పెద్దలతోనూ శ్యామ్‌కు చెప్పించాడు సానుభూతితో ఆలోచించమని.... తను మాత్రం నోరు విప్పలేదు. రజని పరిస్థితి శ్యామ్‌ను కదిలించింది. అతను అంగీకరించాడు.

వాళ్లిద్దరికీ పెళ్లిచేసాడు శివరామయ్య. తన శక్తి సామర్థ్యాలతో ఏడాది తిరిగేలోగా ఆఫీసర్ హోదా సంపాదించాడు శ్యామ్.

ఆనాడు విడిపోయిన శ్యామ్ ఇలా కలవడంతో శారద చాలా సంతోషించింది.

శారద ఎం. ఏ. సెకండ్‌క్లాస్‌లో పాసయింది. గోపాలకృష్ణయ్య తన పలుకు బడితో ఆమెకు ఉమెన్స్‌కాలేజీలో లెక్చరర్ పోస్టు చూసాడు. శారద అందులో జాయినయ్యింది.

కాలేజీ వార్షికోత్సవాల సమయంలో సాంస్కృతిక కార్యక్రమాల బాధ్యతను శారద స్వీకరించింది. శ్యామ్ దంపతులను ఆ కార్యక్రమాలకు ఆహ్వానించింది.

"సారీ శారద నాకు.... నాకు ఆడిటింగ్ రోజులు.... పని చాలా ఎక్కువగా ఉన్నది. రాత్రి పదిగంటలవరకు తీరిక దొరకదు.... రాలేను." అన్నాడు శ్యామ్.

"పోనీ మీరైనా రండి" రజనిని అడిగింది శారద.

"ఒక్కదానిని రావాలంటే ఏదోగా ఉంటుంది. ప్లీజ్ ఏమీ అనుకోవద్దు."

శారద నిరాశపడి వెళ్లిపోయింది. శ్యామ్ రజనిని వెళ్లమని చెప్పాడు. ఆమె వెళ్లనంది. ఎవరూ వెళ్లకపోతే శారద బాధపడుతుందనుకున్నాడు శ్యామ్. "రాలే మని చెప్పాక ఇంక ఎందుకు బాధపడుతుంది?" అన్నది రజని.

శ్యామ్ ఆఫీసు కెళ్లాడు. సాయంకాలం అయ్యేసరికి శారద విషయం గుర్తొచ్చింది. వెళ్లకపోతే ఆమె బాధ పడుతుందనిపించింది. ఇంటికి ఫోన్ చేసాడు రజని కోసం. ఆమె అప్పటికే బయలుదేరి వెళ్లిందని చెప్పింది తల్లి. తను ఆఫీసు నుంచి సరాసరి వెళ్లాడు.

"బాగుంది.... ఇలా ఉండాలి. రాలేమని చెప్పి ఇద్దరూ వచ్చారు. చాలా థ్యాంక్స్." అన్నది శారద.

కార్యక్రమాలు అయిపోయాక వాళ్లను ఇంటిదగ్గర దించి వెళ్లింది శారద. ఇంట్లోకి వెళ్లగానే అందుకుంది రజని!

"రానని చెప్పారుగా! శారద ఆహ్వానం అనేసరికి ఆడిటింగ్ వాయిదా పడిందా....?"

"ఏం మాటలు అవి రజనీ.... నోటికి హద్దుపద్దు ఉండక్కర్లా.... వెళ్లకపోతే ఆమె బాధపడుతుందనిపించింది. అందుకని...."

"నేను రానన్నానుగా.... ఇంకెందుకు బాగోదు?" శ్యామ్ మాటలు పూర్తిగా వినకుండానే అన్నది రజని.

"రజనీ ...అంతటితో నోర్మూయ్....మనిషై పుట్టాక కాస్త జ్ఞానం ఉండాలి." ఇద్దరం వెళ్దామనే ఇంటికి ఫోన్‌చేశాను. నువ్వు అప్పటికే వెళ్ళిపోయావని అమ్మ చెప్పింది." చిరాకుగా అన్నాడు శ్యామ్....

"జ్ఞానం ఉంది కాబట్టే శృతి మించకముందు మేల్కొవా లనుకుంటున్నాను. ఆవిడ పరిచయమైన నాటినుంచీ చూస్తున్నాను. మీలో ఏదో అపూర్వమైన మార్పు కన్పిస్తోంది. కొత్త స్ఫూర్తి వచ్చింది."

"ఆమె నా స్నేహితురాలు. ఆమె అంటే నాకు గౌరవం ఉంది."

"గౌరవమో ప్రేమో నాకు అక్కర్లేదు.... నా భర్త నాకన్నా మరో స్త్రీకి విలువ ఇవ్వడం నేను సహించను. నేనే కాదు.. ఏ ఆడదీ సహించదు. అందుకే చెపుతున్నాను. శృతిమించి రాగానపడనివ్వద్దని." అని చరచరా వెళ్ళిపోయింది రజని.

శ్యామ్ భగ్గున మండిపోయాడు. అవమానంతో అతని శరీరం కంపించింది. అలా మొదలయ్యాయి వాళ్ళిద్దరి మధ్య కలతలు.

ఒకరోజు శారద నరేశ్ పిల్లలతోనూ, రమేశ్‌తోనూ కలిసి బీచ్‌కి వెళ్ళింది. అక్కడ శ్యామ్ భార్యాపిల్లలతో ఎదురయ్యాడు. శారద చిరునవ్వుతో ఆహ్వానించింది. కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

అంతలో పిచ్చికగూళ్ళు కట్టుకుంటున్న నరేశ్ పిల్లలు పేచీపడి కలబడ్డారు. పెద్దవాడు చిన్నవాడివి ఒకటేశాడు. రెండోవాడు ఇసుకముద్దను వాడిపై విసిరాడు. అది గురితప్పి శ్యామ్ ముఖాన పడింది.

శ్యామ్ కన్ను నలుపుతోంటే రజని అలాగే చూస్తూ ఊరుకుంది. శారద ఆందోళనతో,

"కన్ను నలపకండి శ్యామ్.... ఉండండి...." అంటూ వెళ్ళి చేతి రూమాలు నీళ్లలో తడిపి తెచ్చి ఇచ్చింది.

ఆ దృశ్యం చూసిన రజని ఉడికిపోయింది. శ్యామ్ కన్ను తుడుచుకున్నాడు.

చీకటిపడ్డాక బయలుదేరారు. శారద వాళ్లను తమతోపాటు రమ్మన్నది. టాక్సీలో వెళతామంది రజని.

"నా కారు టాక్సీపాటి విలువ చెయ్యదా? రండి డ్రాప్ చేస్తాం" అన్నాడు రమేశ్.

రజని తిట్టుకుంటూనే కారెక్కింది. శారద, రమేశ్ వాళ్ళను దింపి వెళ్ళిపోయారు. ఆ రోజు రజని-శ్యామ్‌ల మధ్య ఘర్షణ చిలికిచిలికి గాలివాన అయింది.

"ఇవ్వాళ రుమాలు తడిపి అందించింది. రేపు ఒడిలో పడుకోబెట్టుకుంటుంది. [illegible]..."

"నోర్ముయ్..." శ్యామ్ చాచి లెంపకాయ కొట్టాడు. "మళ్ళీ ఇలాంటి తప్పుడు కూతలు కూసావో జాగ్రత్త.... శారద అంటే ఏమనుకున్నావు....?"

రజని ఛోదన పెడుస్తూ గదిలోకి వెళ్ళింది. శ్యామ్ తల్లి జోక్యంచేసుకుని ఇద్దరినీ మందలించింది.

ఒకరోజు శారద కాలేజీకి బయలుదేరుతుండగా రాజేశ్వరి పిలిచి,

"శారదా.... పిల్లలు గొడవచేస్తున్నారమ్మా.... సాయంత్రం సినిమాకు వెళదాం" అన్నది.

"అలాగేనమ్మా" అని వెళ్ళింది శారద.

సాయంత్రం ఆమె తిరిగి వస్తుండగా శ్యామ్ కన్పించాడు. శారద కారు ఆపి ఇంటిదగ్గర డ్రాప్‌చేస్తాను రమ్మంది. కొంతదూరం వెళ్ళేసరికి రజని రి లో వెళ్తోంది. టాప్ వేసివుండటంవల్ల ఆమెను వాళ్ళు గమనించలా. కారు రిక్షాను దాటగానే రజని వాళ్ళను చూసింది.

శ్యామ్‌తల్లి కాఫీ తీసుకువెళ్ళమంటే ఆగింది శారద. అంతలో రజని వచ్చింది. శారద పలకరిస్తే ముభావంగా సమాధానమిచ్చి "వస్తుంది" అని లోపలికి వెళ్ళింది. ఆమె ప్రవర్తనకు శారద మనసు చివుక్కుమన్నది.

కాఫీ అయ్యాక శ్యామ్‌తోను, అతని తల్లితోను చెప్పి రజనితో చెప్పమని వెళ్ళి కారెక్కింది శారద. కొంతదూరం పోయాక ఆమె హ్యాండ్‌బ్యాగ్ మరచి పోయానని గమనించింది. కారు వెనక్కి పోనివ్వమంది డ్రైవర్‌తో.... ఆమె వెళ్ళేసరికి శ్యామ్, రజని గలాటాలో ఉన్నాడు.

"[illegible] [illegible] [illegible] మొగుణ్ణి చూస్తే మొట్టు [illegible]. [illegible]లో [illegible] [illegible] రిక్షాలో వెళ్ళే పెళ్ళాం ఎందుకు కన్పిస్తుంది?"

"రోడ్డుమీద రిక్షాలోవెళ్ళే ప్రతి స్త్రీవంక తొంగిచూసే సంస్కారం నాకు లేదు...."

"ఇంతకూ ఒకటి అడుగుతున్నాను. దానితో సంబంధాలు మానుకోరా....?"

"నాలుక చీరేస్తాను జాగ్రత్త....! మర్యాదగా మాట్లాడు."

"రాక్షసి దీనికి నా కాపురమే దొరికింది గాబోలు నాశనం చెయ్యడానికి. ఎవరికి తెలియదు దీని సంగతి. నిన్నటివరకు గోపాలకృష్ణయ్య కొడుకు ఇవ్వాళ మీరు. రేపు .. "

శారద చెవులు మూసుకుంది.

"షట్టరాల్రాయ్. ఒళ్ళు దగ్గర పెట్టుకుని మాట్లాడు. ఆమెకు అపవిత్రత అపాదించటానికి సిగ్గుండక్కర్లా...."

"సిగ్గు.... నాకేం అక్కర్లేదు. మీకు ఉండాలి. కట్టుకున్న పెళ్ళాన్ని వదిలి ఎవతో రంగేశితో తిరగడానికి.... అడ్డదిడ్డపుట్టి నీతి నియమం లేకుండా కాపురాలలో చిచ్చుపెట్టడానికి దానికుండాలి సిగ్గు...."

శ్యామ్ భరించలేకపోయాడు.

"నోర్ముయ్...." అని చెయ్యెత్తాడు రజనివైపు తిరిగి.

ఎదురుగా శారద నిలబడివుంది.

"శారదా! మీరా ?" అన్నాడు అచేతనంగా.

శారద నిరువుగా అడుగులు వేసుకుంటూ ముందుకు వచ్చింది.

"చూడండి.... మీ మనోభావం నేను ఇపుడు అర్థంచేసుకున్నాను. మీ మనసులో భావాలు అర్థంచేసుకోగలశక్తి నాలో లేదు. అదే తెలుసుకుని ఉంటే నేను ఇక్కడికి రావడం ఎప్పుడో మానేసి ఉండేదాన్ని.

"నావల్ల మీకు ఇంతవరకూ ఎటువంటి అన్యాయం జరగలేదు. జరగదు కూడా. గుడ్డి అనుమానాలతో పండంటి కాపురం నాశనం చేసుకోకండి....

"ఈర్ష్యాద్వేషాలతో మీ మనసు చెడిపోయింది. మీరు అనుకున్న గొప్ప గుణాలేమీ నాలో లేవండీ....నేనంత తెలివికలదాన్ని కాదు. నావల్ల మీ కాపురం నాశనం అవుతోందనుకున్నారు కదూ! అలా జరగలేదు.... జరగదు నేను మీ భర్తను ఇంకెప్పుడూ కలుసుకోను...." అని రజనితోనూ,

"శ్యామ్.... స్త్రీ పురుషులమధ్య స్నేహాన్ని అర్థంచేసుకోగల శక్తి మన సమాజానికి లేదు. మీకీ పరిస్థితి కల్పించినందుకు నన్ను క్షమించండి." అని శ్యామ్‌తో చెప్పి చివాలున వెనుదిరిగి వచ్చి కారెక్కింది శారద.

కారు వేగంతోపాటు ఆమె మనసులో ఆలోచనలూ వేగంగా తిరగటం ప్రారంభించాయి. ఆ అవమానం ఎలా భరించాలో ఆమెకు అర్థంకాలేదు. గుండెల్లో అగ్నిపర్వతాలు బ్రద్దలవుతున్నాయి.

ఇంటికి చేరుకునేసరికి రాజేశ్వరి, పిల్లలు కోడలితో సినిమాకు సిద్ధంగా ఉన్నది.

"తలంతా బద్దలైపోతున్నదమ్మా నేను రాలేను. మీరు వెళ్ళిరండి" అన్నది శారద.

రాజేశ్వరి అయిష్టంగానే వెళ్ళింది వాళ్ళతో. శారద గదిలోకి వెళ్ళి మంచం మీద పడింది. ఆలోచనలు గిర్రున తిరుగుతున్నాయి.

"గోపాలకృష్ణయ్య.... రాజేశ్వరి.... తనకు వివాహ ప్రయత్నం చేస్తున్నారు. వివాహం అయితే అపుడు యింకెన్ని సమస్యలు ఎదురవుతాయో?.... ఇలాంటి పరిస్థితిలో అసలు నేను ఎందుకు బ్రతకాలి? ఈ పాడు ప్రపంచంలో బ్రతుకుతూ రోజూ చచ్చేకంటే.... ఒకేసారి చచ్చి తమ్ముణ్ణి చేరుకుంటే....?'

అటు ఇటు సతమతమైపోయింది. గడియారం తొమ్మిది కొట్టింది. శారద ఉలిక్కిపడింది. అంతా తిరిగొచ్చే సమయం అవుతోంది. క్షణికోద్రేకం ఆమెను ఆవరించింది. మంచంమీద నుంచి లేచింది. గోపాలకృష్ణకు, రాజేశ్వరికి ఉత్తరం రాసింది. తన చావుకు ఎవరూ బాధ్యులుకారని, జీవితంమీద కలిగిన విరక్తే తనతో అలా చేయిస్తోందని మరో ఉత్తరం రాసింది.

గదిలోంచి బయటకు వచ్చి చూసింది. పనివాళ్ళు లోపల ఉన్నారు. చప్పుడు లేకుండా అడుగులు వేసుకుంటూ వచ్చి గేటుతీసి బయటపడింది. వందగజాలు పోయాక రిక్షాదొరికితే ఎక్కి సముద్రంఒడ్డు చేరుకుంది.

* * *

"అది బాబూ నా బ్రతుకు....అలా పోవాలనుకుంటే నువ్వు అడ్డుకుని ఇలా కట్టేశావు" అన్నది ఆమె.

"నేనూ మీలాటి అభాగ్యుడినేనమ్మా....కొన్నాళ్ళుగా జీవితంలో తీరని బాధను ఆరని ఆవేదనను అనుభవిస్తున్నాను. నా బాధనుంచి బయటపడటానికి ఆత్మహత్యే మార్గమని చాలాసార్లు అనుకున్నాను. కాని ఆవేశాన్ని ఆలోచనల్లోకి మార్చితే అది తప్పుగాను పిరికితనంగాను అగుపించేది."

"జీవితం మీద విరక్తి కలిగింది బాబూ.... ఆ బాధలో రాజా పిలిచినట్లనిపించింది."

"నా పరిస్థితీ అంతేనమ్మా....నాకు తల్లీ తండ్రీ ఉన్నారు. ప్రాణప్రదంగా చూసుకునే స్నేహితులున్నారు కానీ.."

"ఏం జరిగింది బాబూ?"

"చెపుతానమ్మా.." అని నిట్టూర్చాడు అతడు.

ఆ నిట్టూర్పు అతన్ని పదకొండేళ్ళ వెనక్కి తీసుకెళ్ళింది.

* * *






అతని పేరు కృష్ణ. అతనిది తెనాలి దగ్గర ఓ పల్లెటూరు. అతని తండ్రి గోవర్ధనరావు. ఆ ఊళ్లో పెద్ద రైతుల్లో ఒకడు.

గోవర్ధనరావుకు రాజకీయాలు మినహా మరేమీ పట్టేదికాదు. ఎం. ఎల్. ఏ. కావాలని అతని తాపత్రయం. ఎప్పుడూ గుంటూరు, హైద్రాబాద్ తిరిగి వస్తుండేవాడు.

కృష్ణతల్లి పద్మావతి రోగిష్ఠి మనిషి. కొంచెంసేపు పనిచేస్తే చాలు ఆమెకు ఆయాసం వచ్చేది. అందువల్ల ఎక్కువ కాలం మంచంమీదే పడుండేది. ఇంటి పని, వంట వార్పు అంతా కృష్ణ అమ్మమ్మ చూస్తుండేది. కృష్ణ ఆమెను "ఉఫ్" అని దులిపేస్తుండేవాడు.

కృష్ణది చిన్ననాటి నుంచీ తిరుగుబాటు తత్వం. అతను ఎందులోనూ, ఎవ్వరినీ లక్ష్యపెట్టేవాడు కాదు. తన జోలికి వచ్చినవాళ్లని వెనకాముందు చూడకుండా బండబూతులు తిట్టేవాడు. వాళ్లు వారం రోజులవరకు మళ్లీ బజారు ముఖం చూడగలిగేవాళ్లు కాదు.

ఊళ్లో అంతా అతన్ని చూసి మండిపడేవాళ్లు. శాపనార్థాలు పెట్టేవాళ్లు. వాళ్లు ఒకటంటే అతను పది అనేవాడు.

అలా గడుస్తుండేయి రోజులు.

ఒకరోజు కృష్ణ తన వానరసైన్యంతో కోతికొమ్మచ్చు లాడుతున్నాడు. అతను చెట్టుమీద నుంచి దూకి పరుగెత్తుతున్న సమయంలో రామయ్య అనే ముసలా

యన కావిడేసుకుని ఎదురొచ్చాడు. కృష్ణ వేగంలో ఆయనను ఢీ కొన్నాడు. ఆయన కావడితో సహా బిళ్ళబీటుగా పడ్డాడు. కృష్ణ మరో పక్కన పడ్డాడు.

"గాడిదకొడకా. దూడలాగా బలిసి ఒళ్ళు కొవ్వెక్కి కొట్టుకుంటున్నావు. కళ్ళు పూడిపోయినయ్యా? మనిషి కనబడటంలా?" అన్నాడు రామయ్య.

"రామయ్య తాతా....నువ్వు నన్ను చూడలేదు. నేను నిన్ను చూడలేదు. ఇద్దరిదీ తప్పే. అనవసరంగా నన్ను తిట్టొద్దు.... మర్యాదగా చెపుతున్నాను.... నన్ను తిట్టావంటే నువ్వు తిట్టినదానికి పదిరెట్లు తిడతాను." కృష్ణ ఒళ్ళు దులుపుకుంటూ 'లా' పాయింటుతో అన్నాడు.

రామయ్యకు చేతులు కాళ్ళు కొట్టుకుపోయాయి. నడుం పట్టింది. కృష్ణ ఎదురు తిరగటంతో ఆయన మండిపడ్డాడు.

"పళ్ళూడగొడతాను....వెధవా....ఇంకా మాట్లాడుతున్నావా....?"

"కొట్టావులే గంజి .... నీలాంటివాళ్ళని లక్ష తొంభైమందిని చూసాను. ఊరికే తిడతావేం? అసలు నీ కళ్ళ ఏమయ్యాయి?"

"ఏమిట్రా కూశావ్....? మళ్ళీ కుయ్యి." అని ఆయన ముందుకు రాబోయాడు.

"ఏమిటా? నువ్వు నాకు తగలకుండానే నేను నీకు తగిలానా? ఇద్దరం ఢీ కొట్టుకున్నాం....ఇద్దరిదీ తప్పే"

కృష్ణ మాటలకు ఆయన వద్ద సమాధానం లేకపోయింది. అతన్ని పట్టుకుని రెండు వెయ్యడానికి ముందుకు వచ్చాడు. కృష్ణ పరుగు లంకించుకోబోతుండగా చుట్టూ చేరినవాళ్ళు పట్టుకుని ఆయనకు అందించారు.

"ఏదిరా వాగు...." ఆయన కృష్ణ చెవిమెలేసి అన్నాడు.

"బాగా తగలనివ్వు పెద్దయ్యా.... వీడికి ఈ మధ్య ఒళ్ళు మరీ నీరుపట్టింది." కృష్ణమీద చెయ్యి చేసుకోవాలంటే భయపడే ఓ పిరికిగుండె మనిషి అన్నాడు.

రామయ్య రెండు వేసాడు... కృష్ణ పంచాంగం విప్పాడు.... ఆయన మరో నాలుగు అంటించాడు. కృష్ణ మౌనంగా భరించాడు. చుట్టూ చేరినవాళ్ళు తలో మాట అన్నారు. రామయ్య కొట్టిన దెబ్బలకంటే వాళ్ళ మాటలే బాగా తగిలాయి కృష్ణకు.

"ఏరా....ఇంకా ఇక్కడే ఉన్నావెందుకు? ఎలాగూ నీళ్ళు వదిలాయిగా.... నెత్తిన గుడ్డేసుకుపో...." అన్నారు చుట్టూ చేరినవాళ్ళు.

కృష్ణ వాళ్ళవంక కొరకొర చూసి వాళ్ళ వెనకే బయలుదేరాడు. దారి వెంట చుట్టూ వెదుకుతూ వెళ్తున్నాడు. కొంత దూరం పోయేసరికి దారి పక్కన పేడ

కన్పించింది. చేతినిండా తీసుకుని నాలుగు అడుగులు ముందుకేసి వాళ్ళ మొఖాన కొట్టి పారిపోయాడు....

కృష్ణ మరికొందరు పిల్లలు వాళ్ళ క్లాసుటీచరు దగ్గర ప్రైవేటు చదువుతుండేవారు. ఒక రోజున ఆయన పాఠం చెపుతున్నపుడు ప్రసవవేదన ప్రస్తావన వచ్చింది.

"మాస్టారూ .. ప్రసవవేదన అంటే ఏమిటండీ ?" అన్నాడు రంగడు.

"తల్లి బిడ్డకు జన్మ యిచ్చేటపుడు అనుభవించే బాధను ప్రసవవేదన అంటారు."

"అయితే పిల్లలు పుట్టాలంటే తల్లి చాలా బాధపడాలా మాస్టారూ ?" మరో కుర్రాడు అడిగాడు.

"మాస్టారూ ? ఇంతకూ ప్రసవవేదన మీరు ఎప్పుడైనా చూసారా" అన్నాడు కృష్ణ.

కృష్ణ అమాయకంగానే అడిగాడు. కావి అతని ప్రకృతినిబట్టి అల్లరికోసమే అడిగాడనుకున్నాడు మాస్టరు. కేన్ తీసుకుని వీపు చిట్లగొట్టాడు.

కృష్ణలో పగ బుసకొట్టింది. ఎట్లాగైనా మాస్టరును ఏడ్పించాలనుకున్నాడు. కాలవగట్టున పల్లేరుకాయలు ఏరుకొచ్చి రాత్రికి మంచందగ్గర పోద్దామనుకుని బయలుదేరాడు.పశువుల చావడి దగ్గరకి వెళ్ళేసరికి ఎర్రని తేళ్లు రెండు కనిపించాయి. నానా తంటాలుపడి వాటిని పట్టుకుని తెచ్చాడు.

ఆ రోజుల్లో మాస్టరు పెళ్లాం ఊళ్లోలేదు ఆయన స్వయంగా వంట చేసుకునేవాడు. కందిపప్పు రోజూ వండుకునే అలవాటు. కృష్ణ సాయంకాలం ప్రైవేటుకు వెళ్లినప్పుడు ఆయన కన్నుగప్పి రెండు తేళ్లను డబ్బాలో వేసాడు. మర్నాడు ఉదయం మాస్టరు కందిపప్పు కోసం డబ్బాలో చెయ్యి పెట్టాడు. అంటించాడు కొండేలయ్య.

మందులు వేసారు. మంత్రాలు వేసారు. తగ్గలేదు. అది ఒంటిపూస తేలు. మాస్టరు పరిస్థితి విషమించింది. తెనాలి తీసుకెళ్లారు. చావు తప్పి కన్ను లొట్టపోయినట్టు బ్రతికి బయటపడ్డాడాయన.

పెలయేరులా అల్లరులతో అలా సాగిపోతున్న కృష్ణ జీవితం సంక్రాంతి పండుగ గడచిన కొద్ది రోజులకు ఊహించని విధంగా మలుపు తిరిగింది.

పద్మావతికి ఒక తోబుట్టువు ఉండేది. వాళ్ల ఆర్థిక పరిస్థితులు అనుకోకుండా దెబ్బతిన్నాయి. వాళ్లను తన ఊరికి తీసుకొచ్చి తోడల్లుడికి వ్యవసాయం బాధ్యత అప్పగించి తాను కొంత వీలుచేసుకోవాలనుకున్నాడు గోవర్ధనరావు. అతి కష్టంమీద వాళ్లకు నచ్చజెప్పి ఒప్పించాడు.

ఫిబ్రవరి మొదటివారంలో కృష్ణ పెద్దమ్మ కుటుంబం ఆ ఊరికి కాపురం మార్చారు. ఆమెకు ముగ్గురు పిల్లలు. పెద్దామె రోహిణి. రెండవవాడు మధు. చివరి పిల్ల ఛాయ. రోహిణి వివాహం అయింది.

వాళ్లొచ్చే రోజున కృష్ణ నౌకరు నర్సయ్యతో కలిసి స్టేషన్‌కు బండి తోలు కెళ్ళాడు. అక్కడ చూసినపుడు అతనికి ఆమె ముఖంలో అనిర్వచనీయమైన మమత అగుపించింది.

అంతకుముందు సెలవులకు వచ్చినపుడు అతను ఛాయను అనేకసార్లు చూసాడు. ఈసారి కలిగిన అనుభూతి వేరు.

ఛాయ పెద్ద అందగత్తె కాకున్నా ఆకర్షణీయంగా ఉండేది. ఆమె ముఖంలో మందహాసం తొణికిసలాడుతుండేది. 'సిరిగల ముఖం' అనేవారు చూసినవాళ్లు. వయసుకు మించిన విజ్ఞత ఉండేది ఆమెలో.

కృష్ణ పెద్దమ్మవాళ్లు వస్తూ వస్తూ చేలోఉన్న చింతచెట్టు దులుపుకొచ్చారు. పచ్చడికోసం ఏరడానికి బస్తాలో కాయలు తిరగబోసారు. వాళ్ల పెద్దమ్మ ఉప్పు కారం కొట్టిస్తోంది. పద్మావతి ఆమెదగ్గర కూర్చుని కబుర్లు వింటోంది.

మధు, ఛాయ కబుర్లు చెప్పుకుంటూ కాయలు ఏరుతుండగా కృష్ణ వెళ్లి స్థంభాన్ని ఆనుకుని నిలబడ్డాడు.

వాళ్లు వచ్చినప్పటినుంచీ కృష్ణ వెనకాలే తచ్చిట్లాడుతున్నాడు. ఆమెతో ఏమేమో మాట్లాడాలని సతమతమవుతున్నాడు. ఆమెకు ఏదో ఒక పని ఉండటం వల్ల అతనితో ఎక్కువ మాట్లాడలేకపోయింది. మామూలు కుశల ప్రశ్నలు వేసి వదిలేసింది.

మాటల్లో ఉండటంవల్ల ఛాయగానీ మధుగానీ గుంజను ఆనుకుని ఉన్న కృష్ణను గమనించలేదు. అతనూ వాళ్లలోకి వెళ్లి కూర్చోలేకపోయాడు. కాసేపటికి ఛాయ తలెత్తి చూసింది. ఎదురుగా ఆమెవంకే రెప్పవాల్చకుండా చూస్తూ అగుపడ్డాడు కృష్ణ.

"అరె... అలా నిలబడి ఉన్నావే కృష్ణా.. రా కూర్చో..." అన్నది ఆమె

అప్పటివరకు ఛాయ తనతో ఎప్పుడు మాట్లాడుతుందా అని ఎదురుచూస్తు న్నాడు కృష్ణ. తీరా ఆమె పలకరించేసరికి అక్కడినుంచి పారిపోయాడు.

అటు ఇటు తిరిగి చీకటిపడేసరికి ఇల్లు చేరుకున్నాడు కృష్ణ. ఛాయ దీపాలు వెలిగించి గదిలో చాపమీద కూర్చుని చదువుకుంటోంది. కృష్ణ ఆమె పక్క నున్న మంచంమీద కూర్చున్నాడు.

"ఏరా మధ్యాహ్నం ఎందుకలా పారిపోయావు ? ఇలా రా" అని పిలిచింది ఛాయ.

కృష్ణ నెమ్మదిగా మంచందిగి చాపమీద కొచ్చాడు.

"పిలుస్తున్నా పలకకుండా పారిపోయావు ఎందుకు ?" మళ్లీ అడిగింది ఛాయ.

"నేను నీ దగ్గర కూర్చోవాలని వస్తే నువ్వెందుకని అంతసేపు మాట్లాడ లేదు ?"

"నేను చూడలేదు బాబూ . అందుకని అలా నిలబడతారా ? దగ్గర కొచ్చి మాట్లాడితే సరిపోయేదిగా.

"నువ్వు నాతో ఎందుకు మాట్లాడుతావు ? అందరికి మల్లేనే నీకూ నేనంటే కోపం అనుకుంటా."

"లేదురా నువ్వంటే నాకు చాలా ఇష్టం. పనులవల్ల మాట్లాడలేకపోయాను .. అంతే."

"అక్కా! ఈ ఊళ్ళో అంతా నన్ను అనవసరంగా తిడుతుంటారే. వాళ్ళ మాటలకు నాకు కోపం వచ్చి ఏదైనా అంటే మళ్ళీ నాదే తప్పు అంటారు. ఆ మాటే నీకు చెబుదామని వచ్చాను. నువ్వు మాట్లాడకపోయేసరికి ఏడుపొచ్చింది. అందుకే పారిపోయాను . అక్కా నిజంగా నీకు నేనంటే కోపం లేదా. ?" కృష్ణ గొంతు గద్గదమైంది.

ఛాయకు అతని ముఖం చూస్తే బాధేసింది. దగ్గరకు తీసుకుని అన్నది.

"నిజంగా లేదు బాబూ."

"అక్కా నువ్వు ఇంకెప్పుడూ ఇక్కడే ఉండిపోగూడదూ ?"

"అందరం ఇక్కడే ఉంటాం గదరా . నీకు సందేహం ఎందుకొచ్చిందీ ?"

"నేను అన్నది ఈ ఊళ్ళో ఉండటం సంగతి కాదక్కా నువ్వు ఈ ఇంట్లోనే ఉండిపోవాలని."

ఛాయ గలగల నవ్వింది.

"నేనంటే నీకు అంత ఇష్టమా బాబూ ?" మునివేళ్లతో అతనిగడ్డం పైకెత్తి అన్నది

"అవునక్కా .నాకు ఎప్పుడూ నీ దగ్గరే ఉండాలనిపిస్తుంది. నువ్వు ఈ ఊరు వచ్చినప్పటినుంచి నిన్ను వదిలి ఉండబుద్ధి కావడంలేదు. నువ్వు నన్ను గురించి పట్టించుకోకపోయేసరికి నీకు కూడా నేనంటే కోపం అనుకున్నాను. అది తల్చుకుంటే ఏడుపొచ్చింది" కృష్ణకు నిజంగానే కన్నీళ్లొచ్చాయి. ఆమె ఒడిలో వాలిపోయాడు.

ఛాయ ముఖంలో సంతోషరేఖ వెలిసింది.

"అంతా నిన్ను అల్లరివాడని తిడుతుంటే ఏమో అనుకునేదాన్ని. నువ్వింత పిచ్చివాడివని నాకు తెలియదు బాబూ!....మరి రేపటినుంచి అల్లరి మానేసి బాగా చదవాలి. క్లాసులో ఫస్టు రావాలి ... మంచి పిల్లవాడు అనిపించుకోవాలి." ప్రేమగా అతని తల నిమురుతూ అంది.

కృష్ణ ఒక్కుదుటున లేచి,

"మరి నువ్వు ఇక్కడే ఉంటావా?" అన్నాడు ఛాయ మృదువుగా నవ్వింది.

ఆ మర్నాడు కృష్ణ పెదతండ్రి ఛాయను, మధును ఆ వూరి హైస్కూలులో చేర్పించడానికి తీసుకెళ్లాడు. ఛాయవెంట సమయానికి స్కూలుకి బయలుదేరిన కృష్ణనుచూసి అంతా అటు సూర్యుడు ఇటు పొడిచాడనుకున్నారు. అప్పటికి ఛాయ ఫోర్తుఫారం, మధు స్కూల్ ఫైనల్ చదువుతున్నారు.

ఛాయ రాకతో కృష్ణ జీవితం మారిపోయింది. ఆమెనుంచి నిండైన మమత లభించిందతనికి. ఆ ప్రేమ అతనికి ఆలంబన అయింది. తిండి బట్టలనుంచీ అన్నీ ఆమెనే అడిగేవాడు. అతను ఏది కావాలన్నా ఆమె నిముషాలమీద అమర్చిపెట్టేది.

అప్పటికి ఫస్టుఫారం చదువుతున్నాడన్న మాటేగానీ కృష్ణకు 'తు' అంటే 'త' రాదు. బడికి వెళ్లడమే తక్కువ. పుస్తకం పట్టుకోవడం అరుదు. ఛాయ అతనికోసం పడ్డ పాట్లు ఇన్నిన్ని గాదు. దగ్గర పెట్టుకుని చదివించేది. అన్నీ వివరంగా విడమర్చి చెప్పేది. తన సమయం ఎక్కువ అతనికోసమే వినియోగించేది.

పరీక్షలు దగ్గర కొచ్చాయి. కృష్ణ మొత్తానికి కష్టపడుతున్నాడు. ఒకరోజు ఛాయ భోజనం వడ్డించి పిలిచింది.

"చదువుకుంటున్నానక్కా. ఇక్కడికి తీసుకురా" గదిలో నుంచి జవాబు ఇచ్చాడు కృష్ణ.

ఛాయ తన పళ్లెంమీద వేరే పళ్లెం బోర్లించి తమ్ముడికోసం అన్నం తీసుకెళ్లింది. తీరా చూస్తే అతను భాగవతం కథల పుస్తకం చదువుతున్నాడు.

"ఇదా నువ్వు చేస్తున్న నిర్వాకం? చక్కగా చదువుకుంటున్నావనుకున్నాను. ఇందుకా భోజనం తెమ్మన్నది?"

"ఇప్పటిదాకా క్లాసుపుస్తకాలే చదివానక్కా ఇప్పుడే ఈ పుస్తకం తీసుకున్నాను. ఈ బొమ్మ చూడు ఎంత బాగుందో ." కృష్ణ పుస్తకం తెరచి చూపించాడు.

అందులో యశోద కృష్ణుడికి గుజ్జనగూళ్లు తినిపిస్తోంది.

"అక్కా.... ఆ బొమ్మ చూసేసరికి...."

ఛాయ మహదానంద పడింది.

"నీకు గారాబం ఎక్కువై పోతోంది బాబూ! అంతా నన్ను తిడుతున్నారు... నిన్ను నెత్తికెక్కించు కుంటున్నానని" కోపం నటిస్తూ అంది.

"తిడతారు.... తిడతారు.,.. వాళ్లెవరో చెప్పు .... ఒక్కొక్కళ్లకి రుచి చూపించానంటే మళ్లీ నీ జోలికి రారు." కళ్లు ఎగరేస్తూ అన్నాడు.

"చాలు.... చాలు.... బండిని అంకటితో కట్టెయ్యి. నిన్ను కదలించడం నాదే తప్పు. నన్నెవరూ తిట్టరుగానీ నువ్వుమాత్రం బుద్ధిగా చదువు." అన్నం తినిపిస్తూ అంది ఛాయ.

ఆమె అన్నం తినిపిస్తోంటే వాత్సల్యం నిండిన ఆమె వదనాన్ని కృష్ణ రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు. ఆమె ముద్ద అందిస్తోంటే అతనో విశ్వవిజేతలా మురిసిపోయాడు.

ఆ ఊరొచ్చిన రెండు నెలలకు కృష్ణ పెద్దమ్మవాళ్లు ఇల్లు పూర్తిచేసుకుని గృహప్రవేశానికి ముహూర్తం పెట్టుకున్నారు. గృహప్రవేశానికి రెండు రోజులు ముందు గోవర్ధనరావు ఛాయ గురించి తోడల్లుడితో మాట్లాడాడు.

"అమ్మాయి ఇక్కడే ఉంటుందిలెం డన్నయ్యా."

అయన కాసేపు మౌనంవహించి అన్నాడు.

"ఎక్కడో దూరంగా లేముగదా .... ఆ ఇంటికీ ఈ ఇంటికీ మధ్య నాలుగు అడుగుల దూరం లేదు."

గోవర్ధనరావు గట్టిగా నిర్ణయించుకునే ఉన్నాడు.

"దాని రాకతో ఇంటికి కళ వచ్చింది. అది ఇల్లంతా కలియదిరుగుతోంటే పండగగా ఉంది. అన్నింటినీ మించి రౌడిలా తిరుగుతున్న వాడు దాని చేతిలో పడ్డాక కుదురుగా ఉంటున్నాడు. దారిన పడుతున్నాడు. ఆడపిల్లలు లేనిలోటు నాకు ఇప్పుడు అర్థమవుతోంది. వాళ్ల పిన్నమ్మకు కూడా దానిమీద చాలా అపేక్ష. మీరు నా మాట కాదనకండి" అన్నాడు.

గోవర్ధనరావు తత్వం అయనకు తెలుసు. తన మనసుకు బలంగా కలిగితేనే తప్ప అతను అలాటి విషయాలలో అంత లోతుగా ఆలోచించడు. తను కాదన్నా ఊరుకోడు. అందుకనే....

"మీరు అంతగా కావాలనుకున్నప్పుడు దాన్ని గురించి ఇంకా ఆలోచించే దేముందిలే...." అన్నాడు.

ఛాయ పినతండ్రి ఇంట్లోనే ఉండిపోయింది. అల్లరిపనులతో విచ్చలవిడిగా తిరిగే కృష్ణ ఆమె చెప్పుచేతల్లో ఊహించని విధంగా మారిపోవడం అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది.

ఒకరోజు హెడ్మాష్టరు అన్నాడు.

"మీ తమ్ముణ్ణి చాలా గమ్మత్తుగా మార్చేశావమ్మా.. వాణ్ణి మార్చాలని మేమంతా ఎన్నోసార్లు ప్రయత్నించాం .. నయాన భయాన ఎందరమో చెప్పి చూసాం. మేం చెప్పినకొద్దీ వాడి మొండితనం పెరిగిందేగాని... తరగలా...

"చిన్నదానివైనా నువ్వు ఆ పొగరబోతును చిటకలో మార్చేశావు. నాకు చాలా సంతోషంగా ఉన్నది. నిన్ను మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.... ఇంతకూ వాడికి ఏం మంత్రంవేసావమ్మా ?"

"ప్రేమ మంత్రం మాస్టారూ" ఛాయ చిరునవ్వుతో అన్నది.

కొన్నాళ్లపాటు ఊళ్లో అదే చర్చనీయాంశం ...

"వేలెడు లేదు దీని కడుపుడక ఆ అల్లరిమోడుని ఎంత మార్చేసింది?"

"ఎంత శివమెక్కి ఉండేవాడు? మాయదారి గున్నకి హద్దుపద్దు ఉండేదా?"

"రోడ్డుమీద అడుగుపెట్టాడంటే వాడి చేష్టలకు అంతుపంతు ఉండేదా? అలాటి వాడిలో ఎంత మార్పు ?"

"దాని ముందు పిల్లిలాగ అయిపోయాడు. గీటు దాటడంట."

"బంగారం వంటి బిడ్డ పద్మావతి అదృష్టవంతురాలు."

నలుగురూ చెప్పుకుంటుండేవాళ్లు.

పరీక్ష లొచ్చాయి. ఛాయకు తన పరీక్ష పెద్ద సమస్యే కాదు. కృష్ణదే ఆమెకు అసలు సమస్య. రెండు నెలలకు పైగా సానపట్టడంతో అతను కూడా బాగానే రాసాడు.

పరీక్ష ఫలితాలొచ్చాయి. కృష్ణ ఫస్ట్ఫారం ప్యాసయ్యాడు. ఆ రోజు ఛాయ ఆనందం చెప్పలేనిది.

మధు ఇంటర్మీడియట్‌లో చేరాడు. ఛాయ ఫిఫ్త్ఫారంలోకి కృష్ణ సెకండ్ ఫారంలోకి వచ్చారు. ఆ ఏడాది ఛాయ కృష్ణను మొదటినుంచి జాగ్రత్తగ చదివించింది. కృష్ణ ఫస్టొచ్చాడు.

నైటింగేల్‌ను గురించి చదివిన ఛాయకు సేవాభావం బలంగా కలిగింది. తాను వైద్యశాస్త్రం చదవాలని తమ్ముడిని చదివించాలని ఆమె ఆశయం. మానవతా దృక్పథాన్ని అతనికి నూరిపోస్తుండేది.

మరో ఏడాది గడిచిపోయింది. ఛాయ స్కూల్ ఫైనల్ పరీక్షలు రాసింది. హెడ్మాస్టరు, మిగతా మాస్టర్లు ఆమెను పైకి చదివించమని సలహా ఇచ్చారు పెద్దవాళ్లకు. ఆమె ఉన్నత స్థితికి వెళుతుందని, ఆమె తెలివితేటలు, క్రమ శిక్షణ, మానసిక స్థాయి అలాటివని అన్నారు.

గోవర్ధనరావుకు ఛాయ అంటే ఎంతో ఆప్యాయత ఉండేది. ఛాయ గురించి ఎప్పుడు ప్రస్తావన వచ్చినా "నా కూతురు" అని చెప్పుకునేవాడు. ఆమె రాకతో తన ఇంటికి కళాకాంతి వచ్చాయని, అలాంటి కూతురు దొరకటం అదృష్టం అనీ చెప్పేవాడు. "నా కూతురు డాక్టరు కావాలి" అనేవాడు.

ఏప్రిల్‌లో పరీక్షలు పూర్తయ్యాయి. పరీక్షలయ్యాక నాలుగు రోజులకు ఛాయకు జ్వరంవచ్చింది. మామూలుగా ఆమె చాలా ఆరోగ్యంగా ఉండేది. పరీక్షల సమయంలో బడలికతో వచ్చి ఉంటుందని అశ్రద్ధ చేసింది. అది టైఫాయిడ్‌లోకి దిగింది.

పరిస్థితి విషమించడంతో ఆమెను తెనాలి తీసుకెళ్లాడు. పదిరోజుల అపస్మారకం తరవాత ఆమెకు స్పృహ వచ్చింది. ఆ రోజుల్లో కృష్ణ అక్కకు ఎప్పుడు నయమవుతుందా అని ఎదురుచూస్తూ ఆమె మంచంచెంతనే ఉండేవాడు. ఆమెకు ఏమవుతుందోనని భయంతో కంపించిపోతుండేవాడు.

ఛాయను ఇంటికి తీసుకురావడానికి దాదాపు నెల్లాళ్లు పట్టింది. ఆ జబ్బు ఆమె శక్తిని తినేసింది. మనిషి పూర్తిగా పాలిపోయింది. కాళ్లు చేతులు చచ్చుబడి పోయాయి. చాలా రోజులవరకు ఆసరాలేకుండా అడుగెయ్యగలిగేది కాదు ..., ఆ పరిస్థితిలో ఆమె చదువు వాయిదాపడింది.

ఆ మరుసటి సంవత్సరం కాలేజీలు తెరచినప్పుడు ఛాయ మౌనంగా ఊరుకున్నది. ఆమె మౌనం పినతల్లికి, పినతండ్రికి అర్థంకాలేదు.

"ఏమ్మా... ! చదువు మానేంజేసావు ?" అన్నది పద్మావతి.

"నాకు చదవాలనిపించడం లేదమ్మా.. "

"అదేమిటమ్మా ! డాక్టరవ్వాలనుకున్నావుగా !"

"అప్పుడు గట్టిగానే అనుకున్నానమ్మా.... కానీ ఇప్పుడు ఆసక్తి పోయింది."

"అంత బలమైన మార్పుకు కారణం ?" పద్మావతి కనుబొమ్మలు ముడిపడ్డాయి.

"ఏమిటమ్మా.... ? అంత చిరాకు పడుతున్నావు నువ్వు ?" ఛాయ ప్రశ్నార్థకంగా అడిగింది.

"కాకుంటే ఏమిటి ఛాయా . పెద్దబిడ్డ వనుకున్నాను గానీ ఇలా వేరుగా చూస్తావనుకోలేదు నాదేముందిలే....నన్నలా ఉంచు. నా కూతురు .... నా కూతురు .అని మురిసిపోతుంటారే ఆయన్ని గురించైనా ఆలోచించొద్దూ ?.... నీ నిర్ణయం వింటే ఎంత బాధపడతారు ?"

"అమ్మా కన్నబిడ్డకన్నా మిన్నగా చూసుకుంటున్న మీ దగ్గర నేను వేరుగా భావిస్తానా ? పొరపాటు పడ్డావమ్మా . . "

"మరి నీ నిర్ణయానికి కారణం ?"

"నువ్వు అనుకున్నది కాదమ్మా . బాబు నన్ను పూర్తిగా కట్టేశాడు.... వాడిని పెంచడం మినహా ఇంకేం చెయ్యలేనమ్మా.. "

"ఛాయా . !" పద్మావతి నిర్ఘాంతపోయింది.

"అవునమ్మా నా స్ఫూర్తి, నా చైతన్యం అన్నీ వాడు తీసేసుకున్నాడు. వాడు మినహా మరో ఆలోచన లేకుండా చేసాడు.. నేను చదవలేను."

పద్మావతి కళ్లు సజలమయ్యాయి.

"అర్థం చేసుకోలేకపోయానమ్మా... నే అనగూడదుగానీ చాలా పెరిగిపోయావు తల్లీ . నీ ఋణం ఎలా తీర్చుకుంటాడో... " అని కళ్లు తుడుచుకుంటూ అక్కడి నుంచి వెళ్లిపోయింది.

"వాడు నాకు ఋణపడటమేమిటమ్మా....నీ పిచ్చిగానీ" అన్నది ఛాయ.

ఛాయ నిర్ణయానికి గోవర్ధనరావు కూడా విస్మితుడయ్యాడు. ఆమెకు నచ్చ జెప్పాలని ప్రయత్నించాడు.

"వద్దు చిన్నాన్నా నన్ను వివశురాలిని చెయ్యకండి" అన్నది ఛాయ.

కాలం గడిచిపోతోంది. కృష్ణకు స్కూల్ ఫైనల్ పరీక్షలు దగ్గరకొచ్చాయి. ఆ ఏడాది ఛాయకు పెళ్లిచేయాలని సంబంధాలకోసం వెతుకుతున్నారు. అక్క పెళ్లి అనగానే కృష్ణ సంబరపడ్డాడు.

ఛాయ రోజూ తమ్ముడిని నిద్రపుచ్చి, పద్మావతికి మందిచ్చి పడుకునేది. ఒకరోజు అతన్ని నిద్రపుచ్చి అలాగే కూర్చుండిపోయింది.

ఛాయ ఇస్తేనేగానీ మందు తీసుకునేదికాదు పద్మావతి. ఎంతసేపటికీ ఛాయ వెళ్లకపోయేసరికి ఆమే కూతురు దగ్గరకు వచ్చింది. ఛాయ కన్నీళ్లతో గోడకు చేరగిలబడి ఉన్నది.

పినతల్లి రావడం చూసి హడావుడిగా కన్నీళ్లు తుడుచుకుని లేవబోయింది. కానీ పద్మావతి ఆమె కన్నీళ్లు గమనించింది.

మా ఆఫీసులో తెలుగుభాష అమలు పర్చమని ఆర్డర్లు
వస్తున్నాయ్... నువ్వేమో నాకొచ్చిన తెలుగులో తిట్లు నేర్పావు
మరి అలవాటుగా ఆఫీసుకొచ్చే వాళ్ళని బాయాల్సొచ్చేలాగా!





రాగతి పండరి

"ఛాయా ? ఏమిటి తల్లీ ఇది ?" అన్నది ఆమెను దగ్గరకు తీసుకుని.

ఛాయ మాట్లాడలేదు.

"చెప్పమ్మా.. ఎన్నడూ లేనిది కంట తడిపెడుతున్నా వెందుకు ?"

"ఏమీ లేదమ్మా ఏవో ఆలోచనల్లో నాకు తెలియకుండానే కన్నీళ్లొచ్చాయి."

"అర్థమైందమ్మా నీ బాధ .. కంట్లో నలుసుగా ఈ సమస్య ఎప్పటినుంచో నన్ను కలత పెడుతూనే ఉన్నది."

కొంతసేపు మౌనంగా గడిచింది.

"మీరు పెళ్లి పెళ్లి అంటోంటే నాకేమీ పాలుపోవడంలేదమ్మా... పిచ్చి తండ్రి... తల్చుకుంటే హృదయం తరుక్కుపోతోంది. ఎట్లా బ్రతుకుతాడో ఏమో అక్కను విడిచి ఉండాలంటె గిలగిలలాడిపోతాడు."

"అనుబంధాలు చాలా విచిత్రంగా ఉంటాయి తల్లీ ..ఏ జన్మ సంబంధమో మరి ఎవరినీ లక్ష్యపెట్టనివాడు నీ దగ్గర అంతగా మాలిమైపోయాడు. అక్క తప్ప వాడికేమీ తెలియదు. వాడు నీకిచ్చే విలువ చూస్తే ఒకోసారి నాకే అసూయ కలుగుతుందా అనిపిస్తుంది."

"ఇది వాడిలో ఎటువంటి మార్పుకు దారితీస్తుందోనని భయంగా ఉందమ్మా."

"దానికి పరిష్కారం ఎక్కడ తల్లీ .. ఈ రోజుకు కాకుంటే రేపైనా తప్పదుగా."

"ఇప్పుడిప్పుడే వికసిస్తున్న మనసు. మరో రెండేళ్లు గడిస్తే పరిస్థితుల్ని వాడు అర్థంచేసుకోగలుగుతాడు. ఎలాగో కాలేజీలో చేరతాడు గాబట్టి హాస్టల్లో చేర్పిస్తే ఒంటరి జీవితం నుంచీ పాఠాలు నేర్చుకుంటాడు. మనమూ సముదాయించి చెప్పొచ్చు కానీ ఇప్పుడే "

"అంతగా ఆవేదన పడకమ్మా . " పద్మావతి ఆమె మాట పూర్తికాకుండానే అన్నది.

"ఆవేదన కాదమ్మా .నన్ను వేధిస్తున్న అశాంతి. ఐదేళ్లనాడు నా దగ్గరకు వచ్చి అంతా తనను తిడతారని, ద్వేషిస్తారని చెపుతూ వాడు చూసిన జాలి చూపులు నా కళ్లముందు కదులుతుంటాయి. నా గుండెల్ని పిండేస్తుంటాయి....

"కాకుల్లా నలుగురూ అన్న మాటలకు ఆ పసిమనసు ఎంత గాయపడిందో తల్చుకుంటే గుండె నీరైపోతుంది. ప్రేమ కోసం పరితపించే ఆ అబోధ హృదయం నన్ను వివశురాలిని చేస్తుంది.

"కాని ఆ ఆత్మ ధైర్యాన్ని గమనిస్తే వాడిలో ఏదో మహత్తరమైన శక్తి నిగూఢంగా ఉన్నదని నా మనసు పదేపదే చెపుతుంటుంది. చిన్న వయసునుంచీ దీటుగా నిలబడి దేనినైనా, ఎవరినైనా ఎదిరించగల శక్తి అందరికీ ఉండదమ్మా.

"వాడి నిర్భీకతను నిర్మోహమాటాన్ని సహించలేని సమాజం పనికిమాలిన వాడని నిరసించింది. తృణీకరించింది. కాని వాడి శక్తిసామర్థ్యాలను వెలికితీసి వాడొక మణిపూస అని అదే సమాజానికి రుజువుచేయాలని నా లక్ష్యం.

"వాడు కన్పించక ముందు నాకు జీవితం గురించి పెద్దగా తెలియదు. కనిపించాక నేను నా జీవితాన్ని గురించి ఆలోచించలేదు. నాకు ఉన్న ఒకే ఒక ఆశయం వాడినో గొప్ప డాక్టరును చెయ్యాలని."

"పోనీ తమ్ముడితోపాటు నువ్వూ చదవరాదమ్మా.. "

"ఆ ఆలోచన నాకూ వచ్చిందమ్మా . వాడితో కలిసి చదవడం చాలా ఉత్సాహంగా కూడా ఉంటుంది. ఏం లాభం ... ? ఎంత ప్రయత్నించినా మనసు చదువుమీదకు మళ్లడం లేదమ్మా. చెప్పానుగా.. వాడిని పెంచడం మినహా మరేం చెయ్యలేను. అసలు అంతకు మించి నా జీవితానికి మరో సార్థకతలేదని పిస్తుంది.

"వాడు గొప్ప డాక్టరై ప్రజాసేవలో తనను తను మరచిపోయి మానవత్వానికి మారుపేరుగా కీర్తి సంపాదిస్తోంటే ఆనందించడంకన్నా జీవితంలో ఇంకేం కావాలమ్మా ?"

"మమతకు మారుపేరైన నీ ఒకోమాటతో మనసు నిండిపోతోంది తల్లీ. నువ్విలా బాధపడితే నేను భరించలేను. పరిస్థితులకి తట్టుకోవాలి. లేకుంటే అది నాకు భయంకరమైన 'సమస్య' అవుతుంది. నిన్ను ఓదార్చగల స్థితిలో నన్నుంచు "

"ఎలా తట్టుకోను...? ఎలా భరించను? ఈ సమస్య నన్ను నలిబిలి చేస్తోంది. మనసు నిరాశ నిర్లిప్తతలతో మూగపోతోంది."

"ఛాయా. వాడు మగబిడ్డ .. ఎలాగైనా బ్రతుకగలడు. నా బాధంతా నిన్ను గురించేనమ్మా.... నీ మానసికస్థాయికి తగిన వ్యక్తి దొరకాలని తపస్సు చేస్తున్నాను."

"మానవ ప్రకృతిలో అనేక భిన్నత్వాలు ఉంటాయి. భవిష్యత్తు ఎలా ఉంటుందో . వాటిని వీడెలా తట్టుకుంటాడో.... సర్దుబాటు అవుతాడో.... దెబ్బతింటాడో ... వాడికి కావలసిన ప్రేమ అందించలేనినాడు నేను బ్రతికి ప్రయోజనమేమిటి? ఆనాడు నాకు మిగిలేదేమిటి?"

"రెండు సంసారాలకు వెలుగువమ్మా నువ్వు. అలాటి మాటలు నీ నోట రానివ్వకు తల్లీ... "

"అమ్మా.... జీవితంలో ఏలోటూ రాకుండా పెంచారు. సంతోషం తప్ప హె కెన్నడూ ఏ కష్టంలేకుండా చూసారు. ఇటువంటి జీవితం ఏ కొద్దిమందికో తప్ప దొరకదు.

"మీరు చెప్పినదాన్ని కాదనవలసిన సందర్భమే రాలేదు. కాని ఈ రోజు... ఇది నా జీవిత సమస్య కాదు. నా ఆశలకు ఆశయాలకు అనుగుణంగా ఐదేళ్ల నుంచీ సర్వశక్తుల్ని కూడగట్టి రూపొందించుకున్న జీవితఫలం వాడు....

"ఈ విషయంలో మీకు ఎదురుచెప్పక తప్పడంలేదు. నన్ను మన్నించండి. ఇపుడు నా పెళ్లి ప్రయత్నాలు చెయ్యొద్దు. నేను మరో రెండేళ్లదాకా పెళ్లి చేసుకోను."

"చదువు మానేసావుగదా తోటివాళ్లందరి పెళ్లిళ్లూ అవుతున్నాయి. వాడూ ఎలాగో కాలేజీలో చేరతాడు గదా....అని ఆలోచించామేగానీ నీకు ఇష్టంలేనపుడు పెళ్లి ఎందుకు తలపెడతామమ్మా? బాధపడకు తల్లీ. . భవిష్యత్తు బాగుంటుందని ఆశించుదాం" అని పద్మావతి వెళ్లిపోయింది.

ఛాయ తమ్ముడి తల నిమురుతూ కూర్చుంది. అతను అప్పటివరకు వాళ్ల సంభాషణ వింటూనే ఉన్నాడు. తల్లి వెళ్లిన కొద్దిసేపటికి లేచి కూర్చున్నాడు. ఛాయ కలవరపడింది.

"అక్కా.... నీ పెళ్లంటే నాకెంతో సంతోషం వేసిందే. బావ ఎక్కడో ఉద్యోగం చేస్తుంటాడని, నేనూ నీతోవచ్చి అక్కడే చదువుకోవచ్చునని ఎన్నో ఊహించుకుంటున్నాను... అయితే నీ పెళ్లయ్యాక నేను నీ దగ్గర ఉండటానికి వీల్లేదా? నన్ను వదిలి వెళ్లిపోతావా....?

"నువ్వు తప్ప నా కేముందక్కా...?.... నాకు ఎవరన్నా భయం లేదు. కాని నువ్వు లేవిది బ్రతలేనక్కా. "

"నువ్వు నిద్రపోలేదా బాబూ ?"

"లేదక్కా... నిద్రపడుతుండగానే అమ్మమాటలు విన్పించాయి."

"ఇలారా!" అని ఛాయ అతన్ని ఒడిలోకి తీసుకుంది.... "నువ్వు ఇవన్నీ ఆలోచించకు బాబూ... నిన్నొదిలి నేనెక్కడికీ పోను. నిశ్చింతగా ఉండి బాగా చదువు. నాకు కావలసింది నువ్వు డాక్టరవడం... అందుకోసం మంచి మార్కులతో పరీక్ష పాసవడం." అతని తల నిమురుతూ అంది.

కృష్ణ పరీక్షలు దగ్గరపడినకొద్దీ ఛాయ అతనికోసం ఎంతో శ్రమపడింది. అతన్ని తనకంటే ఎక్కువ మార్కులతో పాస్‌చేయించాలని ఆమె అభిలాష. అందుకోసం రాత్రింబగళ్లు కూర్చుని నోట్సులు తయారుచేసేది.

కృష్ణ పరీక్ష ఫలితాలొచ్చాయి. ఛాయ ఆశించినట్లు అతను ఆమెకన్న ఎక్కువ మార్కులతో ప్యాసయ్యాడు. ఇంటర్మీడియట్‌కు అతన్ని గుంటూరులో చేర్పించాలనుకున్నది ఛాయ. అప్లికేషన్ తెప్పించి పూర్తిచేయమన్నది.

"నే గుంటూరులో చేరనక్కా.. తెనాలిలో చదువుతాను." అన్నాడు కృష్ణ. తెనాలిలో అయితే రోజూ వెళ్లిరావచ్చునని అతని ఉద్దేశ్యం.

"మెడిసిన్ కూడా తెనాలిలోనే చదువుతావా?" ఛాయ తీవ్రంగా చూస్తూ అన్నది.

"అదికాదక్కా.... నిన్నొదిలి ఉండాలంటే... " కృష్ణ నసిగాడు.

"చూడు బాబూ.. నువ్వు పెద్దవాడి వవుతున్నావు. మనిషికి వయసుతోపాటు ఆలోచన పెరగాలి. జీవితమంతా అక్కచాటునే గడపాలనుకుంటే ప్రపంచాన్ని గురించి ఎప్పుడు తెలుసుకుంటావు?"

"నువ్వు ఎప్పుడూ నేర్పిస్తూనే ఉంటావుగా... "

"నేను నేర్పేది వేరు.... నువ్వు అనుభవాలనుంచి నేర్చుకున్నది వేరు. మనిషి స్వతంత్రంగా ఆలోచించాలి."

"మెడిసిన్‌లో చేరితే ఒంటరిగా ఉండటం తప్పనిసరి అవుతుంది. ఒకటి

రెండు సార్లు మినహా ఇంటికి రావడానికి వీలుండదు. ఈ రెండేళ్ల గుంటూరులో ఒంటరిగా ఉండటం అలవాటవుతుంది. ప్రతి ఆదివారం ఇంటికి వచ్చి వెళ్లొచ్చు."

"నెమ్మదిగా అలవాటు చేసుకుంటానక్కా ... ఈ ఒక్కసారికి " కృష్ణ ఆగిపోయాడు.

"చెపుతుంటే నీకాక్కాదూ ? మా బాబు మంచివాడు... నా మాటకు ఎదురు చెప్పడు..."

కృష్ణ మారుమాట్లాడకుండా అప్లికేషన్ పూర్తిచేసి పంపాడు. సీటు వచ్చింది. అతను గుంటూరులో కాలేజీలో చేరాడు.

కాలేజీలో చేరిన కొత్తలో ఆ జీవితానికి అలవాటుపడటం కష్టమైంది.

శనివారం సాయంత్రం ఎపుడు వస్తుందా అని ఎదురుచూస్తుండేవాడు. తరువాత సోమవారం ఉదయం రాకూడదనుకు నేవాడు.

ఆ రెండేళ్లలోనూ కృష్ణలో గణనీయమైన మార్పు వచ్చింది. సామాజిక పరిస్థితులను అర్థంచేసుకున్నాడు. లోకంపోకడ నుంచి అనుభవాలు నేర్చు కున్నాడు. ఛాయ ఆనందంతో గగనవీధుల్లో తేలిపోయింది.

కృష్ణ గుంటూరు మెడికల్ కాలేజీలో చేరతానన్నాడు. ఛాయ వద్దని విశాఖ పట్నంలో చేర్పించింది. మొదటి సంవత్సరం ఒకటి రెండుసార్లు మాత్రమే అక్కను చూడగలిగాడు కృష్ణ. ఆ రోజులు అతనికి బరువుగా గడుస్తుండేయి. అదే రోజుల్లో అతనికి రవి స్నేహం లభించింది.

రవిది ఏలూరు. అతను మూడవ సంవత్సరం విద్యార్థి. రవి కృష్ణ స్నేహం విచిత్రంగా జరిగింది. వాళ్ల స్కూటర్లు ఒకే రంగులో ఉండేయి. కాలేజీ ఆవరణలో పక్కపక్కనే పెట్టేవాళ్లు. సాధారణంగా అక్కడ కనబడినప్పుడల్లా చిరునవ్వుతో పలకరించుకు నేవాళ్లు.

ఒకరోజున కృష్ణ కాలేజీ నుంచి రూమ్‌కి వెళ్తున్నాడు. దారిలో మూడు ముక్కలాట ఆడేవాళ్లు కలిసి ఒక కుర్రాడిని కొడుతున్నారు. చుట్టూ నిర్మానుష్యంగా ఉన్నది.

ఆ కుర్రవాడి పరిస్థితి చూడగానే కృష్ణ మనసు ఉడికిపోయింది. స్కూటర్ స్టాండ్‌వేసి వెనకాముందు ఆలోచించకుండా అందులో ఒకణ్ని పట్టుకుని చాచి కొట్టాడు. వాడు తేరుకునేలోగా మిగతా యిద్దరూ అతనిమీద కలియబడ్డారు.

కృష్ణది దృఢమైన శరీరమే. అయినా ముగ్గురితో కొట్లాడటమంటే సామాన్యం కాదు. అంతలో పక్కన స్కూటర్ ఆపాడు రవి.

రవి సమయానికి రాకుంటే వాళ్ళ కృష్ణను ఒక దరువేసి ఉండేవాళ్ళే. రవి రాగానే పరిస్థితి గమనించి కాళ్ళకు బుద్ధిచెప్పారు.

"ఏం బ్రదర్....ఎంత ఆవేశం వస్తే అంతపనీ చేసెయ్యడమే? కంట్రోల్ చేసుకోవద్దూ....?" రవి మందలింపుగా అన్నాడు.

"ఏం చెయ్యమంటారు చెప్పండి? ఆ కుర్రవాడి ఏడుపు చూస్తే నాకు ఉద్రేకం ఆగలేదు. ఎదురుగా ఘాతుకం జరుగుతోంటే స్పెక్టేటర్స్‌లా చూస్తూ ఎలా ఉండగలం?"

"గుడ్....నీ స్పిరిట్‌ని అభినందిస్తున్నాను. చూడు....మనిషి ఆవేశానికి ఆలోచనను జతపర్చాలి. అలా కాకుంటే ఆవేశం ఒకోసారి హానికరం అవుతుంది."

"థాంక్యూ" అన్నాడు కృష్ణ. అలా ప్రారంభమైన వాళ్ల స్నేహం క్రమంగా అభివృద్ధి చెందింది. రోజురోజుకు సన్నిహితులయ్యారు. రవి గురించి ఛాయకు రాసాడు కృష్ణ. కృష్ణ గదిలో ఛాయఫొటో చూసిన రవి ఆమె ఎవరని అడిగాడు.

"అక్క రవీ.... మరో మాటలో చెప్పాలంటే ఆమె నా పెంపుడు తల్లి. ఈ రోజు నేనీ స్థితిలో ఉన్నానంటే అంతా ఆమెవల్లనే...." కృష్ణ చెప్పాడు.

కొన్నాళ్ళకు వాళ్ళిద్దరూ ఒకే రూమ్‌కి మారారు.

మొదటి సంవత్సరం సెలవులకు కృష్ణ ఇంటికి వచ్చేసరికి పెద్దవాళ్లు ఛాయకు పెళ్లి ప్రయత్నాలు చేస్తున్నారు. గోవర్ధనరావు ఛాయ తమకు చేసిన మహోపకారానికి బదులు అందుకు తగిన స్థాయిలోనే తీర్చుకోవాలనుకున్నాడు.

అతను ఒకరోజు కచేరీ సావడివద్ద కూర్చుని ఉన్నపుడు పెళ్లి ప్రస్తావన వచ్చింది.

"ఏరా గోవర్ధనం....ఈ ఏడు అమ్మాయి పెళ్లి చేయాలనుకుంటున్నారటగా?" అన్నాడు రామయ్య.

"అవును పెదనాన్నా....!"

"నువ్వు నిజంగా అదృష్టవంతుడివి. అది ఈ ఊరు రాబట్టి నీ కొడుకు ఇంత ప్రయోజకుడు అయ్యాడుగానీ లేకపోతే వాడెట్లా తయారయివుండేవాడో! దాని కడుపు బంగారం కాను. దాని గుణమెక్కడ! ఆ నడవడెక్కడ?...." గ్రామపెద్దల్లో మరో ఆయన అన్నాడు.

"దాని భవిష్యత్తు గురించే ఆందోళనగా ఉంది పెదనాన్నా....ఆ గుణానికి తగ్గవాడు దొరకాలంటే...."

"నువ్వేం ఆందోళన పడమాకురా....సిరిగల బిడ్డ. గొప్ప జాతకురా లవుతుంది," అన్నాడు రామయ్య.

"ఇంతకీ....అమ్మాయికి ఏ మివ్వాలనుకుంటున్నావురా....?" అన్నాడు మరో పెద్ద.

"వానికి వాడేం తక్కువ చెయ్యడులేరా. ఘనంగానే చేస్తాడు," రామయ్య జోక్యంచేసుకుని అన్నాడు.

"అంతివ్వాలి....ఇంతివ్వాలి అని నే నెప్పుడూ అనుకోలేదు పెదనాన్నా.... ఇంట్లో అడుగుపెట్టిననాడే పెద్దబిడ్డ అనుకున్నాను. ఇద్దర్లో ఒకళ్ళకి తక్కువ ఒకళ్ళకి ఎక్కువ లేదు. తమ్ముడి కెంతో....అక్కకూ అంతే" అన్నాడు గోవర్ధనరావు.

అతని నిర్ణయం అక్కడున్న గ్రామపెద్దల్నే కాదు ఊరందరినీ విస్మితుల్ని చేసింది.

విషయమంతా తెలుసుకున్న కృష్ణ వచ్చిన మర్నాడే ఏలూరు వెళ్ళాడు. ఛాయ గురించి విన్న రవికి ఆమెఎడ హృదయస్పందన కలిగింది. తన అభిప్రాయాన్ని కృష్ణకు చెప్పాడు.

సాయంత్రం కృష్ణ రవితో కలిసి వచ్చాడు. అప్పటికి ఛాయ తలిదండ్రుల దగ్గరకు వెళ్ళి ఇంకా తిరిగిరాలేదు.

"అమ్మా....అక్క లేదా ?" అంటూ వరండాలో అడుగెట్టిన కృష్ణతో,

"వచ్చావంటరా....మధ్యాహ్నం నుంచి ఎదురుచూస్తున్నాం.... అక్కకు గుడివాడ సంబంధం ఖాయంచేసుకొచ్చారు," అన్నది పద్మావతి.

కృష్ణకు తల దిమ్మెత్తిపోయింది. రవి స్థంభించిపోయాడు.

"సంబంధం ఖాయంచేసుకొచ్చారా ? ఎవరినడిగి ఖాయం చేసుకొచ్చారు ? నే నేం చచ్చాననుకున్నారా ?"

"అదేమిట్రా....శుభమా అంటుంటే పాడుకూతలు కూస్తావు ? మంచి సంబంధం .... కుర్రవాడు ఇంజనీరుగా పనిచేస్తున్నాడంట. గౌరవమున్న కుటుంబం. పిల్లవాడు నిదానస్తుడనీ, మంచివాడనీ చెప్పారు పెద్దవాళ్ళంతా."

"పెద్దవాళ్ళంట....ఎవరా పెద్దవాళ్ళు....అక్క పెళ్ళి నాకు తెలియకుండా నిర్ణయించే హక్కు ఎవడిచ్చాడు ?"

"అదేమిట్రా ఆ అరుపులు ? అర్థం లేకుండా....అంతా నీకు తెలిసినదేగా. ఇదేమైనా రహస్యంగా జరిగించా ? ఆ కేకలేమిటి ? ఆ రెచ్చిపోవడమేమిటి ?

"ఏమిటి తెలిసింది ? ఈ సంబంధం ఖాయంచేస్తున్నట్లు నాకు నామ మాత్రంగానైనా చెప్పారా ?"

"ఆ మాటకొస్తే నాకు మాత్రం తెలుసా ? పొద్దున్నే అనుకున్నారు. మీ నాన్న, పెదనాన్న నలుగురితో కారేసుకుని అప్పటికప్పుడు వెళ్లొచ్చారు. మంచి రోజని వాళ్లూ వెంటవచ్చి చూసి వెళ్ళారు. అన్నీ నచ్చాయి .. తాంబూలాలు యిచ్చి పుచ్చుకున్నారు. నువ్వు వస్తావేమోనని చాలాసేపు చూసారు. ఇంతకు ముందే వెళ్ళారు."

"నా యిష్టంలేకుండా అక్క పెళ్లి నిర్ణయించడానికి నాన్నెవడు ? పెదనాన్న ఎవడు ?"

"అలాగే అనుకుందాం. ఇంత జరుగుతుంటే నువ్వు మాతో ఒక మాటైనా చెప్పావా ? ఇప్పుడిట్లా గొంతు చించుకుంటావేమిటి? నలుగురూ ఏమనుకుంటారు? ఏం బాబు నువ్వు చెప్పు ...మేం చేసిన తప్పేమయినా ఉందా ఇందులో ?" అన్నది పద్మావతి.

— ఆ మాటలతో రవి ఆలోచనల నుంచి తేరుకున్నాడు.

"వాళ్ళ అక్క అంటే అతనికి పంచప్రాణాలు అని మీకు తెలుసుగదండీ... ప్రాణప్రదంగా చూసుకునే అక్కపెళ్లి తనకు తెలియకుండా నిర్ణయమైన దనేసరికి అతని మనసు గాయపడింది. కృష్ణ ఆవేశం మీకు తెలియనిది కాదుగా అతనే నెమ్మదిస్తాడు. మీరు బాధపడకండి," అన్నాడు తన కలవరపాటు కనబడ నీయకుండా.

కృష్ణకు తన తప్పు అపుడు అర్థమైంది. తను ఏలూరు వెళ్లేటపుడు రవి గురించి ఎవరితోను చెప్పలేదు. కనీసం చాయతో కూడా అనలేదు. హఠాత్తుగా అక్క పెళ్లి నిర్ణయం కావచ్చునన్న ఊహైనా అతనికి రాలేదు.

రవిని తీసుకొచ్చి అకస్మాత్తుగా ఆ విషయం చాయకు చెప్పి ఆమెను సంతోషంలో ముంచెత్తాలనుకున్నాడు. కానీ అదే అనుకోని పరిణామానికి దారి తీస్తుందని అతను కలలో కూడా ఊహించలా..

పద్మావతి లోపలి కెళ్లింది. మిత్రులిద్దరూ మిగిలారు అక్కడ. కృష్ణ మెదడులో ఆలోచనలు ప్రొపెల్లరులా తిరిగిపోతున్నాయి.

"రవీ.... నా తల తిరిగిపోతోంది .... ఇక్కడ కూర్చోలేను. గదిలోకి వెళ్దాం పద." అని గదిలోకి దారితీసాడు కృష్ణ. రవి అతన్ని అనుసరించాడు. గదిలోకెళ్లి కృష్ణ మంచంమీద అడ్డంగా పడ్డాడు. రవి అతని పక్కన కూర్చున్నాడు.



"ఎట్లా రవీ?.... ఇపుడు నేనేం చెయ్యను? నిన్ను తీసుకొచ్చి అక్కను అమితానందంలో ముంచెత్తాలనుకున్నాను గానీ అది ఎటువంటి పరిణామానికి దారితీస్తుందో నన్న ఊహే నాకు రాలేదు. చేతులారా తెచ్చిపెట్టుకున్నాను. దీనికి ఏ విధంగా తట్టుకోను....!"

రవి నిట్టూర్చాడు.... చెదరిన అతని కలలు ఆ బరువైన అతని నిట్టూర్పులో దాక్కున్నాయి.

"జీవితం చాలా విచిత్రంగా ఉంటుంది కృష్ణా. పరిస్థితులు ఒకోసారి గమ్మత్తుగా మారిపోతుంటాయి. సంతోషం కోసం నువ్వు ఒకటి చెయ్యాలనుకున్నావు. అది సరిగా అందుకు వ్యతిరేకానికి దారితీసింది. దీనినే పెద్దవాళ్ల విధి అంటారు. ఆ నమ్మకాలు లేని మనం యాక్సిడెంట్ అనుకుంటాం...."

"రవీ.... నా గుండె పిగిలిపోతోంది. పిగిలిపిగిలి పీలికలైపోతోంది. ఇంకెందుకు బ్రతకటం అక్కకు దూరంగా నేనెట్లా జీవించను! అయి

పోయింది నా జీవితం అయిపోయింది. ఎనిమిదేళ్ల తర్వాత మళ్లీ ఏకాకి నయ్యాను."

"అలా ఆలోచించకు కృష్ణా పరిస్థితులు అనుకూలించి మీ జీవితాలు సంతోషంగా సాగిపోతాయని ఆశిద్దాం "

"నా బ్రతుక్కి సంతోషమే ఉంటే నాకు ఇలాంటి బుద్ధి పుట్టేదికాదు. రవీ... అక్క ఒడి శాశ్వతంగా పొందే అదృష్టమే ఉంటే ఆమెకు నిర్మలమైన నీ సహచర్యమే లభించేది. రేపటి నుంచి ఆమె ఎవరో నేను ఎవరో మే మిద్దరం పిన్నమ్మ పెద్దమ్మ బిడ్డలం

"ఆమెకు నాకు మధ్య అడ్డుగోడలు లేస్తాయి. ఆమెను నేను చూడాలన్నా ఆమెతో మాట్లాడాలన్నా పది గజాల దూరంలో ఉండాలి నేను ఆమె ఇంటికి వెళితే నేను వరండాలోనో వాకిట్లోనో కూర్చోవాలి. ఆమె గుమ్మం వద్దకు వచ్చి మాట్లాడుతుంది "

"ఏమిటి కృష్ణా ఇది? ఎందుకు అలా అర్థంలేని ఊహలతో మనసు పాడు చేసుకుంటావు? ఎటువంటి పరిస్థితి వచ్చినా మనిషి అంత వివశుడు కాగూడదు. పరిస్థితుల్ని మనం జయించాలిగానీ, పరిస్థితులు మనల్ని లొంగతీసుకోనివ్వ గూడదు "

"అక్క నాకు దొరకకుండా ఉన్నా బాగుండేది రవీ అనాడు నా పరిస్థితి వేరుగా ఉండేది నన్ను ఇంతవరకు తెచ్చిన అక్క ఈనాడు దూరమవుతోందంటే శరీరం చల్లబడిపోతోంది. దీనికి పరిష్కార మార్గం లేదు."

"అనుకున్నది జరగనంత మాత్రాన మనిషి నైరాశ్యానికి తావివ్వగూడదు కృష్ణా. పరిష్కారం లేదనుకుంటూ మంచానికి అడ్డంగా పడి బాధపడితే వచ్చేదేమిటి? అక్క ఎందుకు దూరమవుతుంది? పరిస్థితుల్ని మనకు అనుకూలంగా మలచుకోడానికి ప్రయత్నించాలి గానీ నిరాశపడుతూ మనకు మనం తిట్టుకుంటూ కూర్చుంటే సమస్యలు పరిష్కార మవుతాయా?"

"అనుకూలం పరిష్కారం నా బ్రతుక్కి ఒకటే పరిష్కారం అక్క పెళ్లితో పాటు నాకు చావు వస్తే సరిపోతుంది."

రవి కృష్ణను గట్టిగా మందలించాడు.

"కృష్ణా ఏమిటిది? మూర్ఖులు ప్రవర్తించినట్లు? మరీ వివేకం లేకుండా నోటికి వచ్చినట్లు మాట్లాడితే ఎలా? చూడు మీ జీవితాలు ఏ సమస్యలు లేకుండా చక్కగా సాగిపోతాయని నా మనసు పదేపదే చెప్తోంది. అంత మాత్రాన ఇది చాలా తేలిక విషయం అంటున్నానని అనుకోకు."

"అక్క నాకు కేవలం సోదరి మాత్రమే అయితే పరిస్థితి ఇలా ఉండేదికాదు రవీ ఆమె నాకు తల్లి గురువు స్నేహితురాలు ఆమె రాకతో నా బ్రతుకే మారిపోయింది "

అక్క రూపం నన్ను అణువణువునా ఆవరించింది. నా గుండెల్లో ఆమె నిండు స్వరూపం నిలువెత్తున నాటుకుపోయింది. కాంతులు విరజిమ్మే దీపకళికలా ఆమె స్వరూపమే నా కళ్లలో కదులుతుంటుంది.

అన్నం తిన్నా.... ఆటలాడినా.... ఎక్కడున్నా.... ఏం చేసినా అంతా ఆమె ఆలంబనవల్లనే జరుగుతున్నదనిపిస్తుంది. ఆ ఆలంబన లేకుంటే జీవితంలో నేనేమీ చేయలేననిపిస్తుంది. అసలు నాలో చైతన్యమే లేదనిపిస్తుంది...

"నాలో జీవాన్ని నింపిన ఆ అక్క....నా అక్క....ఈనాడు నాకు దూరం అవుతుందంటే గుండెల్లో సమ్మెటలు మోగుతున్నాయి రవీ.... చెప్పు ఇప్పుడు చెప్పు....దీన్ని నేనెలా తట్టుకోను ?"

కృష్ణ ఆవేదనకు రవి హృదయం విచలితమైంది

"నీ ఆందోళనను నేను అర్థంచేసుకోగలను కృష్ణా .... దైవం మీద.... దేవతల మీద నాకు నమ్మకాలు లేవు.... కొందరి వ్యక్తిత్వాలను చూస్తూంటే కొన్ని విశ్వాసాలు కలుగుతుంటాయి ...

"ఆ విశ్వాసమే చెపుతోంది. అక్క నీకు దూరంకాదని.... మీ అనుబంధం అపూర్వమైనది.... అది చల్లగా సాగిపోతుందని నా నమ్మకం...."

"ప్చ.... ఎంత పొరపాటు చేసాను రవీ.... ఒక తప్పుతో మూడు బ్రతుకుల్ని మార్చేశాను ... నువ్వు నన్ను క్షమించలేవు."

"జీవితం ఒక గేమ్ కృష్ణా... ఒకోసారి గెలుస్తాం.... ఒకోసారి ఓడిపోతాం.... దాన్ని స్పోర్టివ్‌గా తీసుకోవాలి.... ఒకసారి ఓడిపోయాం గదా అని ఏడుస్తూ కూర్చుంటే భవిష్యత్తులో ఎందుకూ పనికిరాకుండా పోతాం...."

"నీకు తీరని అన్యాయం చేసాను.... నాకు నిష్కృతి లేదు."

"అలా ఆలోచించకు కృష్ణా.... బాధతో కూడిన ఆలోచన మనిషిని దిగజార్చుతుంది. మరో మాట.... ఈ విషయం మీ అక్కవరకూ వెళ్లగూడదు.... నిన్ను గురించి ఆమె ఇప్పటికే ఎంతో ఆవేదనకు గురిఅవుతూ ఉంటుంది. ఈ విషయం తెలిస్తే మరీ దెబ్బతింటుంది. ఆమె దగ్గర ఈ ప్రస్తావన తీసుకురాకు."

రవి చెపుతుండగా ఛాయ మాటలు వినిపించాయి.

"అక్క వస్తోంది రవీ... !" అన్నాడు కృష్ణ. వాళ్ల సంభాషణ ఆగి పోయింది.

ఛాయ లోపలికి రాగానే కృష్ణ ఒకరినొకరికి పరిచయం చేసాడు. వాడిపోయి ఉన్న కృష్ణ ముఖం గమనించింది ఛాయ.

"ఏం నాన్నా ఇలా ఉన్నావు ? చెపితే వినవు గదా ! ఎండలోపడి రాక పోతే చల్లబడ్డాక రాగూడదూ ..? చూడు ముఖం ఎలా వాడిపోయిందో....?" అతని నుదుటిమీద చెయివేసి అంది ఛాయ.

రవి ఆమె అనునయాన్ని పరిశీలిస్తున్నాడు.

"పోయి ముఖం కడుక్కొని ఆ ఇంటికి వెళ్లిరా .. అన్నయ్య వచ్చాడు. తనని కూడా తీసుకురా...." కృష్ణ తల నిమురుతూ అన్నది ఛాయ.

రవికి కృష్ణ ఆమె గురించి చెప్పింది కళ్లముందర కనిపిస్తోంది.

"నే నిపుడు పోను... తరువాత వెళ్తానులే...." కృష్ణ చికాకుగా అన్నాడు.

"తప్పు కదూ .. అన్నయ్య ఏమనుకుంటాడు ? నువ్వంటే ఎంత ప్రేమగా ఉంటాడు చెప్పు ? రాగానే నీ కోసం వచ్చాడు. నువ్వు లేకపోయేసరికి నిరుత్సాహ పడ్డాడు. ఇవన్నీ చిన్న విషయా లనుకుంటావు నువ్వు....మనసులో ఇలాంటి చోట్లే చివుక్కుమంటాయి .. ఇవండీ వరస .... ఎంతో ప్రేమగా ఉంటాడు.... ఎక్కడో ఒక చోట ఇలా నిర్లక్ష్యం చేస్తాడు...వెళ్లిరా నాన్నా .." అన్నది ఛాయ.

"వెళ్లిరా కృష్ణా... " రవి కూడా అన్నాడు.

కృష్ణ రవి వంక చూసాడు. ఛాయ దాన్ని గమనించింది.

"మీ స్నేహితుడికి మర్యాదలో ఏం లోపం జరగదులేరా .. వెళ్లిరా...." అన్నది.

కృష్ణ అయిష్టంగానే లేచి వెళ్లాడు.

"ఇప్పుడే వస్తాను" అని రవితో చెప్పి, ఛాయ లోపలకు వెళ్లి గ్లాసుతో నిమ్మరసం తీసుకొచ్చింది.

"కంగ్రాచ్యులేషన్స్.... మీ వివాహం నిర్ణయమైందని ఇంతకు ముందే చెప్పారు మీ పిన్ని" గ్లాసు అందుకుని అన్నాడు రవి.

"థాంక్స్ .." ఛాయ చిరునవ్వుతో తల దించుకున్నది. కొద్దిసేపు మౌనంగా గడిచాక,

"కృష్ణని కావాలని విశాఖపట్నం పంపానేగానీ పంపినప్పటినుంచి ఎంతో ఆందోళనపడుతూనే ఉన్నానండీ ఆవేశంలో ఎపుడు ఏం చేస్తాడోనని మనసు తల్లడిల్లుతుంటుంది.

"మిమ్మల్ని గురించి, మీ స్నేహం గురించి విన్నాక మాత్రం కొంత ఊపిరి పీల్చుకోగలిగాను. మీకు చాలా కృతజ్ఞురాలిని.... మీ స్నేహం తరగని వెలుగులా జీవితమంతా వాడిని వెన్నంటి ఉండాలని నా ఆకాంక్ష" అన్నది ఛాయ.

"నాదేముందండీ ? అతని కన్న కొద్దిగా పెద్దవాడిని గనుక నా అనుభవాలను బట్టి మంచి చెడు చెపుతుంటాను. దేనిని గురించైనా చెప్పినపుడు అర్థంచేసుకునే శక్తి, మిధ్యాభిమానానికి పోకుండా ఎదుటివాళ్లు చెప్పిన విజ్ఞాన్ని గ్రహించి తనను తను సరిదిద్దుకునే తత్వం అతనిలో ఉన్నాయి," అన్నాడు రవి.

"మీతో నాకు పరిచయం కొత్తే అయినా మీ ఇద్దరి మధ్య స్నేహానుబంధం గురించి విన్నప్పటినుంచి మీతో కొంత సాయం పొందాలనుకుంటున్నాను."

ఛాయ హావభావాలు, మాటతీరు, అణకువ, అన్నీ చూస్తుంటే రవికి తాను పోగొట్టుకొన్నది అర్థమవుతోంది. మనసులో రేగుతున్న తుఫానును కనబడ నీయకుండా....

"నా నుంచి మీకు ఏ సహాయం కావలసినా హృదయపూర్వకంగా చేస్తాను.... చెప్పండి...." అన్నాడు.

"కృష్ణ పెరుగుతున్నకొద్దీ వాడిలో మార్పు కన్పిస్తున్నా ఆవేశం, పసితనం పోవడం లేదు. వాడిలో ఏ లోపాన్నైనా నేను సరిదిద్దగలుగుతున్నాను గానీ ఈ విషయంలో ఏ మాత్రం కృతకృత్యురాలిని కాలేకపోతున్నాను.

"ఇక్కడ నా బలహీనత కూడా ఉంది. ఒక విధంగా స్వార్థం కూడా కావచ్చు. వాడి పసిహృదయంనుంచి నాకు లభించే అనుభూతి అనిర్వచనీయమైనది. దానిని కోల్పోవడమంటే భయంకరంగా కన్పించేది.

"కాని .. అది వాడి భవిష్యత్తుకి మంచిది కాదనిపించింది. కఠినంగా తయారయి... వాడిని మార్చాలని ప్రయత్నించాను ... నా ప్రయత్నం ఫలించ లేదు.... కొంచెం కఠినంగా మాట్లాడితే చాలు జాలిగా చూస్తాడు. ఆ చూపు కన్పిస్తే నా నరాలు తోడుకుపోతాయి....

"నా బలహీనత వాడికి తెలుసు....బహుశః అది కూడా ఒక కారణం కావచ్చు. ఆవేశం చిన్ననాటి నుంచి వాడి నరనరాన నాటుకుపోయి ఉన్నది. ఏ మాత్రం తగ్గడంలేదు. ఎన్నోసార్లు చెప్పిచూసాను... అయినా ఏమీ మార్పు లేదు...." అన్నది ఛాయ.

రవి కాసేపు మౌనంగా ఉండి అన్నాడు,

"కృష్ణలో చిన్ననాటినుంచీ అంతులేని మానసిక సంఘర్షణ ఉన్నదండీ ...

దాని ఫలితమే ఈ ఆవేశం.. అది విపరీత పరిస్థితులకు దారితీయకుండా అతను నిలబడగలిగాడంటే అందుకు మీరు, మీ మమతే కారణం...

"కృష్ణకు బాల్యంనుంచీ తల్లిదండ్రుల మమత తగినంతగా లభించలేదు. తల్లి జబ్బుమనిషి కావడంతో అతన్ని గురించి సరిగా పట్టించుకోలేకపోయారు. ఆ స్థానాన్ని పూడ్చగలవాళ్లు దొరకలేదు. తండ్రి కూడా ఆతన్ని గురించి ఏ మాత్రం శ్రద్ధ తీసుకోలేదు. కన్నవాళ్ల ప్రేమానురాగాలు కరువవడంతో అతనిలో అశాంతి బయలుదేరింది.

"మరో విషయం అతను ఒంటరివాడు కావడం. కొంత వయసు వచ్చే సరికి పిల్లలకు తల్లిదండ్రుల దగ్గర చనువు తగ్గుతుంది. తోడబుట్టినవాళ్లతో అనుబంధం పెరుగుతుంది. ఆ అనుబంధాల ప్రభావం వాళ్లమీద చాలా ఉంటుంది... కృష్ణకు ఆ అనుబంధమూ కరువే అయింది., అతని అశాంతి పెరిగింది.

"ఆ అశాంతి అల్లరకు దారితీసింది. ప్రేమ కోసం పరితపించే అతనిని ఎవరూ దగ్గరకు తీయలేదు. అతనిలోని మంచిని ఎవరూ చూడలేదు. అతనిలో ఏర్పడిన ఆగాధాన్ని ఎవరూ గమనించలేదు. అల్లరివల్ల, ఉన్నదున్నట్లు మొఖాన చెప్పే స్వభావంవల్ల అతన్ని ద్వేషించారు.

ఆ ద్వేషం అతనిలో ప్రతీకారవాంఛని రేకెత్తించింది. తనను ద్వేషించిన వారిమీద పగసాధించాలని అతను చెలరేగేవాడు. బూతులు తిట్టో, అల్లరిపనులు చేసో తన కక్ష తీర్చుకుని సంతృప్తిపడేవాడు. .."

"మీరు డాక్టరే కాకుండా సైకాలజిస్టుగా కూడా కన్పిస్తున్నారు."

"డాక్టర్ని కూడా కాదండీ... ఇంకా విద్యార్థిని మాత్రమే.

"అసలు విషయానికి వస్తాను... అలా అశాంతితో కాలం గడుపుతూ ఆలంబన కోసం వెదుకుతున్న రోజులలో కృష్ణకు మీరు ఎదురయ్యారు అంతకు ముందు జీవితంలో అనాదరణను మాత్రమే చూసిన అతనికి మీ మాటతీడ, ప్రేమాను రాగాలు ఆకర్షించాయి. మీ చెంత వాలిపోయాడు. అతనిని గమనించి మీరూ ప్రేమతో దగ్గరకు తీసారు. మీ ఒడిలో నిద్రపుచ్చారు.

....అనాడు కృష్ణ మీ నుంచి ఆశించినదీ అక్కునే.... మీరు అతనికి అందించినదీ అక్కునే.. కానీ కృష్ణ మీపట్ల పెంచుకున్న ఆరాధన చాలా అరుదైనది. అది మీకు అపూర్వమైన అనుభూతిని కల్గించింది.

ఆ అనుభూతీ, అతను మినహా మరో ఆలోచన లేనంతగా పెరిగింది.

డాక్టరు కావాలని కలలుకన్న మీరు ఆ తలంపే వదిలేసారంటే అతని ఆరాధన మిమ్మల్ని ఎంత మరపించిందో స్పష్టమవుతుంది.

"మీ వయసు పరిణితి చెందినకొద్దీ మీలోని స్త్రీ సహజమైన మాతృత్వపు అనుభూతులు మేల్కొన్నాయి. కృష్ణ హావభావాల్లో మీకు పసిబిడ్డ కన్పించాడు. తల్లికి బిడ్డే లోకం అయినట్లు, క్రమక్రమంగా మీకు అతనే లోకం అయ్యాడు. అందుకే మీ అనుబంధం అంత బలంగా పెనవేసుకున్నది.

"మీరు స్వార్థం అన్నారు చూసారూ? అది స్వార్థంకాదు. క్రమంగా పరిణితి చెందిన మాతృత్వపు అనుభూతి మాత్రమే అతనికి కరువైన తల్లి ప్రేమను మీరు భర్తీచేసారు. అదే అతన్ని మనిషిని చేసింది. మట్టిలో మరుగునపడి పోతున్న మాణిక్యాన్ని తీసి మెరుగుపెట్టారు. అతన్నో వ్యక్తిత్వంగల యువకుడిలా తీర్చిదిద్దారు "

రవి చెపుతుండగా ఛాయ విస్మయంతో చూస్తూ అన్నది.

"ఇంతటి నిశిత పరిశీలన మీకెలా సాధ్యమయిందా అని ఆశ్చర్యంగా ఉంది "

"ఏమీలేదండీ చిన్ననాటినుంచీ తన జీవితం ఎలా గడిచిందీ కృష్ణ చెప్పాడు. నేను సైకాలజీని అన్వయించి చూసాను.

"కృష్ణలోని ఆవేశాన్ని చంపడానికి మీరు ఎన్నడూ ప్రయత్నించవద్దు. మీ ఆశయాలకు అనుగుణంగా అతను జీవితంలో విజయం సాధించడానికి ఆ ఆవేశం పునాదిరాయి అవుతుంది. అది చచ్చిపోయిననాడు అతను అసమర్థుడు అకర్మణ్యుడు అవుతాడు.

అన్యాయాన్ని 'ఎదిరించే' టపుడు తాను ఏమవుతానోనన్న భావం కూడా గుర్తురాని అతని ఆవేశం చూసారూ హేట్సాఫ్ మనిషిలోని మానవత్వానికి, నిస్వార్థతకు గీటురాయి అదే నన్ను అతనికి అంత దగ్గరగా తీసుకెళ్లింది బహుశః అతని ఆవేశమేనేమో !

"మీరు దానిని గురించి వర్రీకావద్దు. ఆవేశాన్ని ఎలా అదుపులో పెట్టు కోవాలనే విషయంలో అతనిలో గణనీయమైన మార్పు ఉన్నది. అనుభవాలతో ఇంకా పెరుగుతాడు "

"నేను మీకు చెప్పాలనుకున్నది "

"వస్తున్నాను మీరు చెప్పాలనుకున్న విషయం నాకు తెలుసు. మీ వివాహం అయ్యాక అతను దెబ్బతింటాడని మీరు భయపడుతున్నారు. దొరకక, దొరకక

దొరికిన వస్తువును మనిషి ప్రాణాలకు మిన్నగా చూసుకోవడం సహజం. అలాగే కృష్ణలో మీపట్ల పొసెసివ్ నేచర్ పెరిగిపోయింది

"సమాజం తనని నిరసించడంతో అతనిలో ఇన్‌సెక్యూరిటీ ఫీలింగ్ ప్రవేశించింది. ఈ సమాజంలో తనకు భద్రత లేదనుకునేవాడు. మీరు వచ్చాక ఆ భావం పోయింది. మీరు లేకుంటే జీవితంలో మళ్లీ తనకు భద్రత ఉండదని అతని భయం. మీరుంటే తనకేమీ భయం ఉండదని అతని నమ్మకం.

"మీ ఆలంబన మినహా అతనికి మరేమీ అక్కర్లా పెళ్లయ్యాక అక్క తనకు ఉండదేమోనన్న భయం బయలుదేరింది అతనిలో. వివాహం అయ్యాక ఆడపిల్ల పుట్టింట్లో ఉండదు కదా అది తల్చుకుని భయభ్రాంతుడై పోతున్నాడు.

"అతని జీవితంలో మరో సమస్య కూడా తలెత్తుతుంది. రేపు కృష్ణ పెళ్లాడే యువతి మీలాటి మనస్తత్వం ఉన్నదైతేనే అతను ఆమెతో సర్దుబాటు కాగలుగుతాడు. అతనికి కావలసింది సాంప్రదాయబద్ధంగా బ్రతకడానికి వచ్చే భార్యకాదు. ప్రేమానురాగాలతో అతనిలో కలసిపోయి జీవితాన్ని పంచుకునే భాగస్వామిని.

"కృష్ణ కాలాతీత వ్యక్తి. దానికి తోడు అమాయకుడు, అర్భకుడు కావడంతో సమస్య ఇలా పరిణమించింది. అక్కా తమ్ముళ్ల మధ్యగానీ, అన్నచెల్లెళ్ల మధ్యగానీ ఉన్నత సంబంధాలను అర్థంచేసుకోగల శక్తి కరడుగట్టిన మన సమాజానికి లేదు. కృష్ణ మిమ్మల్ని వదిలి బ్రతకలేడు. అదొక బాధ. తనవల్ల మీ జీవితం సమస్యలకు గురవుతుందని మరో బాధ. ఈ రెండింటి మధ్య నలిబిలి అయిపోతున్నాడు.

"కానీ కృష్ణ ఆవేదనలో అసహజం ఏమీలేదు. సంకుచితమైన సామాజిక దృక్పథంతో ఆలోచించేవారికి, సనాతన సాంప్రదాయాలకు పరిమితమైన వారికి అది వింతగా కన్పిస్తుంది. ఆవేదన ఎరిగిన హృదయానికి . ఆలోచన తెలిసిన మనసుకు మాత్రమే అతని బాధ అర్థమవుతుంది

"కృష్ణ ఓవర్ సెన్సిటివ్. అందువల్లనే ఇలా తల్లడిల్లిపోతున్నాడు కాని కృష్ణ మీకోసం ఎంత త్యాగమైనా చేస్తాడు. పచ్చి గరళమైనా అతడు దిగమింగగలడు. ఈనాడు అతనింత వివశుడై పోతున్నా రేపు పరిస్థితి ఎదురైనపుడు దాని నెంతో నిబ్బరంగా ఎదుర్కోగలడు. అది అతని ప్రత్యేకత. మీరు విశ్చింతగా ఉండండి "

ఈ కాలనీలో వారు కొత్తగా కట్టించి ఇచ్చిన ఇల్లు ఇది!
నువ్వంత గట్టిగా మాట్లాడకే బాబూ కూలిపోతే చస్తాం!




రవి చెపుతుండగానే కృష్ణ మధుతో కలసివచ్చాడు. మధుని – రవిని పరస్పరం పరిచయంచేసాడు.

రాత్రి భోంచేసాక రవి ఇంటికి బయలుదేరాడు.

"రాత్రిపూట ఎందుకండీ ? పొద్దున వెళ్ళకూడదూ" అన్నారు మధు, ఛాయ.

"నాన్నగారొక పని చెప్పారండీ ఉదయమే దాన్ని గురించి చూడాలి" అన్నాడు రవి.

"పెళ్ళినాటికి తప్పక రావాలి" అంది ఛాయ.

"అదేమిటమ్మా నేను రెండురోజులు ముందే రావాలనుకుంటున్నాను."

ఛాయ సంతృప్తిగా నవ్వింది. రవి సాగిపోయాడు. రవి వెళ్ళాక కాసేపుండి మధుకూడా వెళ్ళిపోయాడు. అక్క, తమ్ముడు మిగిలారు.

"నువ్వు చాలా అదృష్టవంతుడివి నాన్నా రవిలాటి స్నేహితులు లక్షల్లో ఒకరు మాత్రమే ఉంటారు."

"అన్ని మాత్రం నా చేతులారా దురదృష్టవంతుణ్ణి చేసానక్కా "

"దురదృష్టమా ? ఏమిట్రా అది ?"

కృష్ణ మొదటినుంచి చెప్పుకొచ్చాడు. ఛాయ దిగ్భ్రాంతి చెందింది.

"తనది చాలా గొప్ప వ్యక్తిత్వం అక్కా అంత భయంకరమైన విషయం విన్నాకకూడా ఏమాత్రమైనా చలించాడేమో చూసావా ? ఎంత నిండుగా మాట్లాడాడో విన్నావుగా."

ఛాయ ఏమీ మాట్లాడలేదు. ఆమె మౌనాన్ని గ్రహించిన కృష్ణకు ఆమెను మళ్లీ పలకరించే ధైర్యం లేకపోయింది. మెల్లగా మంచంమీదకు జారాడు.

ఛాయ వివాహం దగ్గరపడినకొద్దీ కృష్ణ యాంత్రికంగా తయారవుతున్నాడు. అతనిలో వెనకటి హుషారు లేదు. ఆ స్ఫూర్తి లేదు. పరధ్యానంగా ఉంటాడు. ఒంటరిగా పొలాలమీదకు వెళ్లి తిరిగొస్తాడు. తిండి సరిగా తినడు. నిద్రపోడు.

ఛాయ అంతా గమనించింది.

"ఏమిటి బాబూ అదోలా వుంటున్నావు? అలా ఉంటే ఎలా చెప్పు?" ఒక రోజు దగ్గరకు తీసుకుని అన్నది.

"ఏం లేదక్కా....ఎంత ప్రయత్నించినా నన్ను నేను సమాధానపరచుకో లేకపోతున్నాను. నీ నుంచి ఎడబాటు తల్చుకుంటే మనసు చలించిపోతోంది."

"చూడు నాన్నా....నువ్వు పెద్దవాడివి అవుతున్నావు. పరిస్థితులను అర్థంచేసు కోడానికి ప్రయత్నించాలి."

"అర్థంచేసుకోగలనక్కా....కానీ ఒక్క విషయం ఆలోచించు....మండు టాకలికో....ఎండిన డొక్కలతో ఉన్నవాడిముందు భోజనం పెట్టి అతను ఆశతో తింటుండగా పళ్లెం లాగేస్తే అతని పరిస్థితి ఎలా ఉంటుంది? ఎంతో దప్పిగొని ఉన్నవాడికి నీళ్ళందించి తాగుతుండగా గుమ్మరిస్తే అతని పరిస్థితి ఎలా ఉంటుంది?"

"అంత తీవ్రంగా ఎందుకు తీసుకుంటావు బాబూ ... అది సాధ్యమా చెప్పు? నువ్విలా బాధపడితే నే నెలా భరించనురా....?"

"అక్కా....! జరగబోతున్నది ప్రపంచంలో సాధారణమైన విషయమే.... నే కాదనను....ఆడపిల్లకు పెళ్లి కావడం పుట్టిల్లు వదిలి అత్తవారింటికి వెళ్లి పోవటం అంతా మామూలే....కానీ నా స్థితి వేరు....

"ఒకే వ్యక్తిమీద మమత పెంచుకుని ఆ వ్యక్తి చుట్టే జీవితాన్ని అల్లుకున్న వాళ్ళకు అది అక్కగానీ, చెల్లెలుగానీ, అన్నగానీ, తమ్ముడుగానీ....వాళ్ళ నుంచీ ఎడబాటంటే సామాన్యం కాదు.

"జీవితంలో నాకున్నదల్లా అక్క ఒక్కతే....నా జీవం, నా ప్రాణం, నా ధ్యేయం....అంతా అక్కే....అక్క ఉంటే ఏమైనా చేయగలననిపిస్తుంది. అలా కాకుంటే జీవితమంతా శూన్యంగా కన్పిస్తుంది. అలాటి నాకు నీ నుంచి వేరు కావడం మామూలు విషయమా చెప్పక్కా ....?

"నిన్ను ఒదిలి బతకలేనక్కా....ఈ విషయంలో ఎంత ప్రయత్నించినా నేను

పెరగలేకపోతున్నాను. నీకు పెళ్ళవుతుంది. అత్తవారింటికి వెళతావు. నిన్ను చూడటానికి వస్తాను. వరండాలోనో, హాలులోనో కూర్చోవాలి, నీకోసం వాళ్ల కబురంపి 'ఛాయా! మీ పిన్నమ్మ కొడుకు వచ్చాడు," అంటారు. నువ్వు వస్తావు. గుమ్మంలో నిలబడో, గోడనానుకునో కుశలప్రశ్నలు వేస్తావు... "

"అబ్బబ్బ... ఏమిటి బాబూ యీ పిచ్చిపిచ్చి ఆలోచనలు.... కాని వాటి నన్నింటినీ ఊహించుకుని ఎందుకిలా బాధపడతావు?"

"బాధ కాదక్కా....నన్ను చీలికలు చేస్తున్న రంపపుకోత. నేను ఎంతవాడి నైనా నిన్ను ఒదిలి ఉండలేను. నీ చల్లని వాక్కు ఎల్లకాలం నన్ను వెన్నంటి ఉండాలి. అంతకు మించి నాకీ ప్రపంచంలో ఏమీ వద్దు.

"అదే కరువైతే నేను బ్రతకలేను. అనాడు బ్రతికానూ అంటే నే నొక జీవచ్ఛవాన్నైనా కావాలి లేదా హృదయస్పందన తెలియని పశువైనా కావాలి."

"తప్పు బాబూ....అలాటి మాటలనకు. నిన్ను వదిలి నే నెక్కడికీ పోను నా ఆశలు వమ్ము కావు....నా ఆశయం వృధా కాదు. ఎనిమిది సంవత్సరాలు నా సర్వశక్తులు ధారబోసి పెంచుకున్నాను. నువ్వు లేకుండా నాకు బ్రతుకెక్కడిది? నువ్వు లేనిది నా జీవితానికి అర్థమేలేదు బాబూ!....

"నిన్ను పెంచింది కోల్పోడానికి కాదు. గొప్ప డక్టరువు కావాలి. ష్విట్జర్‌లా, నైటింగేల్‌లా మానవసేవకు అంకితం కావాలి. అభాగ్యుల సేవలో నిన్ను నువ్వు మరచిపోవాలి. దళిత జనావళికి ఆశాజ్యోతివి కావాలి. రోగాలతో బాధ పడే దీనజనులు నీ సేవతో హాయిగా నిట్టూర్చాలి.

"వాళ్ళంతా నీకు నీరాజనాలిస్తోంటే నా కళ్ళల్లో వెన్నెల విరబూయాలి. అది నా బంగారు కల. ఆ రోజుకోసం ఎదురుచూస్తున్నాను. అంతటి అదృష్టాన్ని నేను కోల్పోతానా చెప్పు? నన్ను గురించి నీకు తెలియదు నాన్నా....తెలిస్తే ఇలా బాధపడవు," ఛాయ అతని తల నిమురుతూ అన్నది.

కాసేపు మౌనంగా గడిచింది.

"అక్కా....నీకు కూతురు పుడితే నా కిస్తావంటే? నేను పెంచుకుంటాను," కృష్ణ అన్నాడు.

"కొడుకు పుడితేనో...."

"కొడుకు వద్దు....వాడు నాకు రైవల్ అవుతాడు."

"నీకు రైవల్ ఎందుకవుతాడురా....ఎంత పిచ్చివాడివిరా బాబూ.. బిడ్డలు పుట్టినా ఈ బిడ్డకన్న నా కెవ్వరూ ఎక్కువ కావమ్మా." ఛాయ అనునయంగా అన్నది.

కృష్ణ నెమ్మదిగా నిద్రాలోకంలోకి వెళ్లిపోయాడు. ఛాయ గోడకు చేరగిల బడి నిట్టూర్చింది.

ఛాయ వివాహానికి ఒకరోజు ముందుగా వచ్చాడు రవి. వస్తూ ఆమెకు పట్టు చీర, బ్లౌజు పీస్, ఒక లాకెట్ గొలుసు తీసుకొచ్చాడు.

రవిని ఎదురుపడాలంటే ఛాయ జంకింది. కాని అతను సరాసరి ఆమె దగ్గరకు వచ్చాడు.

"ఇవన్నీ ఎందుకండీ" మందలింపుగా అన్నది ఛాయ.

"నా సంతోషమమ్మా మీ పినతండ్రి, పినతల్లి మిమ్మల్ని పెంచి ఉండవచ్చు కానీ ఒక్క షరతు పెళ్లికిముందు నేను తెచ్చిన బట్టలే కట్టుకోవాలి."

అతని వ్యక్తిత్వానికి ఛాయ ముగ్ధురాలైంది.

ఆరోజు మాటలలోనే గడిచిపోయింది. రెండవరోజు ఛాయ వివాహం. కృష్ణను కనిపెట్టుకుని ఉన్నాడు రవి.

ఛాయ భర్త సతీష్ వాళ్ళందరితోనూ, బాగా ఆత్మీయతతో ప్రవర్తించాడు. అతని ప్రవర్తన ఛాయకు ఊరటనిచ్చింది.

ఛాయ పెళ్ళయిన వారం రోజులు అత్తవారింట, కన్నవారింట బావమరదుల సరసాలతో సరదాగా గడిచిపోయాయి. ఒకరిది సున్నితమైన సరసమైతే మరొకరిది వాడిగా పదునైనది.

అప్పటికి సతీష్ కాకినాడలో ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. పెళ్లి అయిన కొద్దిరోజులకు ఛాయను కాపురానికి తీసుకెళ్లాడు. కృష్ణ అక్కను, బావను స్వయంగా దిగబెట్టి విశాఖపట్నం వెళ్లిపోయాడు.

"అమ్మా నువ్వొచ్చిన నాటనుంచి వాడికి ఏలోటూ రాకుండా పెంచావు. నీ కృషి ఫలించి వాడూ యోగ్యుడుగా తయారయ్యాడు. మా రాజకీయాలు, వ్యవహారాల్లో వాడిని గురించి సమయానికి పట్టించుకోగలనో లేదో....డబ్బు వెంట తీసుకెళ్లు....వాడికి కావలసినప్పుడల్లా పంపించు. మళ్లీ ఎప్పుడు కావలసి వస్తుందో రాయి, పంపిస్తాను," ఛాయ వెళ్లేముందు గోవర్ధనరావు ఆమెతో అన్నాడు.

"ఛాయ కాకినాడ రావడం కృష్ణకు కొంత స్వాంతన నిచ్చింది. తరచు అక్కదగ్గరకు వెళ్ళివస్తుండేవాడు. సతీష్ బావమరిదితో బాగా కలిసిపోయాడు. అతను వచ్చినపుడు కాలక్షేపం బాగా జరుగుతుండేది.

వస్తున్నానని లెటరు రాసిన కృష్ణ ఒకసారి రాలేదు. అతనికోసం ఎదురు చూసిన సతీష్‌కు ఆశాభంగమైంది.




"చిన్ననాటినుంచి నేను ఒంటరి జీవితానికి అలవాటుపడ్డాను ఛాయా అంతా నన్ను 'పుస్తకం పురుగు' అని గేలిచేస్తుండేవాళ్లు . వీడు నన్ను గమ్మత్తుగా మార్చేసాడు. ఐ ఫీల్ లైక్ మూవింగ్ విత్ హిమ్. ఐ లైక్ హిజ్ ఇన్నోసెన్స్ మోర్.

"వాడు రాకుంటే వెలితిగా అన్పిస్తుంది. ఇంట్లో ఉన్నాడంటే పదిమంది మనుషులున్నంత సందడిగా ఉంటుంది." భార్యతో అన్నాడు సతీష్.

"జీవితం గురించి నాకు గట్టినమ్మకం ఉన్నా వాడి గురించిన ఆవేదన నిత్యం వెంటాడుతుండేది. మీ అవగాహన చూసాక నిశ్చింతగా నిట్టూర్చాను. ఈ బంధం ఇలాగే సాగిపోవాలి," ఛాయ అతని భుజాన తల ఆన్చి అన్నది.

సతీష్‌కు ఆర్థికంగా బాధ్యతలున్నాయి. అతనికి ఒక తమ్ముడు ఇద్దరు చెల్లెళ్లు ఉన్నారు. తమ్ముడు గుంటూరులో మెడిసిన్ చదువుతున్నాడు. వెనక ఆస్తి పెద్దగా లేదు. కొడుకులు పైకొస్తే చాలులే అనుకుని తల్లిదండ్రులు ఇద్దరినీ పై చదువులలో చేర్పించారు.

ఇద్దరినీ చెరో చోట చదివించాల్సి వచ్చేసరికి అప్పులు చెయ్యక తప్పలేదు. వడ్డీలు పెరిగిపోతోంటే పొలం కొంత అమ్మి బాకీలు తీర్చారు. పెద్ద కూతురు పెళ్లీడుకు రావడంతో పరిస్థితి కష్టమైంది.

ఇంటి ఆర్థిక పరిస్థితులు గమనించిన చాయ కాపురానికి వచ్చినప్పటినుంచి మరిది చదువుకు నెల నెలా తానే డబ్బు పంపడం ప్రారంభించింది.

ఎవరి జీవితాలు వాళ్ళవి అనుకునే రోజుల్లో బాధ్యతలు తెలిసిన కోడలు వచ్చి నందుకు అత్త మామలు సంతోషించారు. సతీష్ ఛాయను హృదయపూర్వకంగా అభినందించాడు.

ఓ శనివారం సాయంత్రం కృష్ణ కాకినాడ వచ్చేసరికి సతీష్ ఆఫీసు నుంచి రావడం ఆలస్యమైంది. అక్క- బావను తీసుకుని సినిమా కెళ్ళాలనుకున్న కృష్ణకు ఆశాభంగమైంది.

"ఏమయ్యా సరదాగా సినిమాకు వెళ్ళాలని అంత దూరంనుంచి వచ్చే ఇంత ఆలస్యంగానా వచ్చేది." అన్నాడు.

"నీకేం బాబూ చేతిలో స్కూటరుంది. ఎప్పుడు అనుకుంటే అప్పుడు వస్తావు. నేను అంత దూరం నుంచీ బస్సుల్లో పడుతూ లేస్తూ రావాలి" అన్నాడు సతీష్.

"అదేం బావా అంత ఇండిఫరెంట్‌గా మాట్లాడతావు. నా దగ్గరుంటే నీది కాదా ? ఇన్ కన్వీనియంట్‌గా ఉంటోందని నాతో ఒక్కసారైనా అనలేదే."

"నీ దగ్గర ఏదైనా మాట్లాడాలంటే నాకు భయంరా. చిన్న విషయాలను కూడా సీరియస్‌గా తీసుకుంటావు."

"సీరియస్ కాదు బావా కావాలనుకున్న వాళ్ళు వేరుగా చూస్తే మనసుకు కష్టంగా ఉంటుంది.

"అది వేరుగా చూడటం కాదురా సంభాషణల్లో ఏవేవో మాటలొస్తుంటాయి వాటినన్నింటినీ పట్టించుకోకూడదు."

కృష్ణ సమాధానమివ్వలేదు. అతను చిన్నబుచ్చుకున్నాడని గ్రహించాడు సతీష్.

"ఎలారా మరీ, ఇంత సెన్సిటివ్ అయితే " అతని తలనిమురుతూ అన్నాడు.

"బావా మా ఫ్రెండ్ హైదరాబాద్ పోతున్నాడు. స్టేషన్‌దాకా పోయొద్దాం పద " మర్నాడు మధ్యాహ్నం సతీష్‌తో అన్నాడు కృష్ణ. ఇద్దరూ స్టేషన్ కెళ్ళారు.

స్టేషన్ కెళ్ళగానే కృష్ణ ప్లాట్‌ఫారం టిక్కెట్లకోసం కౌంటర్ దగ్గర వెళ్ళాడు. అతను రాగానే ఇద్దరూ ప్లాట్‌ఫారం మీద కెళ్ళారు.

సామర్లకోట వెళ్ళే రైలు బయలుదేరే సమయమైంది. కృష్ణ స్నేహితుడు రాలేదు.

"ఏడిరా మీ ఫ్రెండ్ ? ఫ్రైమవుతోందిగా " సతీష్ అన్నాడు.

"అదే చూస్తున్నాను బావా ? కొంపతీసి వాడు ప్రోగ్రాం మార్చుకోలేదు గదా ?" అన్నాడు కృష్ణ బయలుదేరడానికి ముందు రైలు కూత పెట్టింది.

"బావా వస్తా ఇవిగో స్కూటర్ కీస్ ఇది ప్లాట్‌ఫారం టికెట్ నే వైజాగ్ పోతున్నా " అని కృష్ణ రైలెక్కాడు.

సతీష్ క్షణంపేపు స్థాణువులా ఉండిపోయాడు.

"కృష్ణా" అంటూ వెంటనే కంపార్ట్‌మెంట్ దగ్గరకు వెళ్లాడు.

"చూడు బావా నీ సంగతి నాకు తెలుసు. నేను స్కూటర్ వదిలి వెళ్తా నంటే నువ్వు ఒప్పుకోవు. అందుకే ఈ సర్ప్రైజ్ "

"అది కాదురా " సతీష్ ఏదో చెప్పబోయాడు.

"ఏదీ కాకపోయినా ఇదింతే " కదిలిపోతున్న రైలులోంచి అన్నాడు కృష్ణ.

సతీష్ అలానే చూస్తుండిపోయాడు.

స్టేషన్ నుంచి ఒంటరిగా తిరిగి వచ్చిన భర్తను చూసి ఛాయ విస్మయంగా అన్నది. "వాడేడండీ "

సతీష్ అంతా చెప్పాడు.

"దున్నపోతు నాతో కూడా చెప్పలేదు. ఈసారి రానివ్వండి." ఛాయ నవ్వుతూ అన్నది.

మరుసటి ఆదివారం వచ్చాడు కృష్ణ ఉత్సాహంగా "అక్కా" అంటూ ఇంట్లో అడుగెట్టాడు.

"ఏం బాబూ బాగున్నావా ?" ఛాయ ముభావంగా అన్నది.

ఎప్పుడూ నిండుగా నవ్వుతూ పలకరించే అక్క ముభావం కృష్ణకు అర్థంకాలా.

"అదేంటక్కా ? అలా ఉన్నావు ? ఒంట్లో బాగాలేదా " అన్నాడు.

"నావంటికేం విశేషంలా ఉంది."

"నేను చెప్పకుండా వెళ్లానని కోపం వచ్చిందా ?"

"కోపం తెచ్చుకోడానికి నేనెవర్ని బాబూ పెద్దవాడివయ్యావు నీ ఇష్టం నీది "

ఆమె మాటలలో కృష్ణ గింగరాలు తిరిగిపోయాడు. మోకాళ్ల మీద కూర్చుని ఆమె గుండెను కరచుకున్నాడు.

"అట్లా అనొద్దక్కా నే భరించలేను. బావ ఒప్పుకోడని అలా చేసాను. సంతోషంలో నీకూ సర్ప్రైజ్ ఇవ్వాలనుకున్నాను. అంతేనక్కా " అంటుండగా అతనికి కన్నీళ్లొచ్చేసాయి.

ఛాయ అతన్ని మరి కొంతసేపు ఆట పట్టించాలనుకున్నది. కాని అతని కన్నీళ్లు చూడగానే కరిగిపోయి కిలకిల నవ్వేసింది.

"బాబూ ఇంత చిన్న విషయానికి కూడా అంతగా కల్లోలపడితే ఎలారా ఇంకెప్పుడు పెద్దాడివవుతావు?" అతని కన్నీళ్లు తుడుస్తూ అన్నది.

"నే పెద్దవాణ్ణి కాలేనక్కా పెద్దవాణ్ణయితే నీకు దూరం కావలసివస్తుందని నా భయం నే బ్రతికినంత కాలం నీ దగ్గర ఇలాగే ఉండిపోవాలి "

"ఎప్పుడైనా సరే తప్పుచేస్తే తిట్టు కొట్టు. అంతేగానీ ముభావంగా ఉండొద్దు అక్కా అలా అయితే నే బ్రతకలేనే "

"పిచ్చి తండ్రి కాసేపు సరదాకోసం చేసానేగానీ నువ్వంటే నేనెలా ముభావంగా ఉండగలనురా లే పోయి స్నానంచేసిరా టిఫిన్ చేస్తాను." అతని నుదురు నిమురుతూ అన్నది ఛాయ.

కృష్ణ బరువుగా నిట్టూర్చి లేచాడు.

"చంపావుగదే నీకు కోపం వచ్చిందేమోనని హడలిపోయాను " అంటూ టవల్ తీసుకుని బాత్‌రూంకెళ్లాడు.

సతీష్ వాళ్లిద్దరినీ రెప్పవాల్చకుండా గమనిస్తున్నాడు.

"మీరుకూడా స్నానంచేసి రారాదూ ?" భర్తతో అని వంటింట్లోకి వెళ్ల బోయింది ఛాయ.

"ఛాయా ఒక్క నిముషం " అని ఆమె దగ్గరకు వచ్చాడు సంతోష్ .

"మీ ఇద్దర్నీ చూస్తోంటే కలా? నిజమా? అని సందేహం వస్తుంది. వాడు గడపదాటి అడుగుపెట్టాడంటే అడవుల్లో స్వేచ్ఛగా తిరగాడే చిరుతపులే గుర్తువచ్చింది నాకు. వాడి మాటలు, చేతలు పులిపంజా దెబ్బలలాగే ఉంటాయి. అలాంటివాడు ఈ గడపలో అడుగెట్టాడంటే చాలు సర్కస్‌లో పులిలా మారిపోతాడు. చాలా ఆశ్చర్యం "

"చాలు చాలు ఇంక ఆపండి "

"నిజం ఛాయా నువ్వు వాణ్ణి అదుపుచేయడం చూస్తుంటే సర్కస్‌లో రింగ్ మాస్టర్ పులిని ఆడించినట్లే ఉంటుంది అంతటి ఆవేశపరుణ్ణి ఇట్లా కంట్రోల్ చెయ్యడమంటే నీలో ఏదో అపురూపమైన శక్తి ఉన్నది " చిలిపిగా కను లాడిస్తూ ఆమెను కౌగిట్లోకి తీసుకున్నాడు సతీష్.

ఆ ఏడాది గడిచిపోయింది. కృష్ణ మూడవ సంవత్సరంలో అడుగెట్టాడు.

సతీష్ చెల్లెలికి అనుకున్న సంబంధం కుదరలేదు.

"నా ప్రయత్నం నేను చేస్తున్నాను.... మంచి సంబంధం ఎక్కడైనా దొరుకుతుందేమో నువ్వూ కోడలుకూడా ప్రయత్నించండి" అని అతని తండ్రి ఉత్తరం రాసాడు.

"అదేంటండీ అమ్మాయికి మీ మేనత్త కొడుకుని చేసుకోవా లనుకున్నారుగా" అన్నది ఛాయ ఆ ఉత్తరంచూసి.

"అనుకున్నవన్నీ అవుతాయా ఛాయా. వాళ్లిద్దరూ కావాలనుకున్నారు. కానీ మా అత్తవాళ్లకు కట్నంమీద ఉంది. మనం అంత ఇవ్వగల స్థితిలో లేం. మన అమ్మాయికోసం వాడు తల్లిదండ్రులతో తగూపడబోయాడు. అది అపార్థాలకు దారితీస్తుందని అమ్మా నాన్న బలవంతాన ఆపారు."

"కావాలనుకున్న భర్త దొరకకపోవడంకంటె ఆడపిల్ల బ్రతుక్కి మరో నరకం ఉండదండీ .. మిగతా డబ్బు మనం సర్దేద్దాం . అంతేగానీ ఆడపిల్ల బ్రతుకుని అన్యాయం చేస్తామా ?"

"నువ్వు ఆ మాట అంటావని అనుకుంటూనే ఉన్నాను ఛాయా. నీ మంచి తనంలో అంతకుమించి మరోటి ఆలోచించవు వద్దు . భార్యసొమ్ము పెట్టి చెల్లెలి పెళ్లిచేసాడంటారు అంతా "

ఛాయ [redacted]మనసు గాయపడింది.

"మీలో కూడా ఇలాటి భావాలున్నాయా? మీ దృష్టిలో కూడా భార్య అంటే అదో వ్యక్తిత్వంలేని పనిమనిషి అనేనా ? స్త్రీ అంటే మీకు కూడా అంత చులకనభావం ఉన్నదా " అన్నది.

సతీష్ కలవరపడ్డాడు.

"లేదు ఛాయా నాకు అలాంటి భావం ఎన్నడూ లేదు. జీవిత భాగస్వామిగా నువ్వు నిర్వహిస్తున్న పాత్రపట్ల నిజంగా గర్వపడతాను. నీ స్థానంలో మరో స్త్రీ వచ్చిఉంటే మా కుటుంబ సంబంధాలు ఏమైఉండేయో అది ఊహించుకోలేనుకూడా . కానీ "

"మీకు నేను నాకు మీరు అనుకున్నాక నలుగురు ఏ గంగలో కలిస్తే మనకేమండీ నేను మామగారికి రాస్తాను. ఊ సంబంధం ఖాయంచెయ్యమని "

"వద్దు ఛాయా అత్తవారినుంచి డబ్బు తీసుకోవడం అల్లుడికి గౌరవం కాదు."

"ఊరికే తీసుకోవద్దులెండి మీరు మా నుంచి కట్నం తీసుకోలేదుగా ఇప్పుడు తీసుకోండి " ఛాయ నవ్వుతూ అన్నది.

"ఛ... ! అవేం మాటలు ఛాయా....మా కుటుంబంలో ఎవరికీ అలాటి అభిప్రాయాలు లేవు....షేం కావాలనుకున్నది నిన్ను, నీ మంచి మనసుని "

"నిజమేనండీ ఆర్థికంగా ఎన్నో ఇబ్బందులలో ఉన్నా మీ అమ్మానాన్నా అలాంటి ప్రస్తావనలకు కూడా తావివ్వలేదు.... వాళ్ల సంస్కారం మా తల్లిదండ్రుల్ని ఆశ్చర్యపరచింది....

"మీ కుటుంబంపట్ల నా బాధ్యతలు మా వాళ్లకు తెలుసు. నేను ఎలా సుఖపడతానో.... నా సుఖంకోసం ఏంచెయ్యాలో కూడా వాళ్లకు తెలుసు. ఆ యిల్లు కూడా ఏం బాగోలేదు. ఇపుడే బాగుచేయిస్తే బాగుంటుంది " ఛాయ అన్నది.

"నీ ఇష్టం...." సతీష్ మరింకేం అనలేదు.

"మిగతా డబ్బు మేం చూస్తాం....అమ్మాయికి కావాలనుకున్న సంబంధమే ఖాయం చెయ్యండి" అవి అత్తమామలకు ఉత్తరం రాసింది చాయ.

డబ్బు పంపవలసిందిగా కన్నవారికి కూడా రాసింది.

అనుకున్న వ్యక్తితో సతీష్ చెల్లెలిపెళ్లి నిర్ణయమైంది. పెళ్లికి వారం రోజులు ముందే దంపతులిద్దరూ అక్కడకు చేరుకున్నారు.

"అమ్మా.... ఎక్కడో అరుదుగా వింటాం.... ఒక కుటుంబం ఇబ్బందుల్లో ఉంటే మంచి మనసుగల కోడలు వచ్చి ఆ కుటుంబాన్నొదారికి తెస్తుంది. అలాటి కోడలు జీవితంలో మాకే ఎదురవుతుందని కలలోకూడా ఊహించలా నీ మంచితనాన్ని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను." సతీష్ తండ్రి ఛాయతో అన్నాడు.

"వదినా.... బావలేని జీవితంకంటే ఈ లోకాన్ని విడిచిపెట్టడమే మంచిదనుకున్నాను. నా ఆశలు చిగిర్చావు. నీ రుణం తీర్చుకోలేను." అన్నది ఆడబిడ్డ.

కాలచక్రంలో మరో ఆరునెలలు దొర్లిపొయ్యాయి.... రవి వివాహం నిర్ణయమైంది. అతనికి కాబోయే భార్యపేరు వాత్సల్య. విశాఖపట్నంలో బి. ఎస్‌సి. చదువుతోంది.

"అక్కా.... వదిన నాకు నచ్చిందే.... తనను ఎం. ఎస్‌సి. చదివి మా ఆస్పత్రిలో బయోకెమిస్టుగా పనిచెయ్యమన్నాను." కృష్ణ ఛాయతో అన్నాడు.

"తప్పుగదు బాబూ.... అనొచ్చా.... ఆ అమ్మాయి ఏమనుకుందో ?"

"ఏం తప్పు ?.... అన్న భార్యతో ఆ మాత్రం స్వతంత్రంగా మాట్లాడ గూడదా ?" కృష్ణ ఆమె మాటను తోసేసాడు.

"ఇంకేంటా....ఓ లక్ష కట్నం అడ్వాన్సుగా ఇవ్వండి. నా కొడుక్కి మీ అన్న కూతుర్ని చేసుకుంటాను." సతీష్ బావమరిదితో హాస్యంగా అన్నాడు.

అప్పటికి ఛాయ గర్భవతి.

"ఇదుగో గురూ....నువ్వు వెయ్యేళ్లు తపస్సుచేసినా నీకు కొడుకు పుట్టడు. నే చెపుతున్నా విను.... నీకు కూతురే పుడుతుంది."

సతీష్ నవ్వుకున్నాడు.

ఆ వేసవిలో రవి వివాహం జరిగింది. ఛాయకు వాత్సల్యకు స్నేహం కలిసింది.

ఒకరోజు సతీష్ ఆఫీస్‌నుంచీ దిగాలుగా వచ్చాడు. అతనిని గమనించిన చాయ.

"ఏమిటలా ఉన్నారు?" అన్నది.

"మా ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుతో తగాదా తప్పేట్టులేదు చాయా... కొన్ని మెషీన్స్ కొన్నాం... వాటి బిల్స్ పాస్‌చెయ్యమన్నాడు. క్వాలిటీ ఏం బాగోలేదు. వీలుపడదన్నాను. బెదిరింపులు మొదలెడుతున్నాడు."

"నిజాయితీతో పనిచేసేవారు. మిమ్మల్ని ఈ బెదిరింపులేం చేస్తాయి..? ఏం దిగులు పడకండి...." అన్నది చాయ.

"నీకు తెలియదు చాయా....ఈ రోజుల్లో నిజాయితీతో పనిచేయడమంటే ప్రాణసంకటంలా ఉన్నది. ఇక్కడ పనిచేయాలంటే ఆత్మాభిమానాన్ని చంపుకుని 'యస్ సార్' అనాలి. లేదా కృష్ణలా రోడ్డుమీద నిలెయ్యాలి." సతీష్ ఉదాసీనంగా అన్నాడు.

"మీకు అంత విరక్తి కలిగితే వెధవ ఉద్యోగం వదిలెయ్యండి.... మనకున్న పొలం చాలు హాయిగా బ్రతకడానికి...."

సతీష్ ఆమెవంక సంతృప్తిగా చూసి కౌగిట్లోకి తీసుకున్నాడు.

"నాకీ అమ్మాయి చాలు .. ఉద్యోగం పోయినా ఫర్వాలేదు ఛాయా... డిజైన్లు తయారుచేసి ఆమాత్రం సంపాదించగలను."

"మరి ఈ టెన్షన్లు ఎందుకండీ.... ఉద్యోగం వదిలేసి కన్సల్టెన్సీ మొదలెట్టొచ్చునుగా....?"

"మొదలెట్టొచ్చు.... మొదలెట్టే ముందు ఫారిన్ వెళ్లొస్తే బాగుంటుందని పిస్తోంది.... కానీ నువ్వు కృష్ణ నొదిలి రాలేవు...."

"కన్నదేశాన్ని వదిలి ఫారిన్ పోవడమేమిటండీ?"

"నువ్వు అన్నమాట నిజమే చాయా?....చదువుకున్న ప్రతివాడికి దేశంపట్ల

బాధ్యత ఉంటుంది ..కాని పరాయి దేశంమీద వ్యామోహంతో గాదు నేను అక్కడికి వెళ్ళాలనుకుంటోంది వివశ్యతతో మాత్రమే. శక్తి సామర్థ్యాలకు నిజాయితీకి ఇక్కడ గుర్తింపులేదు. బాగా పనిచెయ్యాలనుకున్నవాడికి అన్నీ అడ్డంకులే రెండుమూడేళ్లు."

"అవకాశం రావడానికి ఎన్నాళ్లు పడుతుంది ?"

"త్వరలోనే రావచ్చు ."

"మీరు ప్రయత్నించండి . బాబుకి నేను నచ్చజెపుతాను ."

"వాడు బాధపడతాడేమో ?"

"ఫర్వాలేదు. చాలా పెరిగాడు. పరిస్థితుల్ని అర్థంచేసుకోగలడు. ముందు మీరు వెళ్ళండి. నేను ప్రసవం అయ్యాక ఐదారు నెలలకు వస్తాను."

సతీష్‌కి కెనడాలో కన్సల్టెంట్‌గా అవకాశం దొరికింది. ఛాయ ప్రసవమయ్యే రోజులు దగ్గరకు రావడంతో ప్రయాణాన్ని కొద్దిరోజులు వాయిదా వేసుకున్నాడు.

పరీక్ష ఫలితాలొచ్చాయి. రవి ఎం.బి.బి.యస్. పాసయ్యాడు. కృష్ణ నాల్గవ సంవత్సరానికి వచ్చాడు. ఇంక రెండేళ్లు అనుకున్నది ఛాయ.

ఛాయను ప్రసవానికి తెనాలిలో ఒక నర్సింగ్‌హోమ్‌లో చేర్చారు. చేర్చిన మూడోరోజున ఆమెకు ప్రమాదంగా ఉన్నదని టెలిగ్రాం వచ్చింది కృష్ణకు.

గుండెలు తల్లడిల్లుతోంటే వెంటనే టాక్సీచేసుకుని కృష్ణ, రవి, వాత్సల్య తెనాలి చేరుకున్నారు. అప్పటికే సమయం మించిపోయింది.

శిశువు అడ్డంపడి ప్రసవించలేక ఛాయే కన్ను మూసింది. డాక్టరు చేసిన ఆపరేషన్ ప్రయత్నం ఫలించలేదు.

"మీ అక్క మోసంచేసి పోయిందిరా ?" కృష్ణను చూడగానే గావురుమన్నాడు సతీష్

కృష్ణ అక్క శవంమీదపడి గుండెలు పగిలేలా ఏడ్చాడు.. అతనికి జీవితమంతా శూన్యంగా కన్పించింది. అన్నం నీళ్లు మానేసాడు. పిచ్చివాడిలా అక్క ఫోటో వంక చూస్తూ చిక్కిశల్యమైపోతున్నాడు.

"ఏడిస్తే అక్కయ్య రాదుగా కృష్ణా అక్కపోయినా ఆమె ఆశయం చనిపోలేదుగా నీ మీద ఎన్ని ఆశలు పెట్టుకుంది చెప్పు ? వాటినన్నింటినీ వమ్ముచేస్తావా ? " వాత్సల్య అతన్ని దగ్గరకు తీసుకుని అన్నది.



"ఎం చెయ్యను వదినా? నాలో జీవం అంతా అక్కతోనే పోయింది. నేనింక చదవలేను వదినా...." కృష్ణ నిర్లిప్తంగా అన్నాడు.

"తప్పు బాబూ.... అలా అనకు. ఆమె ఆశయం అసంపూర్తిగా మిగిలిపో గూడదు....నువ్వు అకర్మణ్యుడవు కాగూడదు! ఇక్కడుంటే మరీ పిచ్చి వాడివై పోతావు....రేపు రాత్రికి వెళ్ళిపోదాం...."

"నాకు జీవితంమీద ఆశ అంతమవుతోంది. వదినా....నావల్ల ఇంకేం కాదు నన్నిలా వదిలెయ్యి...."

"ఇంక నీ మాటలు నేను వినను బాబూ. టిక్కెట్లు బుక్‌చేసి రమ్మని మీ అన్నయ్యని పంపాను. రేపు రాత్రికి ప్రయాణం తప్పదు." వాత్సల్య అతన్ని మందలించింది.

ఆమె ఓదార్పుతో కృష్ణగుండె రాయిచేసుకున్నాడు. విశాఖపట్నం బయలుదేరి వచ్చాడు. వాత్సల్య అతన్ని కంటికి రెప్పలా కాపాడుతోంది.

* * *

"అదమ్మా....నా జీవితం....అక్కపోయి అపుడే మూడునెలలు కావస్తోంది.

నిజంగా నాకీ ప్రపంచంలో ఏమి ఉన్నదని బ్రతకను?" అతను అంతా చెప్పి అన్నాడు.

"ఎంత దురదృష్టవంతుడివి బాబూ?" ఆమె అన్నది.

"నేనూ చాలాసార్లు అనుకున్నానమ్మా ఆత్మహత్య చేసుకోవాలని. అక్కలేని ఈ ప్రపంచంలో నాకేం ఉన్నదనిపిస్తుంది.

"అక్క ఫోటో చూస్తుంటే ఆమె నవ్వుతూ తన దగ్గరకు వచ్చెయ్యమంటున్నట్లనిపిస్తుంటుంది. ప్రేమతో చేతులు చాచి రమ్మని పిలుస్తున్నట్లనిపిస్తుంటుంది.

"కానీ....వదిన చెప్పినట్లు నా ముందు ఎంతో కర్తవ్యం ఉన్నది. అక్క ఆశయాలను నెరవేర్చాలి.... అందుకే గుండెల్ని దహిస్తున్న బడబాగ్నిని దిగమింగాను."

ఆమె మౌనంగా ఉన్నది.

"మానవ జీవితం ఆత్మహత్యల కోసం కాదమ్మా. చావు మన సమస్యలకు పరిష్కార మార్గమూ కాదు.

ఈ సమాజాన్ని మీరెందుకు లక్ష్యపెట్టాలి? మిమ్మల్ని ద్వేషించినందుకా అడుగడుగునా సమస్యలు సృష్టించి హింసించినందుకా?

ఎవళ్లో కూసిన కాకికూతలకు వెరచి మనం జీవితాలను ఎందుకు బలిపెట్టుకోవాలి?....

ఆత్మహత్య పిరికివాళ్లు, ఆత్మధైర్యంలేనివాళ్లు ఆలోచనారహితంగా చేసేపని. మీరు నిర్భయంగా జీవితపథంలో ముందడుగెయ్యండి. ఈ సమాజం మిమ్మల్నేం చెయ్యలేదు.

"రండమ్మా....ఇప్పటికే చాలా పొద్దుపోయింది. నేను ఇంటికి రాలేదని వదిన కంగారుపడుతూ ఉంటుంది. మిమ్మల్ని డ్రాప్ చేసి వెళతాను" అని అతడు తన స్కూటర్ వైపు నడిచాడు.

ఆమె మౌనంగా అతన్ని అనుసరించింది.





# నాకు నచ్చిన నా కథ

ఈ కథ నాకు ఎందుకు నచ్చింది అన్న ప్రశ్నకు నా సమాధానం ఇది:

ఒక రచయిత మనస్సులో వున్న భావాలను ఎంత ప్రయత్నించినా 70 శాతానికి మించి పేపర్‌మీదకు తీసుకు రావటం కష్టం. కాని ఈ రచనలో అంతకుమించి తీసుకువచ్చానన్న తృప్తి వుంది. నాకు మొదట్నుంచీ 'సెంటి మెంట్' అంటే చాలా యిష్టం. ఈ కథలో సెంటిమెంట్‌ను చిత్రించటంలో కృతకృత్యుడ్నయానని నా నమ్మకం.

ఈ నాటి కథాసాహిత్యం రెండు మూడేళ్ళ క్రితంవరకూ బాగా, చాలా బాగా కూడా వుంది. ఏడెనిమిదేళ్ళ క్రితం చాలా మంచికథలు వచ్చాయి. గత రెండు మూడేళ్ళుగా చెదురుగా ఒకటీ అరా మంచి కథలు వస్తోన్నా, చిత్తశుద్ధితో రాసిన కథలు రావటంలేదు. రచయితలు నిలబడలేకపోతున్నారు. తేల్లిగా రాయటంపట్ల ఆసక్తి ఎక్కువయింది. కథారచన ఒక ధ్యేయంగా, దీక్షగా రాసేవాళ్ళు కన బడటంలేదు. వస్తువుమీదకన్న పాపులారిటీమీద క్రేజ్ కనబడుతుంది. వైవిధ్యం తక్కువగా వుంటోంది.

—కొమ్మూరి వేణుగోపాలరావు

# మర మనిషి

జనరల్ హాస్పటల్ మార్చ్యుయరీ రూమ్‌లో ఎటాప్సి జరుగోంది పాథాలజీ ప్రొఫెసర్ శ్రీధర్ చకచక బాడిని డిసెక్ట్‌చేసివెస్తూ తాను గమనిస్తూన్న అంశాన్ని చుట్టూ గుమిగూడివున్న విద్యార్థులకు మహోత్సాహంగా చెప్పుకు పోతున్నాడు. ఆనాటి అసిస్టెంట్ పాత్ర నిర్వహిస్తున్న ఓ విద్యార్థిని గబగబ నోట్సు రాసేస్తోంది.

"చూడండి. ఈ ఏంటీబయాటిక్ ఎరాలో సిఫిలిస్ యింతగా జీర్ణించుకు

పోయిన కేసులు అరుదు. అపూర్వంకూడా. ఈ కిడ్నీమీద చూడండి ఎలా పేచెస్ ఏర్పడ్డాయో. మీరందరూ ఫీలవ్వండి-కన్సిస్టెన్సీ ఎంత ఫరమ్‌గా వుందో, ఐసే యిటీజ్ వుడ్‌హర్డ్ ఇదిగో లివర్ బ్రెయిన్ యుటిరస్ యు ఫీల్ ది లింఫ్‌గ్లాండ్స్ హియర్. టిపికల్ షాట్ ఎపియరెన్స్ వాట్ ఎ వండర్‌ఫుల్ పెరిషియరీ స్టేజ్ యిటీజ్ !"

మరో గంటకి ఎటాప్సీ పూర్తయింది. తాను జాగ్రత్తగా బయటకు తీసిన శరీర భాగాలన్నీ బాక్సులో భద్రంచేసి మ్యూజియంలో ఎరేంజి చేయమని అసిస్టెంట్లకి పురమాయించి, వాష్‌బేసిన్ దగ్గర శుభ్రంగా చేతులు వాష్‌చేసుకుని బయటకి వచ్చాడు శ్రీధర్.

మార్చ్యురీ బయట, కాంపౌండ్‌లో ఆ చనిపోయిన స్త్రీ తాలూకు మనుషులు కాబోలు - అయిదారుగురు చెట్లక్రింద కూర్చుని కనబడ్డారు. 'ఆ శవంకోసం కాబోలు....' అనుకున్నాడు శ్రీధర్. అదిప్పుడు తీసుకుపోయి స్మశానంలో భూపతనం చేస్తేనేగాని యీ అమాయక మానవులకూ, ఆ చనిపోయిన మనిషి తాలూకు ఆత్మకూ శాంతి లభించదు కాబోలు. వింత మానవులు. అయినా ఆ దేహంలోని సారమంతా తనే లాగేశాడు. అని తన మ్యూజియంలో భద్రపరచ బడి వుంటాయి. ఎందుకూ పనికిరాని మిగతా డొల్లనే వాళ్ళు కర్మాదులకు వినియోగించుకోవాలి.

అతను దేముణ్ని నమ్మడు. మూఢనమ్మకాల నేమీ దరికి చేరనివ్వడు. శాస్త్రాలకూ, చాందసభావాలకూ సంబంధించిన ఏ కిరణలేశమూ అతనిపై ప్రసరించదు. ఎటాచ్‌మెంట్స్ అంటారే- అతను వాటికి అతీతుడు.

తన గదికి వచ్చి మరోసారి శుభ్రంగా చేతులు కడుక్కొని భోజనం చేద్దామని క్యారియర్ విప్పబోతున్నాడు.

ఇంతలో బల్లమీద ఫోన్ మ్రోగింది. వెళ్ళి రిసీవర్ అందుకున్నాడు.

అవతలి కంఠం డాక్టర్ రమది. "డాక్టర్, కంగ్రాచ్యులేషన్స్" అన్నదామె.

"ఏమో !"

"నేను శ్రీదేవిని ఎగ్జామిన్ చేశాను. షీ యీజ్ ప్రెగ్నెంట్.... ప్రైమీకదా. అందులో వీక్‌గా వున్నారామె. మంచి ఫుడ్ ఇస్తూ జాగ్రత్తగా వుంచాలి.... నా దగ్గరకు శ్రీదేవి వచ్చినట్లు మీకు తెలీదు కదూ ! తను అనుమానిస్తున్నారట- వచ్చి పరీక్ష చెయ్యమన్నారు.... థర్డ్ మన్త్...."

అతని చెవులు పనిచేయటం మానేశాయి. క్షణంలో అతన్ని వెయ్యి భయాలు

చుట్టుముట్టాయి పట్టుకున్న అతని చెయ్యి కంపిస్తోంది. "మైగాడ్!" అను కున్నాడు అప్రతిభుడై.

*  *  *

కారు పోర్టికోలో ఆపి, ఎదురుగా వస్తూన్న శ్రీదేవివంక చూడకుండా మౌనంగా గదిలోకి వెళ్ళి సోఫాలో కూలబడ్డాడు శ్రీధర్.

అత నలా చేస్తాడని ఆమె ముందే వూహించి వుంటుంది. ఒక నిమిషం మెదలకుండా వూరుకుని, తరువాత నెమ్మదిగా అతని వెనక్కి వచ్చి నిలబడింది.

"ఈ వార్త మీలో కలవరపాటు కలిగించింది కదూ!"

అతను తలతిప్పి ఆమెవంక భావశూన్యంగా చూశాడు. అతని చూపులు ఎప్పుడూ అంతే. ఎప్పుడో కాని అవి భావస్ఫోరకంగా వుండవు.

"కూర్చో చెబుతాను" అన్నాడు మొదట. భార్యను శాంతపర్చాలనే ఉద్దేశం.

"ఫర్వాలేదు, చెప్పండి." అంది నిలబడే.

"అలాకాదు కూర్చో."

శ్రీదేవి ఎదురుగా వున్న సోఫాలో ఆసీనురాలై ప్రశ్నార్థకంగా చూసింది.

"చూడు శ్రీదేవీ!" సానునయంగా ప్రారంభించాడు ఆమె పెనిమిటి, మెడికల్ కాలేజిలో ప్రొఫెసర్, భౌతికవాది అయిన శ్రీధర్. "నేను చెప్పే విషయాలు విని కలతపడకు. మన వివాహం జరిగి అయిదేళ్ళయింది. అందులో రెండు సంవత్సరాలు నా విదేశ పర్యటనలోనే గడిచిపోయింది. వృత్తిరీత్యా తొందరగానూ, దాంపత్యరీత్యా ఆలస్యంగానూ ప్రకాశించసాగిన జీవితాలు మనవి. ఇంకో రెండేళ్ళలో నేను మళ్ళీ స్టేట్స్‌కి పోవాల్సివుంది. ఈ సారి నాతోపాటు నువ్వూ వుంటావు శ్రీదేవీ! నాకు యింతవరకూ సంతానేచ్ఛ కలగలేదు. దానివల్ల అనిర్వచనీయమైన ఆనందం వూరిపడుతుందని కానీ, ఏదో సాధించగలుగుతామని గానీ భ్రమలేదు నాకు. ఈ తాపత్రయం నా కయిష్టం. ఈ బాదరబందీ యిప్పుడో పెద్ద అడ్డంకి. మనమేం వృద్ధులమైపోలేదు. ఒక్క ప్రశ్నడుగుతాను. ఈ హేపీనెస్ నశించిపోవటం నీ కంత యిష్టమా?"

శ్రీదేవి కష్టంమీద నిట్టూర్పు అణుచుకుంది. అతని మాటలు విన్నాక ఆమె హృదయక్షేత్రంలో రెండు ప్రశ్నలు ఉదయించాయి. ఒకటి - ఏది హేపీనెస్? రెండవది - అతనిదంతా యిప్పుడు ఏమిటికి చెబుతున్నాడు? అంటే యిప్పుడు వ్యవహారం చెయ్యిదాటిపోయాక.

"అంతా విన్నావుగా" అన్నట్లు చూసి "ఏమంటావు చెప్పు" అన్నాడు చివరికి ప్రొఫెసర్.

ఆమె ఎలాగో నవ్వగలిగింది. "బలేవారే. అనేందు కేముందిక?"

"ఏమీ లేదా?" అన్నాడతను నిస్పృహగా.

అతను చేతులు నలుపుకుని "యింతలో యింత ఉపద్రవం ముంచుకొస్తుం దనుకోలేదు" అని గొణుక్కున్నాడు. అంత విపరీత పరిస్థితిలోనూ వచ్చిన నవ్వాపుకుని ఆమె మెల్లిగా లేచి అతని ప్రక్కకి వచ్చి కూర్చుంది. కాస్త అను నయించాలని "చూడండి మీరు" అంటూ భుజంమీద చెయ్యివేసింది.

అత నామెవైపు ముఖం తిప్పాడు. అదే భావశూన్యమైన చూపు. నిశ్చలమైన కంఠంతో అన్నాడు: "ఈ మమతలూ, మమకారాలూ, తాపత్రయాలూ నా తత్వానికి సరిపడవు శ్రీదేవీ! నాకు కావలసిందల్లా సూటైన జీవితం. అది నా చెప్పుచేతుల్లో వుండి, నే ననుకున్న మలుపులే తిరగాలి. ఆకస్మిక సంఘటనలూ, బలవంతపు బంధనలూ నా కప్రీతికరం. నేను నీకు తెలుసు. విరహాలూ, ఒకరంటే ఒకరు పడిచావటం, పటాలుమని ప్రేమ బహిరంగంగా బ్రద్దలుకావటం, అణువులో అణువు అనీ, రక్తంలో రక్తమని, మన తాలూకు మాంసఖండమనీ బలహీనతలు పునాది వేసుకుని, వ్రేళ్ళని పాతుకుంటూ బలంగా పెరగటం, జీవిత వికాసానికవి ప్రతిబంధకం కావటం నాకు సరిపడదు. ఈ భూమ్మీద అన్నింటికంటె బల మైనది యీ బలహీనతే. ఇది యంత్రయుగం. విజ్ఞానం విప్లవరూపం ధరిస్తున్న కాలం. మేధస్సు రబ్బరులా సాగాలిగానీ తాడులా తెగిపోకూడదు శ్రీదేవీ."

ఎంత నిగ్రహించుకుందామన్నా ఆమె కన్నీటిని ఆపుకోలేకపోయింది. తర తరాల అక్షరాల్లా లిఖించగలిగే ఆ బరువైన నీటిబిందువులు, మృదువైన చెంపలమీద భారంగా జారి, మచ్చలేని ఆమె కంఠసీమమీద మచ్చలుగా ఏర్పడు తున్నాయి.

"ఏడ్చేవాళ్ళంటే నాకు మహా చిత్రం!"

"మీరు కఠినులు" అందామె గాద్గదికకంఠంతో, కొంచెం కోపంగా.

"బహుశా నిజమే" అంటూ లేచి నిలబడ్డాడు. ఇంటికి వచ్చాక అతను బట్టలైనా మార్చుకోలేదు. అలవాటు ప్రకారం కాఫీ అయినా తీసుకోలేదు. మెల్లగా కదిలి, కారిడార్లోకి వెళ్ళి బయటకు చూస్తూ సిగిరెట్టు వెలిగించాడు.

"ఈ కఠినత్వమే నాకు మేలుచేసిందేమో. అందుకే యీ వయసులోనే ప్రొఫెసర్ని కాగలిగానేమో! ప్రేమ అనే వ్యామోహాన్ని నేను కఠినంగా

ఎదురించలేకపోయివుంటే మామూలు గ్రాడ్యుయేటుగా మిగిలిపోయేవాణ్ని. నిజం నీకు తెలుసు."

ఆమె ఏమీ సమాధానం చెప్పలేదు. ఆ నిశ్శబ్దవాహినిలో ఆమె సన్నని రోదన తరంగనాదంలా వినవచ్చింది.

చలికాలం. దక్షిణ దిక్కునుండి వుండివుండి శీతలవాయువులు వీస్తున్నాయి. భూమీ, ఆకాశం ఎప్పుడో చల్లబడ్డాయి. నెమ్మది నెమ్మదిగా చీకటి ఛాయలు పృథ్వీమీద చోటుచేసుకొంటున్నాయి. ప్రొఫెసర్‌గారి బంగాళా ముందున్న చిన్ని తోటలోని గుల్‌షన్, లిల్లీ, చెంగల్వ, మాలతి, సన్నజాజి తీగెల పొదల మీదనుండి కమ్మని పరిమళాలు వ్యాపిస్తున్నాయి. అతను నిలబడిన ప్రదేశానికి దాపునే వున్న యూకలిప్టస్, కర్పూర వృక్షాలు మృదుసుగంధాన్ని విరజిమ్ము తున్నవి. హైదరాబాద్ మారేడ్‌పల్లిలో, ఏకాంత ప్రదేశంలో అతను ముచ్చటపడి కట్టించుకున్న బంగాళా అది. ముద్దులమూటగట్టే తోటా, అందులోని రకరకాల పుష్పసముదాయాలూ సెంటిమెంట్సుకు బానిసఅయిన శ్రీదేవి కృషి. ప్రొఫెసర్ శ్రీధర్ శవాలతో, శవాల తాలూకు మాంసఖండాలతో, మైక్రోస్కోప్‌లతో మాట్లాడినట్లుగా పువ్వులతో, మొక్కలతో మాట్లాడలేడు. వాటి సౌందర్యం, సౌరభం అతని నేత్రాలనూ, ఘ్రాణేంద్రియాన్నీ బొత్తిగా ఆకట్టుకోలేవు. ఇటుక, సిమెంటులతో చేసి, మొజాక్ ఫ్లోరింగ్‌తో నింపేసిన బంగాళాను మాత్రం నీట్‌గా వుంచటంలో అతను దిట్ట.

కాసేపటికి సిగిరెట్ అవతలకు విసిరేస్తూ, వెనక్కి తిరక్కుండానే అతనన్నాడు. "సాధన నా పరమలక్ష్యం. ఆ శిఖరాగ్ర అవరోహణలో యిటువంటి చిన్నచిన్న అవరోధాలు టూత్రమీల లాంటివి, అవలీలగా దాటెయ్యవచ్చు, నేను చెప్పినట్లు నడుచుకుంటే. నెల తప్పింది నీకు. అంతేగా—నీ ఆరోగ్యము మంచిది కాదు. నువ్వు ఎంతవరకూ బర్త్ యివ్వగలవో నాకు అనుమానమే. ఒక పసికందు కోసం నీ ప్రాణానికి అపాయం తెచ్చుకోవటం మియర్ ఫూలిష్‌నెస్ చెప్పేది అర్థంచేసుకో. ప్రస్తుత పరిస్థితుల్లో యిది నాకు యిష్టంలేదు. సమయం మించిపోలేదు నేను డాక్టర్ని. దీన్నాపుచేయటం అసాధ్యమైన సంగతేం కాదు"

ఒక్క నిముషం కాదు ఒక్క క్షణం నిప్పులు చెలరేగే నిశ్శబ్దం. భూకంపానికి ముందు, మహాసముద్రం అల్పపు ప్రపంచాన్ని కబళించే ముందు, అగ్నిపర్వతం పగలుపని బ్రద్దలై లావాను విస్ఫురించే ముందు ఒక్క క్షణం

యుః

సంకోచించినట్లు.... నిప్పుల్ని చెరిగే శబ్దం; తరువాత పెద్ద శబ్దం.

అత నదిరిపడి వెనుదిరిగి చూశాడు.

శ్రీదేవి నేలమీద స్మృతిహీనురాలయి పడివుంది.

* * * * *

బెడ్‌లైటు వెల్తురు గదంతా మందంగా ప్రసరిస్తోంది. గోడమీద గడియారం టిక్కు టిక్కుమని చప్పుడు చేస్తోంది. పన్నెండు దాటిపోయింది.

శ్రీదేవి నిద్రపోవటంలేదు; కంఠంవరకు దుప్పటి కప్పుకుని పడుకుని కళ్ళు మూసుకుని ఆలోచిస్తోంది. సాయంత్రం ఆ సంఘటన జరిగినప్పటినుంచీ ఆమెకు భర్తని చూస్తుంటే, అతడ్ని తలుచుకుంటూంటే వొళ్ళు జలదరిస్తోంది. హృదయ క్షేత్రంలో ఎక్కడపడితే అక్కడ అతను తన భర్తగా కాక— ఓ ప్రొఫెసర్‌గా, మరమనిషిగా సాక్షాత్కరిస్తున్నాడు. ఆమెకి రాత్రి నిదురరాదు. కన్నీటితో తలగడను అభిషేకం చేస్తోంది. అవి యీ రాత్రి యింకిపోవు.

కనులు సగం తెరచి ఆతని మంచంవైపు చూసింది. ఓ ప్రక్కకి వొత్తిగిలి వున్నాడు అలవాటు ప్రకారం. గాఢనిద్రలో వున్నాడేమో!

ఈ వ్యక్తి ఎప్పుడూ యింతే. ఆ వ్యక్తితత్వం, అతని వ్యక్తిత్వం, పోనీ స్థాయి అందుకుందామన్నా అందుకోబుద్ధి కాదు; క్రిందికి పడిపోతేనే హాయిగా వుంటుందేమో అనిపిస్తుంది.

అతని కిప్పుడు ముప్ఫయి అయిదు, ముప్ఫయి ఆరు సంవత్సరా లుంటాయి. సన్నగా పొడుగ్గా వున్నా, ఉక్కులాంటి బలమైన శరీరం. అతని చురుకైన నేత్రాలలో ఎప్పుడూ కాంతి నశించదు. అతని నిర్మలమైన ముఖంలో ఎప్పుడూ అలసట ద్యోతకం కాదు. అతని జుట్టు కొంచంకూడా రాలిపోలేదు. ఎక్కడా నెరసిపోలేదు; ఈ వయసున అతను ప్రొఫెసర్ అయ్యాడంటే— అది తేలిక సంగతేం కాదు.

చూపులు త్రిప్పుకుని శ్రీదేవి గట్టిగా కళ్ళు మూసుకుంది. అతని తల్లి కాంతమ్మ వివాహానికి పూర్వం తనతో యిలా అనేది:

"తనకు కావలసిన వస్తువును యెదుక్కోవటం వాడికి చేతకాదు. దాని విలువ గ్రహించటమూ తెలీదు. వాడు ఏకాకి అయిపోతాడేమోనని భయంగా వుంది. ఈ దీనురాలి కోరికను మన్నించి అలా కానివ్వకూడదు నువ్వు. చూడమ్మా, ఆ బండరాయి అంటే నీ కసహ్యంలేదు కదూ."

తను అభయ మిచ్చింది. వృద్ధురాలి కోరిక తీర్చింది.

పాపపుణ్యాల ప్రసక్తి వచ్చినప్పుడు శ్రీధర్ అనేవాడు. "పుణ్యం, పాపం- వీటికి నేనాట్టే ప్రాధాన్యత యివ్వను. పుట్టుకా, చావూ జీవితానికి మొదలూ, క్షయిమాకూన్నా కావు. నాకు కావల్సింది మనుగడ. ఈ మనుగడ ఒక ఉక్కు-పాత్ర అయితే ఎక్కడా నొక్కులూ, చిల్లులూ వుండకూడదు నాకు ఊహ వచ్చినదాదిగా నేను మెటీరియలిస్టని. అయితే అంతమాత్రంచేత శూన్యాన్ని, దారుణాన్నీ మాత్రం కాదు. నా పరిధిలో నాకూ కొన్ని యిష్టాయిష్టాలూ, అభిరుచులూ వున్నాయి. కాని అవి మూఢనమ్మకాలు కావు. అవి నా మనసున వికాసాన్ని పెంపొందింపజేసేవి."

"ఎలాంటివి?" అన్నదామె ఎగతాళిగా.

"ఎలాంటివా? నువ్వంటే నా కిష్టం. ఈ సత్యాన్ని నేను ధిక్కరించలేను." ఈ ఊహ నాకు బాగుంటుంది- అలాంటివి."

అతడు ఆమెకు కొంత అర్థమయాడు. కొంత అర్థంకాలేదు. అర్థమయినంతవరకూ సానుభూతే పెరగలేదు. అర్థంకాని విషయాలలో జుగుప్సా కలగలేదు. అతనికి జీవితంలో భ్రమలు లేవు. ప్రేమపారాలు వర్ణించడు. ఊహాలోకాలు నిర్మించుకోడు. తను పొందదలుచుకున్న లాభానికి కృషిని పణంగా ధారపోస్తాడు. అతనికి బద్ధకం లేదు. తనకి కావలసిన వస్తువుల్ని అభిమానంగా చూస్తాడు. కాని అతను 'అతి' మనిషి గాదు- 'మితి' మనిషి ఏ సమయంలోనూ హాహాకారాలు చెయ్యడు. మనిషిని ఎత్తి, కుదిపేసే ఉత్సాహం అతడి నెన్నడూ ఆవహించదు. ఏడుపులూ, మొత్తుకోళ్ళూ ఉప్పెనలాంటి ఉద్రేకాలూ అతని దృష్టిలో హాస్యాస్పదం. అతడు జీవితాన్ని తరచగలడు. తొలుచుకుంటూ పోగలడు. అనుకున్నవి సాధించగలడు. మాధుర్యాన్ని ఆస్వాదించగలడు కాని వాటిని చిత్రాలుగా అతీతాలుగా పరిగణించడు.

అతనిముందు శ్రీదేవి ఎన్నడూ తననితా వెల్లిచేసుకోలేదు. బింకంగా వుండటం ఆమెకు తెలుసు. కాని ఇప్పుడు ఈరాత్రి పడుకుని ఇంతగా దుఃఖిస్తున్నదంటే, తన బాధని బహిర్గతం చేసుకున్నదంటే యిది తిరిగి యిద్దరికీ వ్యక్తిగతమైన విషయం. ఇక్కడ ప్రకర్షలకూ, ఆభిజాత్యాలకూ తావులేదు.

కాని శ్రీదేవి అనుకున్నట్లు శ్రీధర్ నిద్రపోవటంలేదు. ఆలోచిస్తున్నాడు.

ఆలోచించి ఆలోచించి చివరి కిలా తేల్చుకున్నాడు. "పోనీ, ఆమె యిష్టప్రకారమే కానీయ్."

* * *

"ఐ యామ్ సారీ డాక్టర్! దిస్ యీజ్ ఎ కేస్ ఆఫ్ హైడ్రోసెఫాలస్"

అంది మిడ్‌వైఫరీ ప్రొఫెసర్ రమాదేవి, ఏడు నెలల తర్వాత-అన్ని యిన్‌వెస్టిగేషన్సూ అయాక.

శ్రీధర్ కొద్దిగా చలించాడు.

"పెల్వీమెట్రీ ఫైండింగ్స్ ఫేవరబుల్‌గా వున్నాయి. ఫీటస్ యింతవరకూ హెల్తీగా వుంది. రేర్ కేస్ అనుకోండి. ట్రయల్ లేబర్ యిచ్చి, కుదరకపోతే క్రేనియాటమీ చేసేస్తాను. ఏమంటారు?"

శ్రీధర్ తల ఆడించాడు. కాని ఒక క్షణమాలోచించి "ట్రయల్ లేబర్ రిస్కు ఎందుకు డాక్టర్? క్రేనియాటమీతో ప్రొసీడ్ అయితే . ." అన్నాడు.

"ఎందుకో డెలివరీ పాజిబుల్ అనిపిస్తోంది. శ్రీదేవి కేమీ అపాయం కలగదు. మీరు నిశ్చింతగా వుండండి" అంది ధైర్యంగా రమాదేవి.

క్రేనియాటమీ చేసి ఎలాగైనా ఫీటస్‌ని డిస్ట్రాయ్‌చెయ్యమని గట్టిగా చెబుదామనుకున్నాడు. కాని ఆమె వినిపించుకోదు గుడ్‌బై చెప్పి బయటకు వచ్చేశాడు.



సిగిరెట్ మీద సిగిరెట్టు కాలుతోంది. నిమిషాలు నిర్దయగా తగలబడుతున్నాయి. నిమిషాలు యింత యాతనగా జరగటం అతని జీవితంలో బహుశా యిదే మొదటిసారి. శ్రీదేవి విలువ ఎంత అమూల్యమో, మనిషి ఎందుకు యంత్రం కాదో ఇప్పుడు తెలుస్తోంది.

"బాప్‌రే! హాయిగా దుఃఖపడటం చేతకానివాడు ఎంత దుఃఖజీవి!!!"

ఫోన్ గణగణ మోగింది. ఒక్కు ఉదుటున రిసీవర్ అందుకున్నాడు.

"నార్మల్ డెలివరీ. మేల్ ఛైల్డ్. ఇద్దరి కండిషన్ బాగున్నది." అంది రమాదేవి విశ్చలంగా. ఆమె అతన్ని అభినందించలేదు. ఆమె గొంతులో ఆనందం ధ్వనించలేదు. కారణం అతనికి తెలుసు.

"థ్యాంక్యూ డాక్టర్" నెమ్మదిగా అని ఫోన్ పెట్టేశాడు.



పిల్లాడి రంగు ఎరుపు. చేతులూ, కాళ్ళూ సన్నంగా పుడకల్లా వుంటాయి. దేహం గాలిలేని తిత్తిలా వేళాడుతుంది. తల తాటికాయంత వుంటుంది. ఆ తలకు తగ్గట్లు మిడిగుడ్లూ, తీరూతెన్నూలేని ముక్కూ నోరూ ఆ పిల్లాడా యింట్లో పెరుగుతున్నాడు.

వాడ్ని ఎప్పుడు చూసినా తమ పాథాలజీ మ్యూజియంలో అలాంటి స్పెసిమన్ లేదన్న సంగతి గుర్తువస్తుంది ప్రొఫెసర్ శ్రీధర్‌కి.

ఆ పిల్లాడు పెరగటమే ఒక ఆశ్చర్యం శ్రీధర్‌కి. సాధారణంగా కడుపులో వున్నప్పుడే చచ్చిపోతూ వుంటారు యిలాంటి పిల్లలు. పిండాన్ని బయటకు తియ్యటానికి దాని శిరస్సును పరికరాలతో ఛిన్నాభిన్నం చెయ్యవలసి వుంటుంది. జన్మించిన సమయానికి వీడి తల అంత మరీ పెద్దదికాకపోవటంవల్ల వాడి పుట్టుక సాధ్యమైంది. పుట్టాడు ; పెరుగుతున్నాడు ; నవ్వుతున్నాడు.

శ్రీధర్‌కి తెలుసు—వీళ్ళు బ్రతకగలిగితే వెర్రితలకాయలుగా తయారౌతారని.

అత నా బిడ్డను ఒకటి రెండుసార్లు లేబరేటరీలో వస్తువుని పరీక్షించినట్లు తీసి పరీక్షించాడు. ఎప్పుడూ ఎత్తుకుని ముద్దాడలేదు. కబుర్లు చెప్పలేదు. శ్రీదేవితో వాడి యదార్థస్థితిని గురించీ, సంభవాసంభవాల గురించి ఎప్పుడూ ప్రస్తావించలేదు.

శ్రీదేవి వాడికి 'కరుణ' అని పేరు పెట్టుకుంది.

ఆ పిల్లవాడిని గురించి పూర్తిగా కాకపోయినా కొంతయినా ఆమెకు తెలుసు. డాక్టర్ రమ చెప్పింది. అది ఓ రకం కన్‌జనిటల్ ఎనామలీ. బ్రెయిన్‌లో ఫ్లూయిడ్ పేరుకుని ఆ స్థితి దాపురిస్తుంది.

శ్రీదేవికి భగవంతుడంటే నమ్మకముంది. పాపపుణ్యాలపట్ల, కర్మసిద్ధాంతం పట్ల విశ్వాసముంది. అందుకనే 'నా పాపఫల'మని గుండెల్లో అగ్నిహోత్రాన్ని దాచివుంచింది.

ఆమె వాడ్ని క్షణం దింపదు ; ఎంత ముద్దుచేస్తోందో లెక్కలేదు; ఎన్ని కబుర్లు చెబుతుందని. ఆ బుల్లాడికి.... పోనీ ఎవరికి మాత్రం ఎలా తెలుస్తుంది- ఎన్ని కన్నీటి కణాల సముదాయమో ! తనని తాకే ఆ పెదిమలిచ్చే ముద్దు.

భర్తతో కొడుకుని గురించి ఎప్పుడూ సంప్రదించదు. ఎత్తుకోమని అడగదు. అసలు అతను చూస్తూండగా కొడుకుని ముద్దుచెయ్యదు. అతను తమ యిద్దర్నీ ఆ స్థితిలో చూడటం ఆమెకి బాగుండదు. భర్తతో ఆమె జీవితం మునుపటికన్న లోతుగానూ లేదు; ఇప్పుడు తక్కువయిందీ లేదు.

ఆమె కరుణకోసం బోలెడు బొమ్మలు కొన్నది. తనే చిన్నపిల్లగా మారి వాటిని ముందుపెట్టుకుని ఆడుతూ కూర్చునేది.

ఇంటి కెవరైనా అతిథులు వస్తే కనబడనిచ్చేదికాదు. వాడి నెత్తుకుని లోపలకు పారిపోయేది. దాచిపెట్టేసేది. ఎవరన్నా చూస్తారని అభిమానం కాదు ; క్షా సానుభూతి వాక్యాలు పలికినా, వ్యాఖ్యానించినా తనకు భగ్గుమంటుందని

ఒకసారి కరుణకు కాస్త వళ్ళు వెచ్చబడి మూలగటం ప్రారంభించాడు శ్రీదేవి కంగారుపడి భర్తదగ్గరకు గబగబా వెళ్ళింది తప్పనిసరిగా.

"బాబుకు జ్వరం వచ్చింది. ఒకసారి వచ్చి చూస్తారా?" అంది కంపిత స్వరంతో.

"పద" అని అతను లేచాడు. వాడి ప్రక్కలో కూర్చుని ఎగ్జామిన్ చేశాక "కంగారుపడకు శ్రీదేవీ! మైల్డ్ బ్రోంకైటిస్. మెడిసన్ తెప్పిస్తాను" అన్నాడు.

ఆ రోజంతా అతను కొడుకుని, ఓ డాక్టర్ పేషెంటుని చూసినట్లుగా చూశాడు.

రాత్రి ఏదో అలికిడి అయితే అతను తలతిప్పి చూశాడు. బెడ్‌లైటు వెల్తుర్లో శ్రీదేవి పిల్లాడికి పాలసీసాతో ఫీడ్‌చేస్తూ కనిపించింది. అప్రయత్నంగా గడియారం వంక చూశాడు. పన్నెండు దాటింది.

"శ్రీదేవీ! నువ్వు చేస్తున్నది కూడని పని. రాత్రి పదిదాటాక తిరిగి ఆరు గంటలదాక ఫీడ్‌చెయ్యకూడదు. మానెయ్యి" అన్నాడు.

శ్రీదేవి, చేస్తున్న పనిని ఆపి పిల్లాడ్ని ప్రక్కగా పడుకోపెట్టుకుని జోకొట్టి నిద్రపుచ్చటానికి ప్రయత్నించసాగింది. వాడు ఊరుకోవటల్లేదు. గుక్కపట్టి ఏడుస్తున్నాడు. ఇహ ఆమెకు వాణ్ని మరిపించడం సాధ్యంకాక "ఊరుకోడండి! పాలు పడతాను." అన్నది హీనస్వరంతో.

"రోజూ ఇలాగే చేస్తున్నావా?"

"ఏడుస్తూంటే పడుతున్నాను."

"చదువుకున్నదానివి అయివుండి కూడా నువ్విలా ఎందుకూ పనికిరాకుండా తయారవుతున్నావేం శ్రీదేవీ?"

ఆమె ఏమీ సమాధానం చెప్పలేదు. కాసేపటికి వాడింకా ఏడుపు తగ్గించక పోతే నిద్రాభంగ మవుతుందని, ఎత్తుకుని కారిడార్‌లోకి తీసుకువెళ్ళి అటూయిటూ తిప్పసాగింది.

రెండు రోజులకు వాడి జ్వరం తగ్గిపోయింది.

ఒకనాడు ఆమె లోపలనుండి హాల్లోకి వచ్చేసరికి నిద్రపోతూన్న పిల్లాడివంక పరీక్షగా చూస్తూ కనిపించాడు శ్రీధర్. అత నంత దీర్ఘంగా ఏమి పరిశీలిస్తున్నాడో ఆమెకి బోధపడలేదు. తన సబ్జక్టు తాలూకు ఒక స్పెసిమన్‌ని గ్లాస్ ఎపియరెన్స్ పరిశీలిస్తున్నట్లు పరిశీలిస్తున్నాడేమో! ఆమె వంటిమీద జెర్రులు పాకినట్లయింది. వెనుకనుంచి చప్పుడుగాకుండా వచ్చి "చలిగా వుంది" అంటూ సాధ్యమైనంత పూర్తిగా దుప్పటి కప్పేసింది.

అతనకోసమని అప్పుడప్పుడూ స్నేహితులు వస్తూండేవారు. "వాట్ యీజ్ దిస్ శ్రీధర్, మీ కొడుకుని చూపించరేం?" అని అడిగేవారు అందరూ.

"వాడు హెల్తీ ఛైల్డ్ కాదండీ. హైడ్రో సెఫాలస్ అని ఓ డిసీజ్ వుంది అమెరికాలో అయితే ప్రతి అయిదువందల కాన్పులకూ ఒకడు అట్లా జన్మిస్తాడు. యాదృచ్ఛికంగా మీరు ఇందర్ని చూసివుంటారు. పెద్ద తలకాయా, యింతంత గుడ్లూ, డిస్ప్రొపోర్షనేట్‌గా కాళ్ళూ చేతులూ...." అని ఓ లెక్చర్ యిచ్చి నంత పనిచేసి "రండి చూద్దురుగాని" అంటూ లేవ దొకసారి.

"ఎందుకు లెండి" అని ఆ స్నేహితుడే ఇబ్బందిలో పడిపోయాడు.

"నోనో! ఏమీ పర్వాలేదు; రండి" అంటూ శ్రీధర్ అతన్ని లోపలకు తీసుకుపోతున్నాడు.

శ్రీదేవి యిదంతా ఆలకించింది. వళ్ళంతా తేళ్ళు ప్రాకినట్లయింది. గుండెల్లో గునపాలు గుచ్చినట్లయింది. ఏది సభ్యత? ఏది సభ్యత కాదు? పిల్లాణ్ని ఎత్తు కుని గబగబా గదిలో దూరి తలుపు గడియపెట్టింది.

"శ్రీదేవీ! తలుపు తియ్యి. స్నేహితులు వచ్చారు. అబ్బాయిని చూస్తారుట." అన్నాడు శ్రీధర్ తలుపుకొడుతూ.

లోపలనుండి ప్రత్యుత్తరం లేదు.

"పోనీలెండి. మరెప్పుడన్నా చూడవచ్చు" అని మొహమాటపడుతున్నాడు మిత్రుడు.

గదిలో బిడ్డని పొత్తిళ్ళలో పెట్టుకుని శోకమూర్తిలా కూర్చున్న శ్రీదేవికి యీ మాటలు దూరంగా వినిపించాయి; "షి యీజ్ ఏన్ ఎడ్యుకేటెడ్ లేడీ, బట్ ఎ సెంటిమెంటల్ ఫూల్."

పిల్లాడు యింకా కొంచం ఎదిగాడు. బోర్లా పడుతున్నాడు. అంత పెద్ద తల వేసుకుని వాడు బోర్లాపడుతుంటే శ్రీధర్ ఎడ్యుకేషనల్ ఫిల్మ్ చూస్తున్నట్టు నిలబడేవాడు.

ఓసారి పిల్లాడు ప్రక్కమీదనుంచి దొర్లి పడిపోయాడు. తలకి దెబ్బ తగిలి నెత్తురు కూడా కారింది. ఆ రోజంతా ఆమె పడిన బాధ వర్ణనాతీతం. చూసిచూసి చివరకు శ్రీధర్ అన్నాడు మందలింపుగా, "నీకు మళ్ళీ మళ్ళీ చెప్పవలసి వస్తూ న్నందుకు చింతిస్తున్నాను శ్రీదేవీ. అంతగా బంధాన్ని పెంచుకోవటం నీకే నష్టం."

తల్లికీ తనయుడికీ మధ్యవుండే సంబంధబాంధవ్యాలను లాభనష్టాలత్రాసులో వేసి తూచటం చేతకాదు శ్రీదేవికి. కాని ఆమె అతన్తో వాదించదు. మౌనంగా ఊరుకుంది.

ఒకరోజు అతను పనివున్నట్లు భార్యను దగ్గరకు పిలిచి "చూడు శ్రీదేవీ. వీడి తల రోజురోజుకూ పెద్దది అవటంలేదూ!" అన్నాడు పడుకుని ఆడుకుంటున్న కొడుకును చూపిస్తూ.

శ్రీదేవి తల ఎత్తి అతని ముఖంలోకి చూసింది. ఆమె కళ్ళలోనికి ఎర్రని జీర వచ్చింది. "చూడండి మిమ్మల్నొ విషయం అడుగుదా మనుకుంటున్నా నెప్పట్నుంచో."

గొంతులో అంత కాఠిన్యం అతనెప్పుడూ వినలేదు. అప్రతిభుడై చూశాడు.

"ఈ పిల్లాడికి తండ్రినని మీ కెప్పటికి స్ఫురిస్తుంది!"

ఆమె జవాబుకోసం నిరీక్షించలేదు. జవాబు అఖ్ఖర్లేదు. పిల్లాణ్ని ఎత్తుకుని లోపలకు వెళ్ళిపోయింది.

అనుభూతులు ఎరుగని శ్రీధర్ అచేతనుడై నిలబడిపోయాడు.

* * * * *

చివరకు అనుకున్నంతా జరిగింది. శ్రీదేవిని విధి మళ్ళీ వెక్కిరించింది. ఇన్నాళ్ళకు క్రమంగా పిల్లాడు క్షీణించిపోసాగాడు. చూపు నిలవటం తగ్గింది. వెర్రి నవ్వు ఆగింది; ఏవేవో కాంప్లికేషన్లు-పొట్టలో, గొంతులో, మెదడులో... ఒక దుష్టక్షణాన ఫిట్స్‌లా తల విసిరేయసాగాడు. అలా మూడురోజులు తీసుకుని తీసుకుని, మరో దుష్టక్షణాన తన వికృతరూపానికి స్వస్తి చెప్పి మరో రూపాన్ని వెదుక్కుంటూ వెళ్ళిపోయాడు.

వాడి మృతదేహాన్ని వొళ్ళోపెట్టుకుని శ్రీదేవి మౌనంగా కన్నీరు కారుస్తూ కూర్చుంది. బయటకు ఒక్క మాటా అనలేదు. ఎవర్నీ నిందించలేదు.

చాలా సేపటికి అతడామెను సమీపించి "ఎంతసేపలా దుఃఖిస్తూ కూర్చుంటావు శ్రీదేవీ! వాణ్ని తీసుకుపోయి అంత్యక్రియలు జరిపిస్తాను." అన్నాడు. ఆమె ఓసారి తలఎత్తి అతని ముఖంలోకి చూసి, చేతులుజాచి శవాన్ని అందిచ్చి "తీసుకు వెళ్ళండి" అంది.

కుమారుడి మృతదేహాన్ని శ్రీధర్ రెండుచేతుల్లోనూ పొదివిపట్టుకున్నాడు. కారు దగ్గరకు తీసుకువెళ్ళి బాక్‌సీటులో పడుకోబెట్టి, స్టీరింగ్ ముందుకు వచ్చి కూర్చున్నాడు. కారు కదిలి, ఆ బంగళాను దాటిపోయింది.

మూడురోజులు శ్రీదేవి యీ లోకంలో లేదు. ఏమీ తినదు. నిద్రపోదు. ఎవరితో మాట్లాడదు. ఎందుకో ఎక్కడో అనవసరంగా అన్యాయం జరిగినట్లు లోపలినుంచి తొలిచే వ్యథ. ఆమె క్షీణించిపోతోంది.

తన తత్వానికి విరుద్ధంగా శ్రీధర్ ఆమె ప్రక్కన గంటలతరబడి కూర్చుని ఓదార్చాడు. ఆమె మనసుకు ఉల్లాసం కలుగజేయాలని, ఉన్ముఖతపర్చాలని ఆరాటపడ్డాడు. చివరికన్నాడు— "దుఃఖాన్ని మనం పరమ శత్రువులా చూడాలి. ఈ సత్యం తెలుసుకో."

ఇంట్లో ఏ మూలకిపోయినా, ఏ గదిలో అడుగుపెట్టినా— ఆమెకా రూపమే ప్రత్యక్షమవుతుంది. పెద్ద తలకాయా, చిన్న చేతులూ, కాళ్ళూ, గట్టిగా పలుక లేని నోరూ

ఆ నోరు జాలిగా "అమ్మా ! అమ్మా !!" అని పిలుస్తున్నట్లు వినిపిస్తుంది.

ఆమె గుండెల్లో తుపాకిగుళ్ళు దిగబడతాయి.

"నేను నోచుకోలేదు; నేను నోచుకోలేదు" అని వాపోతుంది.

ఆ మందినోరు యిలా అంటుంది. "అమ్మా ! యిది నా తప్పా ? మరి ఎందుకేం యీ శిక్ష ?"

"బాబూ యీ శిక్ష నీకు కాదు, నాకు. అసలిది శిక్ష కానేకాదు— నా పంట, నా అదృష్టం."

నోరు అంటుంది: "పోన్లే అమ్మా ! నేను వెళ్ళిపోవటమే మంచిది. బ్రతికి అందరి వికృతపు చూపులు నా మీద పడటంకన్నా:"

"వాళ్ళని కాల్చేస్తాను. వాళ్ళని శపిస్తాను. వాళ్ళ అంతు చూస్తాను."

నోరు అంటుంది. "కాదులే అమ్మా ! నా కోసం నువ్వు యిరుకు జీవితం అనుభవించట మెందుకు ?"

"అయ్యో ! నేనెంత కిరాతకురాల్ని ? నేనే అలా పుట్టివుంటే నా జీవితం ఏమయివుండేది ?"

ఆమె ఆలోచనలతో, సంఘర్షణలతో, దహించే విషాదంతో అలిసి అలిసి సొమ్మసిల్లి పోయేది.

"మైగాడ్ ! పూర్వులు చెప్పింది నిజమే. నరక మున్నది" అని సిగరెట్లు తగలబెట్టేవాడు శ్రీధర్.

*    *    *

పాథాలజీ మ్యూజియంలో మిగతా స్పెసిమన్స్ అన్నీ ఒక ఎత్తూ, శ్రీధర్ కొత్తగా అమర్చిన హైడ్రోసెఫాలస్ స్పెసిమన్ ఒక ఎత్తూ.

"కన్జనిటల్ హైడ్రోసెఫాలస్ సర్వ సాధారణంగా యిన్ట్రాయుటెరైన్ లైఫ్‌తోనే ఫీటస్ చచ్చిపోతుంది. దిస్ యీజ్ ఏ రేర్ కండిషన్. అయిదు

నెలల వరకూ జీవించాడు," అని ప్రొఫెసర్ శ్రీధర్ విద్యార్థులకి చూపించాడు.

అతనికి సెంటిమెంట్లు లేవు. మూఢనమ్మకాలు అంతకంటె లేవు. అయినా ఆ స్పెసిమెన్ అంటే అత్యంతాభిమానం. అసలు రోజూ ఓ గంట మ్యూజియంలో గడపటం అతని అభ్యాసం. అందులో తిరుగాడుతూ సరిగ్గా దాని దగ్గరికి వచ్చేసరికి అప్రయత్నంగా ఆగిపోయేవాడు. అయిదునిమిషాలు అలాగే నిలబడిపోయేవాడు. అతని కళ్ళు తదేకంగా దానిని వీక్షిస్తూ వుండేవి. ఫార్మలిన్‌లో తేలుతున్న ఆ పెద్ద తలకాయగల చిన్న శరీరం అతని హృదయంలో రోజురోజుకూ స్థావరం ఏర్పరచుకోసాగింది.

దానిచెంత నిల్చుంటే అతని హృదయం స్పందించినట్లు వుండేది. శరీరం చమర్చేది. అక్కడ ప్రదర్శనకు వుంచబడిన పదార్థం, సైన్సుని విరజిమ్మే ఆ ఉపయుక్త వస్తువు తన రక్తంలో రక్తం, తన బొమికలో బొమిక, తనలో ఓ అంగం.

ఈ రకం అర్ద్రభావాలు తన నావహిస్తున్నాయని అతనికి మొదట్లో తెలిసేది కాదు. అంతా యాంత్రికంగా జరిగిపోతూందనుకునేవాడు. కాని యీ హృదయ స్పందన, చురుక్ చురుక్‌మనే ఆవేశం తను ఏదో అజ్ఞాతశక్తికి లోబడిపోతున్నాననీ, తనని ఎవరో జయిస్తున్నారనీ అతను గ్రహించాడు సిగ్గుపడ్డాడు... ఇహనుంచీ ఆ ప్రదేశంలో ఆగకూడదనుకున్నాడు. అక్కడ్నుంచి గబగబా ముందుకు నడిచి వెళ్ళిపోవటానికి ప్రయత్నించేవాడు. కాని అతని పాదాలు అతను చెప్పినట్లు వినటం మానేశాయి. అక్కడకు చేరుకునేసరికి ఠక్కున ఆగేవి. వెంటనే కళ్లు అటు తిరగటం, తదేకంగా తిలకించటం అథవా మానవప్రయత్నం జయించి ఎప్పుడైనా అతను ముందుకు సాగిపోయినా ఏదో ఒక నెపంతో తిరిగి అటు నెట్టుకుంటూ వెళ్ళేవి పాదాలు. అతనీ బాధ భరించలేక అసలు మ్యూజియం హాలులోకి అడుగుపెట్టకూడదని నిశ్చయించి, అందుకు ప్రయత్నించాడు. కాని కనీసం ఒక్క రోజుకూడా అతనా ప్రయత్నంలో సఫలీకృతుడు కాలేకపోయాడు. అక్కడికి వెళ్ళకూడదనుకున్నకొద్దీ మనసదే పరిగెత్తేది. గుండెను ఆ మ్యూజియం హాలు కళ్ళాలువేసి లాగుతున్నట్లు అయేది. ఈ నిగ్రహం ఆ ఆకర్షణతో చివరి కతన్ని బలహీనత కమ్మేసేది. కళ్ళు మూసుకుని అలసటగా 'బాప్‌రే' అనుకునేవాడు. అతనికి తెలియకుండానే ఎప్పుడో అతని కళ్ళూ, కాళ్లూ వాటిపని అవి చేసేవి.

ఇలాంటి అవస్థ జీవితంలో మునుపెన్నడూ లేదు. అతన్లో పెద్ద యుద్ధం

మొదలయింది. అంతర్యుద్ధం. తనతో తను పోరాడుతున్నాడు. తనమీద తను పళ్ళు కొరుకుతున్నాడు. కత్తులతో ఖుడిపిస్తున్నాడు.

మొదటి విజ్ఞానాభిరుచి, తదుపరి యుద్ధం, తదనంతరం అభిమానం, ఆ తర్వాత ఆకర్షణ, అటుపైన మమకారం, వెర్రిభ్రమ, పిదప ఏకత్వం – ఒకదాని వెనుక ఒకటి విరుచుకుపడ్తూ అతన్ని కుదిపి కదిపిపారేస్తున్నాయి. ఆ ఆకృతి ఒక్కో సారి నిద్రలోకూడా ప్రత్యక్షమవుతుంది. అస్పష్టంగా కలవరిస్తున్నాడు.

శ్రీదేవి తన పరిధినుంచి యివతలకు వచ్చి అతన్లో వచ్చిన చిత్రమైన మార్పుని గ్రహించేసరికి రోజులూ, వారాలూ కూడా గడిచాయి.

ఒకరోజు అతను ప్రక్కమీద పడుకుని పైకి చూస్తున్నాడు. పక్కన అలికిడి అయింది; అతనికి తెలియలేదు. శ్రీదేవి వచ్చి అతని పక్కన కూర్చుని, అతన్ని స్పర్శించేదాకా అసలు గ్రహించలేదు.

ఉలికిపడి ఆమెవంక చూసేసరికి "చెప్పండి" అంది మృదుకంఠంతో.

"ఏమిటి?"

"మీలో ఏదో మార్పు వచ్చింది. దేనికో బాధపడుతున్నారు. మనిషి చిక్కిపోయారు. ముఖంలోని కాంతికూడా నశించింది. పరధ్యానంగా ఉంటున్నారు. కలవరిస్తున్నారు. ఇదంతా దేనికని?" తన చేయి అతని వక్షస్థలంపై వుంచి ఎంతో ఆదరపూర్వకంగా అడిగింది.

అతను విస్మితుడయ్యాడు. "నిజంగానా? నిజంగా నాలో అంత మార్పు వచ్చిందా?"

"ప్రపంచ చరిత్రలోనే విశిష్టమైన సంగతి. నిజంగా మీలో అంత మార్పు వచ్చింది. నా కళ్ళని నేను నమ్మలేకుండా వున్నాను."

"కారణం నాకూ స్పష్టంగా తెలీదు శ్రీదేవీ!"

"పోనీ నాకు కారణం చెప్పవద్దుగానీ, మీరు మాత్రం మామూలుగా వుండండి. నా విశ్వాసాలను చెదరగొట్టే బలహీనతలు రెచ్చగొట్టకండి."

అతనామె కళ్ళలోకి చూస్తూ చాలాసేపు ఊరుకున్నాడు. "శ్రీదేవీ! ఒక్క ప్రశ్న అడిగేదీ?" అన్నాడు తర్వాత.

"అడగండి."

"నేను చాలా ఎబ్బెట్టు మనిషినా?"

ఆమె అదరిపడి అతని ముఖంలోకి చూసింది. అతని ఛాతీమీద మృదువుగా రాస్తూన్న ఆమె చెయ్యి ఆగిపోయింది.

"నువ్వు నన్ను ద్వేషించిన సమయాలూ, ఏవగించుకున్న సన్నివేశాలూ చాలా వున్నాయా."

ఆమె చటుక్కున లేచివచ్చింది. ప్రభూ ఇది ప్రశ్న కాదు. ధనుర్విముక్త విశిఖం.

కాని తమాయించుకుని ప్రాధేయపూర్వకంగా అంది. "మీ రెప్పుడూ నన్నిలా అడగరనుకున్నాను. ఇలాంటి సమయం రాదనుకున్నాను మీ ప్రవర్తననూ, శిక్షణనూ అన్నీ సహించానుగానీ యీ ప్రశ్నను మాత్రం సహించలేను; ఇప్పుడే కాదు. నేను చచ్చిపోయేలోగా ఎప్పుడూ నన్నీప్రశ్న వేయవద్దు, క్షమించండి. మనసు గాయపరిస్తే" అని లేచి అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

అతను నిట్టూర్చాడు. శ్రీదేవికి తను చేసినపని తెలీదు. తెలిస్తే ఏం జరుగుతుంది? అగ్నిపర్వతం బ్రద్దలవుతుందా?

* * *

ఒక మహావిలయం సంభవిస్తున్నది. భూమి బీటలు వారుతోంది. బ్రద్దలవుతున్నది. అగ్నిపర్వతాలు మంటలు ఎగచిమ్ముతున్నాయి. లావాని విరచిమ్మేస్తున్నాయి. సముద్రాలు పొంగి ప్రపంచాన్ని కబలించివేస్తున్నాయి. తుఫానులు చెలరేగుతున్నాయి. జ్వాలలు, మాడ్చి మసిచేసే వేడి, ప్రపంచపు పొలిమేరకు గిరవాటువేసే సుడిగాలి, ప్రవాహాలను సృష్టించే కుంభవృష్టి, అధఃపాతాళానికి త్రోసేసే భూకంపం

కెవ్వుమని కేకపెట్టాడు.

కిటికీలోంచి గగనవీధుల్లోకి తిలకిస్తున్న శ్రీదేవి పరుగెత్తుకువచ్చింది. "ఏమండీ? ఏమయింది?" అని అడుగుతోంది ఆత్రుతగా, ముఖంమీదికి వంగి.

అతనికి శరీరమంతా ముచ్చెమటలు పోసేశాయి. గజగజమని వణుకుతున్నాడు. శ్రీదేవి కంఠం మరో లోకంనుండి వినిపించినట్లయింది. బలవంతంగా కళ్ళు తెరిచాడు.

"ఏమండీ ఎలావుంది?" అతని ముఖంమీద శ్రీదేవి ముఖం.

"ఏదో కల వచ్చింది శ్రీదేవీ! సర్వనాశనం జరిగిందిట." అన్నాడు బలహీనంగా.

ఆమె వదనమండలం నీలిమేఘాలతో నిండిపోయింది. "మీరు ఎక్కువగా ఆలోచిస్తున్నారు. అందుకే "

కాసిని క్షణాలు మౌనంగా గడిచాయి.

"వారం రోజులయింది కదూ నేను మంచమెక్కి ?"

తల ఊపింది.

"అబ్బా, యింతకాలం నేనెప్పుడూ జబ్బుపడలేదు అందుకేనేమో "

"ఊ ?"

"అందుకేనేమో ఆలోచనలు_"

"మీరలా విసుగు చెందకూడదు. ఇంకో రెండురోజులు పూర్తి విశ్రాంతి తీసుకుంటేనేగాని మీరు మామూలు మనిషి కాలేరు."

"మామూలు మనిషి" అతని పెదాలపై చిరునవ్వు ఉదయించింది.

"ఎందుకు నవ్వుతున్నారు."

"అనుమానం వచ్చిందిలే."

"దేన్ని గురించి ?"

అతనికేం చెప్పాలో తోచక "మళ్ళీ మామూలు మనిషిని అవుతానా కానా అని !"

ఆమె కాళ్ళక్రింద భూమి కదలినట్లయింది. "అలా అనకండి" అంది డగ్గుత్తికతో.

"శ్రీదేవీ !" అని పిలిచాడు.

"ఊ !"

"అటు బయటకు చూడు."

ఆమెకి అర్ధంగాక "ఏముందండీ అక్కడ ?" అని ప్రశ్నించింది.

"కావలసినంత వుంది. అస్తమించే సూర్యబింబాన్ని కప్పేసిన మేఘాలు, నన్ను చూసి నవ్వే గాలి, వెక్కిరించే వృక్షసమూహాలు."

శ్రీదేవికి గుండె బరువెక్కింది. దుఃఖం ఉప్పెనలా ముంచుకువచ్చింది.

"అబ్బా ! అలా మాట్లాడకండి బాబూ. మీకు పుణ్యముంటుంది." ఆమె గొంతు పూడిపోయింది.

మళ్ళీ నిశ్శబ్దం.

శ్రీదేవి కాస్త సంకోచిస్తూనే "ఇవాళ శనివారం కదూ. ఈ సాయంత్రం నేను దేవాలయానికి వెళ్దామనుకున్నాను. వెళ్ళిరమ్మంటారా ?" అని అడిగింది తలవంచుకుని,

"వెళ్ళిరా, సంకోచం దేనికి ?"

"మీరు ఇంట్లో ఒంటరిగా వుండాలని "

"పర్వాలేదు శ్రీదేవీ; తగ్గిపోయిందిగా."

"వారం రోజులయింది కదూ నేను మంచమెక్కి ?"

తల ఊపింది

"అబ్బా, యింతకాలం నేనెప్పుడూ జబ్బుపడలేదు అందుకేనేమో

"ఊ ?"

"అందుకేనేమో ఆలోచనలు_"

"మీరలా విసుగు చెందకూడదు. ఇంకో రెండురోజులు పూర్తి విశ్రాంతి తీసుకుంటేనేగాని మీరు మామూలు మనిషి కాలేరు."

"మామూలు మనిషి" అతని పెదాలపై చిరునవ్వు ఉదయించింది.

"ఎందుకు నవ్వుతున్నారు."

"అనుమానం వచ్చిందిలే."

"దేన్ని గురించి ?"

అతనికేం చెప్పాలో తోచక "మళ్ళీ మామూలు మనిషిని అవుతానా కానా అని !"

ఆమె కాళ్ళక్రింద భూమి కదలినట్లయింది. "అలా అనకండి" అంది డగ్గుత్తికతో.

"శ్రీదేవీ !" అని పిలిచాడు.

"ఊ !"

"అటు బయటకు చూడు."

ఆమెకి అర్ధంగాక "ఏముందండీ అక్కడ ?" అని ప్రశ్నించింది.

"కావలసినంత వుంది. అస్తమించే సూర్యబింబాన్ని కప్పేసిన మేఘాలు, నన్ను చూసి నవ్వే గాలి, వెక్కిరించే వృక్షసమూహాలు."

శ్రీదేవికి గుండె బరువెక్కింది. దుఃఖం ఉప్పెనలా ముంచుకువచ్చింది.

"అబ్బా ! అలా మాట్లాడకండి బాబూ. మీకు పుణ్యముంటుంది." ఆమె గొంతు పూడిపోయింది.

మళ్ళీ నిశ్శబ్దం.

శ్రీదేవి కాస్త సంకోచిస్తూనే "ఇవాళ శనివారం కదూ. ఈ సాయంత్రం నేను దేవాలయానికి వెళ్దామనుకున్నాను. వెళ్ళిరమ్మంటారా ?" అని అడిగింది తలవంచుకుని,

"వెళ్ళిరా, సంకోచం దేనికి ?"

"మీరు ఇంట్లో ఒంటరిగా వుండాలని "

"పర్వాలేదు శ్రీదేవీ; తగ్గిపోయిందిగా "

"సరే. కాని మీరింకా నీరసంగానే వున్నారు. మంచంమీదనుంచి లేవవద్దు సుమా! నేను గంటలో వచ్చేస్తాను" అని శ్రీదేవి మరీమరీ చెప్పి బయల్దేరింది.

నిముషం వెనుక నిముషం గడిచింది. శ్రీధర్‌కి యిహ మంచంమీద పడుకో బుద్ధికాలేదు. నెమ్మదిగా లేచి కూర్చున్నాడు. వర్వాలేదు. తేలిగ్గానే వుందని పించింది. నిలబడ్డాడు బాగానే వున్నట్లు తోచింది. మెల్లిగా వడిచి కారిడార్‌లోకి వచ్చి గోడకి ఆనుకున్నాడు.

ఆకాశాన చిక్కగా మేఘాలు అలుముకుంటున్నాయి. పశ్చిమాద్రిన సూర్య బింబం పూర్తిగా మూసుకుపోయింది. వర్షం వచ్చే సూచనలు కనబడుతున్నాయి. శ్రీదేవి కాలినడకన వెళ్ళింది. తిరిగివచ్చేసరికి తడిసిపోతుందేమో! అతని మనసు ఆరాటపడ్డది.

అక్కడే నిలబడి యిలాంటి సమయంలో, యిలాంటి వాతావరణంలోనే తను

"పిల్లాడ్ని పుట్టనివ్వను" అనే అర్థం ధ్వనించేటట్లు చెప్పాడు.

పుట్టనూ పుట్టాడు; కాస్త పెరగనూ పెరిగాడు; నశించనూ నశించాడు.

"కాదు. నశించలేదు" ఏదో కంఠం కర్కశంగా అరిచినట్లయింది.

అతను ఉలికిపడ్డాడు. అవును. వాడి శరీరం నశించలేదు. తన వృత్తికోసం కళ్ళముందు వుంచుకున్నాడు. కాని యీ వృత్తికి నిర్వచనం వేరు. ఇది సరసత వున్న మనిషియొక్క వృత్తికాదు.

"నేను నశించలేదు నాన్నా. నేను నశించలేదు. నన్ను బంధించారు. లోషన్‌లో ముంచారు. అద్దాలగుండా అంతా చూస్తున్నారు. నా పెద్ద తలకాయ వాళ్ళ చూపులతో చిల్లులు పడుతోంది."

వారంరోజులు! అబ్బ! ఇంతకాలం గడిచిపోయింది. ఈ జీవితం తన శరీరాన్ని బంధించివేసింది. ఇన్నాళ్ళు తను ఎలా భరించాడు? ఎలా జీవించాడు?

ఆశ్చర్యం కాదు. అతని కంటినుండి రక్తపుచుక్కలవంటి నీటి బిందువులు రాలాయి.

"నువ్వు రాయివి, బండరాయివి."

మనసు పొమ్మని శాసిస్తోంది.

"శక్తిలేదు. శక్తిలేదు."

"అందుకే నువ్వు రాయివి, బండరాయివి."

"సరే కాని మీరింకా నీరసంగానే వున్నారు. మంచంమీదనుంచి లేవవద్దు సుమా! నేను గంటలో వచ్చేస్తాను" అని శ్రీదేవి మరీమరీ చెప్పి బయల్దేరింది.

నిముషం వెనుక నిముషం గడిచింది. శ్రీధర్‌కి యిహ మంచంమీద పడుకో బుద్ధికాలేదు. నెమ్మదిగా లేచి కూర్చున్నాడు. వర్వాలేదు. తేలిగ్గానే వుందని పించింది. నిలబడ్డాడు. బాగానే వున్నట్లు తోచింది. మెల్లిగా నడిచి కారిడార్‌లోకి వచ్చి గోడకి ఆనుకున్నాడు.

ఆకాశాన చిక్కగా మేఘాలు అలుముకుంటున్నాయి. పశ్చిమాద్రిన సూర్య బింబం పూర్తిగా మూసుకుపోయింది. వర్షం వచ్చే సూచనలు కనబడుతున్నాయి. శ్రీదేవి కాలినడకన వెళ్ళింది. తిరిగివచ్చేసరికి తడిసిపోతుందేమో! అతని మనసు ఆరాటపడ్డది.

అక్కడే నిలబడి యిలాంటి సమయంలో, యిలాంటి వాతావరణంలోనే తను....

"పిల్లాడ్ని పుట్టనివ్వను" అనే అర్థం ధ్వనించేటట్లు చెప్పాడు.

పుట్టనూ పుట్టాడు; కాస్త పెరగనూ పెరిగాడు; నశించనూ నశించాడు.

"కాదు. నశించలేదు" ఏదో కంఠం కర్కశంగా అరిచినట్లయింది.

అతను ఉలికిపడ్డాడు. అవును. వాడి శరీరం నశించలేదు. తన వృత్తికోసం కళ్ళముందు వుంచుకున్నాడు. కాని యీ వృత్తికి నిర్వచనం వేరు. ఇది సరసత వున్న మనిషియొక్క వృత్తికాదు.

"నేను నశించలేదు నాన్నా. నేను నశించలేదు. నన్ను బంధించారు. లోషన్‌లో ముంచారు. అద్దాలగుండా అంతా చూస్తున్నారు. నా పెద్ద తలకాయ వాళ్ళ చూపులతో చిల్లులు పడుతోంది."

వారంరోజులు....! అబ్బ! ఇంతకాలం గడిచిపోయింది. ఈ జీవితం తన శరీరాన్ని బంధించివేసింది. ఇన్నాళ్ళు.... తను.... ఎలా భరించాడు? ఎలా జీవించాడు?

ఆశ్చర్యం కాదు. అతని కంటినుండి రక్తపుచుక్కలవంటి నీటి బిందువులు రాలాయి.

"నువ్వు రాయివి, బండరాయివి."

మనసు పొమ్మని శాసిస్తోంది.

"శక్తిలేదు శక్తిలేదు."

"అందుకే నువ్వు రాయివి, బండరాయివి."

"జ్వరంగా వుంది. శక్తి చాలదు."

"చావవులే, రాళ్ళకి చావులేదుగా."

"రాళ్ళకి చావులేదుగా."

కాళ్ళూ, మనసూ ఏకమైనాయి; మస్తిష్కం పనిచేయటం మానేసింది. అంత చలిలోనూ చమటపడుతున్నాడు. "పోతాను, పోతాను."

....బంగళా పోర్టికోలోంచి ఎంబాసిడర్ కారు కదిలింది.

* * *

మ్యూజియంలోకి అడుగుపెట్టి, గోడకున్న స్విచ్ నొక్కాడు. హాలు హాలంతా విద్యుత్ వెలుగుతో నిండిపోయింది.

అదిగో తన.... అదిగో....! రెండడుగులు వేశాడు.

హఠాత్తుగా లైట్లు ఆరిపోయాయి. కరెంటు పోయినట్లుంది. అంతా చీకటి! గాఢాంధకారం. ఏమీ కనబడట్లేదు.

"బాబూ! ఎక్కడా!!!" హృదయం మూలిగింది.

"ఇదిగో నాన్నా. ఇక్కడ, ఇక్కడ నన్ను బంధించారు. ఊపిరాడ్డంలేదు."

"ఒక్క నిముషం. వస్తున్నా బాబూ." సెంటిమెంట్లకి అతీతులు ప్రొఫెసర్ శ్రీధర్. అడుగులు వేస్తున్నాడు తడుముకుంటూ, తడబడుతూ.

ఆ కారుచీకటిలో అతనిచుట్టూ అనేక రోగాలతాలూకు విచిత్ర, భయంకర చిహ్నాలూ స్త్రీలవి, పసిపాపలవి, వృద్ధులవి, గుండెజబ్బువి, కాన్సర్‌వి, క్షయ వ్యాధివి, సిఫిలిస్‌వి, ప్రైమరీస్.... వందలు. వందలు.... అతని సేకరణ.... మానసిక ఆస్తి....

"నాన్నా! నాన్నా! ఇక్కడ నాన్నా."

అతన్ని అన్నివైపులనుంచీ పిలుస్తున్నట్లుగా వుంది. అన్ని దిక్కులనుండీ వినిపిస్తోంది. దారి తెలియటల్లేదు. ప్రక్కకి పోతున్నాడు, ముందుకి పోతున్నాడు...

టక్....టక్....టక్ అడుగుల చప్పుడు.

"ఎవరది?" ఆగి అరిచాడు. తన అడుగుల సవ్వడే యింత భయాన్ని కలిగించాయా? అంతా నిశ్శబ్దం. మళ్ళీ కదిలాడు.

"నాన్నా! నాన్నా!!!"

పిలుపు జాలిగా, దీనంగా రక్తాన్ని పిండుతూ.

ఎవరిదో నవ్వు.

"ఎవరది?" మళ్ళీ అరిచాడు.

"ఇక్కడ నాన్నా! ఇక్కడ నాన్నా!!"

చేరుకున్నాడు. చేతులు ముందుకు చాచి అక్కడున్న గ్లాస్‌జార్‌ని తడిమాడు. అవుననే నమ్మకం కుదిరింది.

"నువ్వేనా నాన్నా!"

"అవును, నాన్నా!"

అనుకోకుండా అతని చేతులు దాన్ని పైకెత్తాయి; చాలా బరువుగావుంది. దాన్ని దగ్గరకు తీసుకోవాలనీ, కావిలించుకోవాలనీ ఆరాటం; చేతులు వణుకుతున్నాయి.

అంతకంతకూ దాని బరువు ఎక్కువవుతోంది. చేతులకు శక్తి చాలటంలేదు.

గుండెకి అదుముకుంటున్నాడు.చేతులపని అయిపోయింది.అవి దాహమన్నాయి.

ధగేల్‌మని చప్పుడు. "బాబూ!" అన్న అరుపులు వెర్రిగా.

దీపాలు వెలిగాయి. నిలబడి వొణికిపోతూన్న శ్రీధర్‌కి కనిపించింది– ముక్కలు చెక్కలుగా క్రిందపడివున్న గాజుపాత్రా, నలువైపులా కారిపోయిన ఫార్మలిన్, అందులో అప్పుడే చనిపోయినట్లు నిశ్చింతగా పడివున్న విచిత్రపు మాంసపుముద్ద....

శ్రీధర్ వొంగి కొడుకుని చేతుల్లోకి తీసుకున్నాడు. ఆ శరీరంవంక ఒక నిముషం తదేకంగా చూశాడు. "నీకు న్యాయంచేస్తాను." ఆరాటం మనసు ఉరకలువేసింది. అలా పిల్లవాడ్ని ఎత్తి భుజాలమీద వేసుకుని బయటకి నడిచాడు.

మ్యూజియంలోని ఒక స్పెసిమన్‌ని ఉన్మాదిలా కారులో పెట్టుకుంటూన్న ప్రొఫెసర్‌ని విచిత్రంగా చూస్తూ నిలబడ్డారు. అటెండరూ, వాచ్‌మేనూ. కారు కదిలి స్మశానంవైపు దారితీసింది.

* * *

కసితీరా కరువుతీరా అంతా చెప్పేసి భార్య వడిలో తలదూర్చి ఏడ్చేస్తున్నాడు శ్రీధర్. ఎంత హాయిగా వుంది ఏడుపు? ఎంత సుఖం!? శ్రీదేవి అతని జుట్టులోకి వేళ్ళుపోనిచ్చి రాస్తూ, మూగగా అశ్రుధారలు విడుస్తోంది.

రవ్వంతకూడా దాచకుండా అంతా చెప్పేశాడతను.

"శ్రీదేవీ! నేను మంచినాన్నని కావాలనివుంది. నేను మంచినాన్నని కావాలి." ఈనాడు పరిస్థితి యిలా పరిణమించకపోతే, యీ మార్పు సంభవించకపోతే తను చెప్పబోయే విషయాన్ని యిలా చెప్పేది! "నాకు ఎబార్షన్ చేయించండి."

కాని ఇప్పుడు ఇది వేరు. ఇది కొత్త చిగుళ్ళు. "మీకోరిక మరో ఏడు నెలల్లో" అతని చెవిదగ్గర మధుర మంజులమైన షెహనాయి వినిపించింది.

———




(గత సంచిక తరువాయి)

## 6

—: సన్నాసి చెప్పిన కథ :—

నా పేరు సన్నాసండి_ తమరిగోర్లా ళ్లు_ సన్నాసిగోడంటారండి.

నాదీ రాంపురమేనండి.

బుల్లిబాబు - ఎంకట్రమణ బాబుని అలాగే పిలుస్తారంఢి మరి_ ఆ బాబు కంటె నానే ఏడాదిపెద్దటండి. కొత్తామా సెల్లిన మూడ్రోజులకి పుట్టినా నటండి. నాను పుట్టిన నచ్చిత్రం అసలు

మంచిదికాదటండి. అంచేతే గావాల్ను- నన్ను కన్న ఎంటనే మాయమ్మ సచ్చి పోనాదిటండి. మరో మూడేళ్లకే, మా అయ్యకూడా పోనాడటండి. పుట్టినెంటనే [illegible] - పొట్టనెట్టేసుకున్నా డన్జెప్పి నన్ను సన్నాసిగోడన్నారటండి.

మరింక-మా దద్దే (పెత్తండ్రి) నన్ను పెంచినాడండి. ఇంతకీ మాలాటోళ్ళకి పిల్లల్ని పెంచడం ఏవంత కష్టం కాదండి. ఏటుందండి ? పందిపిల్లల్లా ఆళ్ళు బతికేస్తారండి. అసలాళ్ల నెవరూ పెంచరండి. గోసెట్టిన కాడ్నుంచి ఎవుడి బతుకు ఆడే బతికేస్తాడండి....

నాకో నాలుగు ముక్కలు అబ్బాలని మా దద్దకి ఆశుండేదటండి. అంచేత నన్ను అయిదో ఏట బళ్లో ఏసినారటండి. బడికెళ్లిన మూడోనాడో, నాలుగోనాడో పంతులు ఒక దెబ్బేసినాడటండి. పాపం! ఆతగాడి తప్పేటండి ? ఎంత జెప్పినా నాకు సదువు బుర్రకెక్కనేదటండి. కొట్టకపోడానికి నానేం నాయుడి కొడు [illegible] ? [illegible] అండి ? ఆ దెబ్బకి జనుప ఊష్టం (జ్వరం) వొచ్చేసినాదటండి నాకు.

[illegible]

మనకి సదువు అబ్బనాదన్జెప్పి-నాసేత బడి మానిపించేసినాడటండి మా దద్ద. నాను మానేసిన పదిరోజులకి పంతులే వొచ్చి - సొయానా నన్ను తీసికెల్లినా రటండి. ఈపాలిమాత్తరం-పంతులుగోరు కొట్టకుండానే మళ్ళీ వొచ్చేసినాదటండి నాకు మాయదారి ఊష్టం. యీ పాలి మాత్తరం- సివంచలం కొండెక్కించి- గుండు గీయిస్తేగాని పోనేదటండి. మరింక మరోసారి పంతులొస్తే నన్ను మావోళ్ళే- దాచేసినారటండి.

సదువెలాగూ లేదన్జెప్పి- నన్ను సిన్నప్పుడే బుల్లిబాబుగోరి యవసాయంలో ఎట్టేసినారండి. అక్క - కూడెట్టేవోరండి. గుడ్డిచ్చేవోరండి. ఆళ్ల పశువులపాకలో తొంగోనిచ్చేవోరండి.

సిన్నప్పుడు గొడ్లు కాసేవోణ్నండి. పేడలు తీసేవోడ్నండి. కుసింత వొయసొచ్చినాక నీళ్లు మోసేవోడ్నండి. బుల్లిబాబుకి నలుగెట్టి తలంటేవోడ్నండి. ఆళ్ల యింట్లో మనిషిలాగే-మెలిగేవోడినండి.

బుల్లిబాబుగారిల్లు ఊరికి వొంద పగ్గాలుంటాదండి. మూడెకరాల మావిడి తోట- మద్దెన గుళ్లో లింగంలా- కుదిమట్టంగుండేదండి ఆరి మేడ. ఆ మావిడితోట పక్కనే ముప్పై ఎకరాల మాగాణి అండి. అదిగాక అక్కడో ముక్కా- యిక్కడో సెక్కా కలిపి మరో ముప్పై యకరాలుంటాయండి.

స్మసేనం యెనక-ఆరెకరాల కొబ్బరి తోటా ఆరిదేనండి. అది నానేసిన్దేనండి. యిప్పుడెలాగుందంటారేటి ? వొయసొచ్చిన ముదర పెళ్లికూతుర్లా-నువ్వా ? నేనా ? అన్నట్టుందండి. దానిమీదొచ్చే డబ్బుతో మూడు ఎమ్మెల్యే ఎలకన్లు గెలిసేవొచ్చండి.

బుల్లిబాబుగా రొక్కరే అని జెప్పి నానుగదండీ. అంటే, ఆ బాబుకి తోడ బుట్టినోళ్ళు ఎవురూ నేరన్నమాటండి. కానై తే నేవండి? ఇల్లంతా ఎప్పుడూ జనవేఁనండి. గడియో, చెణవోఁ-బేండు మేళం వోళ్ళ వస్తారన్న పెళ్ళి ఇల్లులా గుండీదండి. ఇంటి ముంగల పాతిక సెంట్ల పందిరెప్పుడూ ఉండాలండి. పెతీ ఏడూ దానికి కొత్తకమ్మ నెయ్యాల్సిందే నండి.

ఆ పందిరి- దాన్నమ్మ-ఎంత సల్ల గుండేదంటే- ముష్టోడన్నా సరే, మిని ష్టెరైనా సరే- అందులో కాలెట్టినాడంటే- కునుకు ఒచ్చివాలసిందేనండి.

తాసీల్దారుకాడనుంచీ తా బే దా రు వోరకూ- మా ఊరు కేంపొచ్చిన పెతీ ఆపీసరుకి భోజనం మా యింటినుంచే ఎళ్లాలన్నమాటండి.

ఊరికి- అగ్గొచ్చినా - వొరదొచ్చినా- సరే మా మాలోళ్ల కూడు ఆ యింటికాడే నండి.

ఇక, సదువండి - బుల్లిబాబు బియ్యే వొరకూ సదివినాడండి.ఆకరి సంవత్సరం సదువుతుండగా - ఆరి అయ్యాపోతే - సదువు మానీసి నాడండి. సదూకుండీ రోజుల్లోనే ఓపాలి సత్తాగ్రెహంవోఁ యేదో జేసి - ఆ బాబు అర్నెల్లు జైలు కెళ్ళినాడటండి. ఆ బాబు సిన్నప్పటి నుంచీ - కద్దరే కట్టీవోడండి. సదువు మానీసినాక పెంట్లాలు-మానీసి పంచెల్లోకి దిగినాడండి కానీ, ఆ బాబు పెంట్లాం, సొక్కా ఏసుకుంటే - ఎలాగుండీవో డండీ?- నెహ్రూబాబు సిన్నప్పుడు యిలాగే వుండీవోడనిపించీదండి - సూసి నోళ్ళకి.

యింకాడోళ్ళు- సరే సరండి-ఆ బాబు యీదంతెళ్ళావుంటే- మరియాదకి లోప లికి తప్పుకున్నా కిటికీలకి- యేం పడి పోయీ వోరండి.

అయితే మాత్తరం, మా బాబు అగ్గి నిప్పండి. ఓ సిన్న సంగతి మనవిజేస్తా నండి. అదివింటే తఁవఁరుగోరికే - అరదవఁయిపోద్దండి - ఆ బాబెలాటోడో!

అప్పటికింకా - ఆ బాబుకి పెళ్లికానే దండి. ఆరి అమ్మ, అయ్య యింకా బతికే వున్నారండి. మా బాబుగోరి కుటుంబానికీ బుగతగోరి కుటుంబానికీ "అగ్గి - గాలీ" స్నేహితవండి.

ఇదిగో పసుపు అంటే అదుగో మునుగని పాపం మనువైఁన మూన్నెల్లకే - బుగతగోరి మూడో కూతురు ముండమోసీదండి రంగుకి యెల్లావులాగున్నా, కావఁరానికి మాత్తరం తోటపెద్దులా గుండీదండి. ఆ యమ్మ జుత్తు మోకాళ్లవొరకూ వొచ్చీదండి.

ఆ యమ్మని సూస్తే, తకుక్కవ కుల పోళ్ళం-మాలాటోళ్లకే- కొబ్బరిబొండాం తాగీసినట్టు తాగెయ్యాలనుండేదండి.

కళ్లల్లో సెందురుళ్ళ నెట్టుకొని, తడి

కోకతో, బంగారంలాంటి బిందెతో నూతి కాఖ్నుంచి – యిలా-ఆరో నెల సూల్తో వున్న అవులా మందంగా నడిసొస్తా వుంటే, ఎవుడన్నా సరే – ఆకరికి గాందీగోరులాటాడికన్నా సరే – మరో పాలీ– మరో పాలీ జూడాలనిపించీదండి.

అలాటమ్మేగాని, పిలిస్తే పొలుతాగీ వోపు కాద్నుంచీ – పళ్లూడిపోయిన వోడి వౌరకూ – వౌరసగా "హ్యా" నిలబడి పోతారన్నమాటండి.

కా నాయగిమ్మ మాత్తరం అటువంటిది కాదండి.

సచ్చిన మొగుడి ఫొటోకి పూజెయ్యడ్డే – పచ్చి మంచినీళ్లన్నా ముట్టేదికాదండి. కానీకీ, పున్నానికీ కటిక ఉపోసాలుండీదండి.

ఓ పాలి–ఆయమ్మ బావే–యింజనీరో ఏదో అట, సూడ్డానికి సినీమా "యీరో" లాగుంచేవోడు. అతగోడు – ఓపాలి ఆమె కొంగట్టుకుంటే – సెప్పులేక – సేత్తోనే పళ్లూడగొట్టీసిందట.

కాని ఎన్నాళ్లుంటాదండి అలాగ. పగలు యెన్ని పూజులుజేసినా – రేత్తిరి సచ్చిన మొగుడు పక్కలోకి రాడుకదండి. అలాటోళ్లు– కడుపుకి పస్తులెట్టినా, వరుపుకి వస్తులుయెట్టనేరు కదండి. తప్పు ఆ యమ్మది గాదండి– వౌయసుదండి. మరింక వౌయసు బాద తట్టుకోనేక – ఓ పాలి – అరదరేత్తిరి నూతిలోకి గెంతేసినాదండి.

సరిగ్గా– అదే టయాంకి బుగతెందుకో లెగిసినాడు కాబట్టి సరిపోనాది గాని నేకపోతే ఆ యమ్మ నీటిసావు సచ్చీసీదండి.

నా నోటి జెప్తాను, యినుకోండి– అసలు మరోలాగ అనుకోవొద్దు– బాబూ– బాబూ, అలాటమ్మల్ని – బతికించకూడదండి నూతిలోనో గోతిలోనో పడి సావైనా – సవ్వనివ్వాల. లేకపోతే మరో మొగుడ్ని తేవాల. అంతేగాని మొగుడ్నీ తేక – సవ్వానివ్వక – ఆ యమ్మ నలాగుండమనడం తానా పాపం బాబూ.ఏటో! మీలాటోళ్ళ కన్నా మాలాటి తక్కువ కులపోళ్ళవే నయం అండి. మొగుడు సస్తే మూణ్నెల్లు తిరక్కుండా మారు మనువు జేసిపారేస్తాం.

అవునూ, నాను ఏటి సెప్తున్నానూ? బుల్లిబాబు కతలోంచి బుగతగోరి బొట్టె కతలోకి ఎలిపోనానండి. అంతే బాబూ – మాలాంటోళ్ళం– అదే మీలాటోళ్లైతేనా– సావుకలోరు పాంకోళ్లతో నడిసినట్టు– టకటకా జెప్పేస్తారండి.

ఓనాడు

మా బుల్లిబాబుగోరింట్లో – అంతా సివంచలం సెందన యాత్తర కెల్లిపోనారండి – ఒక్క బుల్లిబాబు తప్ప.

ఆ సాయంతరం నాను కిందున్నానండి.

బుల్లిబాబు మేడమీదున్నాడండి.

యీలోగా వొచ్చినాదండి బుగతగోరి బొట్టె.




పొద్దుగూకింది.

అప్పుడాయమ్మ సెంపే రాసుకుందో, సెందనవేఁ రాసుకుందో గానండి- వొళ్లు గుమగుమ లాడిపోతున్నాదండి. నాను బిట్టకట్టినాక ఆయమ్మ మా మేడెక్కడం జూడలేదండి.

"పెద్దయ్యగారేర్రా? అమ్మగోరు ఉన్నారా?" అని అన్ని యివరాలూ అడిగినాదండి. ఆ యెనక బుల్లిబాబుగోరి కాడికి – మేడమీది కెళ్ళినాదండి.

ఎక్కినమ్మ ఎక్కినట్టూ – ఏవఁష వఁన్నా కాందే- మేడదిగి ఎళ్ళిపోనాదంటి కొంగుతో కళ్లు వొత్తుకుంటూ.

"యిదేట్రా బగమంతుడా" అని నాను శానా యిదై పోనానండి.

మరింకేటుందండి? తెల్లారీసరికి ఆ యమ్మ శెవం సెర్లో – తావఁరపువ్వుల మద్దెన కలవపువ్వులా – తెల్లగా తెప్ప తేలిపోనాదండి.

## 7

మా బుల్లిబాబు గాందిగోరి శిస్యు డన్చెప్పినాను కదండి. కద్దరే కట్టేవోడని గూడా జెప్పినానా? అతగోడి బుద్ది దరమ బుద్దండి. ఎప్పేటు సేతికొచ్చినాక సదువు మానీసినాడని జెప్పినాను గదండి.

"ఓసోస్, యిలాంటి గాందీబత్తుల్ని బుర్రమీదెన్ని ఎంట్రుకలున్నాయో అంత మందిర్ని సూసినాం. కాలంలో వున్నోడి సేతల ఆస్తి కర్పూరబిళ్లే. ముప్పై పెట్టిల్లో పెట్టినా- అరించుకుపోద్ది" అన్నా రండి ఊరుపెద్దలు- అళ్లయ్యన్నీ దురా లోసనలేనండి.

అసలు మా బాబెలాటోడో తెల్దు మీకు.

పరాయోడి పైసా పూజ్జేసిచ్చినా ముట్టుకోకూడదు.

పరాయోడి పెళ్లాం పరాయోడికే పెళ్లాం.

ముందుకెళ్లాలంటే "మందు" ముట్టకోకూడదు.

పేకాడీవోడు పైకెళ్లడు.

ఒకరికి పెట్టింది మనకి వొడ్డీతోసహా ఒచ్చేస్తాది. ఇలాగుండీయండి–ఆ బాబు అలో సెన్లు.

ఊర్లో ఏ ముష్టోడికి ఒళ్లు సాలొచ్చినా ఆ బాబే ఆస్పత్రిలో జేర్పించాలన్న మాటండి.

కూలోళ్ల కొంపలు కాలిపోతే అన్నదానం ఆ బాబే సెయ్యాలండి, మరోడి కాడ అద్దెడు బియ్యంకూడా అడక్కుండా.

మునసబింట్లో పెళ్లైనాసరే, మాలాడింట్లో పెళ్లైనాసరే – పిలవాలేగాని – ఆ బాబే వెళ్ళేవోడు. ఆ బాబొస్తే ఏ పెళ్లి పందిరన్నాసరే గేసునైటునా గెలిగిపొయ్యేదండి.

ఓ పాలి.... ఆ బాబు పొలాల్లో–

నూర్పులౌతున్నాయ్.

నూర్పులంటె బండెడూ, గరిసెడూనా– ఆ బాబు దాన్యం అడ్డానికే–పెత్యేకంగ – ఓ మిల్లు ఉండిపోవాలన్నమాట.

పసువులు సరదాగా తొక్కు–తున్నాయి –గింజల్ని.

"సంతకెళ్లాల. మాం – బేగెళిపోతాం" అన్నారండి కూలీలు– ఆడకూలాళ్లు, ఏటి సేస్తాం? కాదన్లేం కదా? సరే పొమన్నానండి.

ఆళ్లెళ్లావుంటే ఎందుకోగాని అఫేష జూసినానండి యెంటనే యెర్రికోపం వచ్చేసినాదండి కూరవమ్మని – వొారసకి నాకు సెల్లెలొద్దండి–దాని కొంగుని మూట అగుపడినాదండి.

కొంగిప్పమన్నానండి.

"ఏప్పేదు పోనియ్యన్నా" అని బతిమిలినాడినాదండి

"ఇప్పుతావా? నాలుగెయ్యమన్నావా?" అని కర్రెత్తినానండి. ఇలా టిషయాల్లో సుట్టరికాలు సూసుకోగూడదు కదండీ–

మరిక తప్పదని – యిప్పినాదండి కొంగు.

సేరు గింజలు రాల్నాయండి.

నాకు శివమెత్తిపోనాదండి.

"కడుపుకి సేకపోతే ఆ బాబుని అడుక్కో–వాలగాని యీ దొంగపనెందుకే తప్పుడునంజా!" అన్జెప్పి కొప్పట్టుకొని యీడిసికెళ్లి బుల్లిబాబు కాళ్లకాడ బడేసినానండి.

ఆ బాబు నన్నోపాలి – ఎగాదిగాజూసి "నాను సూసుకుంటాను, నువ్వు పోరా" అని నన్ను తగిలేసినాడండి.

ఆ మాయదారి ముందేం సెప్పిందో– యీ బాబేటి యిన్నాడోగాని నన్ను పిలిసి దానికి కుంచెడు గింజలు కొలిపించినాడండి.

నాను తెల్లబోనానండి.

అదెళిపోనాక "అది దొంగముండ" అన్నానండి.

అందుకా బాబు చిన్న నవ్వోటి నవ్వి, "దొంగ కానోదెవ్వడ్రా? నిజానికి యీ ఊరికి నానురా గజదొంగనీ" అన్నాడండి.

అలాంటి చరమబుద్ధండి ఆ బాబుది. అందుకే సూద్రోడైనా [illegible]నోళ్లసేత మొక్కించుకునీవోడండి[illegible]

దేశానికి గాందీ [illegible], మా వూరికి ఆ బాబు అలా[illegible]చీదండి మా అందరికీ.

ఊర్లో ఏ తగువొచ్చి[illegible]గుడు, పెళ్లాం తగూకాడ్నించీ [illegible]డుకుల తగువు వరకూ, ఏద్దై[illegible] బాబు తెగ్గొట్టవాలసిందేనండి.

"కోరటుకెక్కినోడూ, [illegible]గాడిదెక్కినోడూ ఒకటేరా" అనీవోదండి యెప్పుడూను.

"ఎవుడి గొప్పైనా పెళ్లయ్యేవొరకే పెళ్ళవనీ ఇతగోడి పెద్దరికం ఎన్నాళ్లుంటాదో సూద్దాం" అనీవోరండి గిట్టనోళ్ళు.

కాని ఆ బాబు పెద్దరికం పెళ్లైనాక పెరిగినాదేగాని తరగనేదండి.

కాంతమ్మగోరిది — అంటే — బాబు బార్యాగోరిది — యిజానగరం అవతల అగ్గురోరవండి. ఆ యమ్మా - కన్నోరికి ఒక్కర్తేనండి. అగ్గురోరం సగం - ఆళ్ళదేనండి.

ఆ బాబుకి నానంటే పేనం. ఎక్కడకెళ్ళినా సరేనండి పొద్దుటిసీడనాగ - నాను ముందుండవాలసిందేనండి.

నన్నూ తీసికెళ్లినాడండి తన పెళ్లికి.

"ఆడు నా తోడపెళ్లికొడుకు" అనీవోడండి అందరకీ - నన్ను సూపెట్టి.

"ఒరేయ్ - నువు నూలుపంచె కట్టినావ్. నాను జెరీపంచ కట్టినాను. నేకపోతే నువ్వే పెళ్లికొడుకనుకుంటార్రా అంతా" అన్నాడండి నాతో.

పెళ్లికి నాలుగు పంచలిచ్చినాడండి. "నా బతుక్కి బనీన్లు సాలు" అని మొత్తుకున్నా యినకుండా, నాలుగు సొక్కాలు కుట్టించినాడండి. అత్తోరిసేత జరీపంచ కూడా ఎట్టించినాడండి.

"ముష్టోడికి ముత్తెం ఉంగరవఁని" నాకెందుకు - జల్తారు పంచె ఒద్దన్నానండి.

"ఉండనీరా - పెళ్లికి సోకుజేద్దువుగాని" అని అసికం అడ్నాడండి.

ఆ బాబు_తనకి_పెళ్లైన మూణ్నెల్లకే నా పెళ్లి జరిపించేసినాడండి. మా యాడదాన్ని కాంతమ్మగారూరేనండి.

నాకు తొలిసుట్టు బొట్టెకు - పుట్టినప్పటికి కాంతమ్మగోరికి సీవంతం జేసినారండి.

"మొత్తానికి నాకన్నా నువ్వే నయ్యెంరా" అన్నాడండి ఆ బాబు_నబుజమ్మీద సెయ్యేసి.

వాళ్లమాలిన సిగ్గేసిపోనాదండి నాకు

ఏటి బాబూ? "కట్టుకున్నదానికే కట్ట

బడుండిపోనావా?" అనడుగుతున్నారా? కట్టుకున్నదాన్తోనే కాపరంజేసే వోపిక వుండదండి మాలాటోళ్ళ*- ఇంక మరో కర్తి కూడానా అండి మాయి బతుకులకి? యింతకీ మందం సంగతి ఆలోసించ డానికి-టయాం వుంటాదేటండి మాకు?

ఒకేళ వున్నా- మరొకర్తి కాడకెళ్ళినా - మాఁవుఁ మీలా పెళ్ళాల్ని పుట్టిళ్ళ కంపకం ఎట్టీవండి.

నా సంగతెందుకు గానండి —

బుల్లిబాబుగోరు మాత్తరం- పెళ్లానికి కట్టుబడిపోనాడండి.

కాంతమ్మగోరు కూడా - శానా మంచి మనిషండి.

బగమంతుడంటే బత్తండి.

బర్తంటే కుసింత బయం తక్కువనే జెప్పాలండి.

నెలకి పదేన్రోజులు పూజగదిలోనే వుండిపోయీదండి ఆ యమ్మ. మిగతా పదేన్రోజులూ - మంచంమీదుండిపోయీ దండి. పాపం ఆ యమ్మకి ఉబ్బసవండి.

మరింక - ఆ యమ్మ ముత్తేల్లాంటి ముగ్గురు పిల్లల్ని ఎలా కన్నాదో- యిసిత్తరంగానే వుంటాదండి.

అయమ్మకి లేనోళ్లంటే శానా జాలండి.

ఆరింటికొచ్చినోడు- ఎవుడన్నాసరే- ఉత్తిసేతుల్తో తిరిగెళ్ళలేదండి.

ఆ యమ్మ సెయ్యని పూజనేదండి.

మొక్కని సెట్టూ, పుట్టా గూడా నేవండి.

ఆ యమ్మ బతుకంతా పూజలూ, నోవుఁలూ, కొబ్బరికాయలూ, కర్పూరాల తోనే తెల్లారిపోనాదండి.

అయితే అయ్యన్నీ ఊరికేపోనేవండి.

ఆ యమ్మ కాలెట్టినాక మా బాబు దశ- పాలకుండలా-పొంగిపోనాదండి. పుచ్చు గింజలు పాత్తే పుట్లకొద్దీ పండీసీయండి పొలాలు.

ఆళ్లకి మొదట్లో పసందైన జటకా ఒకటుండేదండి. లోపల పట్టుపరుపులూ, సిలుకుతెరలూ నండి. అది గుర్రం కాదండి-పంచకల్యాణి అండి. దాన్ని ఆ యమ్మ-కన్నోరికాడనుంచి తెచ్చుకున్నా దండి. ఆయమ్మే యెట్టాలండి, దాణా దానికి మాలీసు నానే జేసేవోడినండి. దానికి కనువుఁనాడు - ఉడుకునీళ్లు తాన్న వాడించి - కుంకవెట్టి-, హారతిస్తే - యుద్దానికెళ్ళే యువరాజునాగ ఉండేదండి ఆ గుర్రం.

నరిమిలా- మా బాబు జీపు కొన్నాక, జటకా అమ్మేసినాడండి! కాని గుర్రాన్ని అమ్మనివ్వనేదండి ఆ యమ్మ.

"నాతోటే వొచ్చింది. నా తో టే పోవాల" నీదండి.

సెప్తే నమ్మరుగానండీ, మాయమ్మ రేతిరిపూట- పోనాదండి. ఆ రేత్తిరి గుర్రాన్ని జూసినోళ్లు నేరండి. తెల్లారి సూస్తే ఏవుందండి? సాల్లో నచ్చి పడున్నాదండి గుర్రవుఁ!

ఆ యమ్మ సెప్పినట్టే యిద్దరూ ఒక్కపాలే ఎలిపోనారండి.

అంత సల్లని తల్లిని మరి సూడవండి.

ఆయమ్మ సూపు తగిత్తే సాలండి— సచ్చిన సెట్టుకూడా సిగిరెట్టేసీదంది.

ఊళ్లో ఎవరి పెళ్లైనా సరేనండి— ఆ యమ్మ కొత్తకోక యెట్టవాలసిందే. ఆ కోక్కట్టిన ఆడకూతురు కంట నీరెట్ట కుండా కాపరం జెయ్యవాలసిందే— అది రూలేనండి.

హరివిల్లులాగుందీదండి ఆ యమ్మ నవ్వు.

ఏవైతే నేం— ఎన్నుంటేనేం— ఆ యమ్మకి ఆయుసు యివ్వనేదండి— ఆ మాయదారి దేవుడు.

ఆయమ్మ పోనాక—మాబాబు పిచ్చెత్తి నట్టైపోనాడండి— చాల్నాళ్లు— కొన్నేళ్లకి గాని తేరుకోలేకపోనాడండి.

ఆయమ్మ పోయిన పదో రోజు కాడ్నించీ— యింటిమీద పడిపోనారండి— సుట్టాలూ సుట్టుపక్కలాళ్లూను — మావు పిల్లనిస్తావంటే — మావు పిల్లనిస్తావని. కాని నాను ముందరే మనవిజేసినాను గదండి— ఆ బాబు గాంధీగోరి శిష్యుడని.

మరింక ఆ బాబు ఏ ఆడదాని వేపు కన్నెత్తి సూడ్నేదండి.

## 8

అప్పుడు— మా బాబుకి పెళ్లైన కొత్త రోజులండి....

ఓపాలి— జిల్లా హోల్ మొత్తం కాంగిరెసోళ్లంతా జీపులేసుకుని దిగిపో నారండి మా ఇంటికి. సంగతేటంటే— ఆళ్లకి ఢిల్లీ నుంచి కబురొచ్చినాదటండి— యీ బాబు నెలాగైనా ఒప్పించి— కాంగి రేసు టిక్కట్టు ఇయ్యమనీ, ఎమ్మెల్యేకి నిల్చోమని సెప్పమనీ.

ఆ టిక్కట్టు కోసరవని— అప్పటికే ఎవురో ఇద్దరు కొట్టుకుసత్తన్నారండి. అందులో ఒకడు మూడుసుట్లు ఎమ్మెల్యే జేసి నాలుగు మేడలు కట్టేసినాడటండి. ఇంక రెండోవాడు ఒక సుట్టు న్నా ఎమ్మెల్యే జేసి ఒక్క మేడన్నా కడదా వన్న ఆశ మీదున్నాట్టండి.

ఆళ్లలో ఎవుడికి టిక్కట్టు యియ్యక పోతే ఆడెళ్లి అపోజిషన్లో కలిసిపోతా నన్నాడటండి. యిద్దరూ యిటీసనులే నటండి.ఆళ్లిద్దరూ ఏ సవుద్రంలో దిగినా పరవానేదు— బుల్లిబాబునే నిల్చోపెడవా రని— ఢిల్లీ బాబుల ఉద్దేశవంటండి.

అది— ఓపాలి ఆ బాబులంతా దిగిపో నారని సెప్పేను గదండి. ఆళ్లందరికీ "కేఫీ"లూ, టిపిన్లూ అందించేసరికి — పాడిగేదంటే పాల్తల్లి అనుకున్నారేటి? అడిగినప్పుడల్లా పిండడానికి—మూడోపాలి పొదుగుకాడ కెళ్లి జూడండి — మూతి పళ్లురగదంతాది — నా పేనం సాలొచ్చేసి నాదండి ఆళ్లకి "కేఫీలు" టిఫిన్లూ— సరఫరాజేసీసరికి.

ఇంతకీ ఆళ్లు మాబాబుతో ఏటిజెప్పినా రంటే —నీకెలా తెలిసినాదిరా అంటారా?

నాను అక్కడే వున్నాను కదండీ—నా అవీ యివీ అందిస్తూ....'నువ్వు నిలోస్నిక పోతే ఏ కమ్యూనిస్టోడో - గెద్దనాగ - తన్నుకుపోతాడు సీటు. పోనీ ఈ దేవుళ్లాడీ యిద్దరెదవల్లో ఒకడికి పారేద్దామంటే యిద్దరూ యిబీషణులే, మరింక నువ్వు- బాబ్బాబు నిలోస్నిక తప్పదు" అన్నారండి అళ్ళంతాను.

అందుకు మా బాబేటన్నాడో ఎరికా?

"మీ సీటు రషియావోడట్టుకుపోయినా సరే చెయినావోడు తన్నుకుపోయినా సరే నా కొకటే—నాకీ రాచకీయాలొద్దు. అసలు నిజెంగా దేశాన్ని ఉద్దరించాలనుకుంటే ముందు ఊర్ని ఉద్దరించాల, ఊర్ని ఉద్దరించాలనుకుండీవోడు ముందు తనిల్లు ఉద్దరించుకోవాల. ఇదీ నా "తీరీ" అన్నాడండి మా బాబు.

ఇనోళ్ళంతా నోళ్ళెళ్ళబెట్టేసినారండి. ముక్కుమీద ఏలేసుకున్నారు. ఏటీ ఎర్రిగొల్లోడు? ఎమ్మెల్లే యిస్తావంటే వద్దంటాడని.

అందుకే ఆ బాబు గొప్పోడన్నాను.

వచ్చినోళ్లంతా ఏటి జేసేరా? ఏవుందీ చెయ్యడానికి?

తెచ్చిన పువ్వుల దండలు బుజాల మీదేసుకొని జీపులెక్కి యెళిపోనారు— యీ బాబుకి దండల దండుగెందు కనుకున్నారో— యేటోగాని.

అళ్లు రాకముందు - బుల్లిబాబు మా ఊరికి పెద్ద. అంతే....

ఆ ళ్లెళిపోనాక - ప్రెమ్మిడెంటైపోనాడు.

ఊరికో బుల్లిబాబూ, దేశానికో గాందీగోరూ వుంటే, నా సామిరంగా మరింకేటి? దేశం, సొరగం అయిపోదూ? అన్నారంతా.

అసలీ బాబుకేటి కావాల?

ఏటీ ఒద్దు.

ఆ బాబుకి?

ఆస్తొద్దు—అంతస్తు అంతకన్నా వొద్దు.
పదవొద్దు - పరపతొద్దు.
ఆడదొద్దు - మందొద్దు.
ఎమ్మెల్లే వొద్దు - ఎంపీ వొద్దు.
రాచరికం వొద్దు - రాజకీయం వొద్దు.
సరదా వొద్దు - సరసం వొద్దు.

బూడిద రాసుకున్న ప్రెతీవోడూ బైరాగి కాడు. కాని యీ బాబు మాత్తరం బూడిద రాసుకోకపోయినా బైరాగే.

ఆ బాబుకి ముందుసూపుంది.

యెనకాలోసెన కూడా ఉంది.

ఆ కాంగిర్సోళ్లు అలాగెల్లినారో - నేదో, యీ బాబు యిలాగ రంగంలోకి దూకీసినాడు.

"ముందు మనూర్ని బాగుజేస్తే సాలు" అంటూ.

అసలా మాటన్నా ఎవుడంటున్నాడు బాబూ - యింకా—యీ రోజుల్లో? తవఁరు గోరేవఁనుకోకండి. యియ్యాల ప్రెతీ ఎదవ, "నాను బాగుపడాల" అనేగాని "అయ్యో పక్కోడి సంగతేటి?" అవి సూస్తున్నాడా?




అంతెందుకు బాబూ? మనకి యింత మందిరి ఎమ్మెల్యే లున్నారు. అంత మందిరి ఎంపీలున్నారు.

ఎదీ, ఓ మంతర్సానిముండ టాన్సపరు సేయించమనెత్తే – "నువ్వొస్తావా? నీ కూతుర్నంపుతావా –" అనడిగేరకవేఁగాని మరో రకం ఉన్నారా?

మా ఊరికాడ – ముందపేడు – బొడ్డేరుకి – అదేటీ? బ్రిడిజి కట్టినారండి. దాని కాంట్రాక్టరెవుడూ? మన యం.పి. గోరి బావమరిదేనండి. మొదటి వారసానికే మొత్తం బ్రిడిజి – అంతా కొట్టుకు పోనాదండి. అసలు పునాదులెక్కడేసినారని ఎవుడో – నాలాంటోడు అడిగితే కాయితాల మీద ఎతికినార్ట – ఎక్కడేసేవాం అని.

అంతెందుకు బాబూ – మాపక్కూళ్ళో మూడేళ్ళ కిందట సూక్కులు కట్టినారండి. అదెవడు కట్టినాడనుకున్నారూ? ఎమ్మెల్లే గోరి ఎలిడిసిన మేనల్లుడు. ఏదో, మన గుంటలకి నాలుగు ముక్కలబ్బుతాయి కదాని అంతా తెగ సంతోసపడిపోనారండి. కానా సంబరం సల్లారిపోడానికి ఎంతో టయాం పట్టనేదండి.... ఏడు వారదా నేదు, వారసం నేదు – కానైతే ఓ పాలి పొద్దుగూకేక, కుసింత గాలేసినాది. అంతే. పిట్టాబాబూ కాలం కాని కాలంలో యీ గాలీ అనుకుని ఎవురి కొంపల్లో ఆళ్లు తొంగున్నారు.

తెల్లారి సూద్దురూ! ఊరికి ఓ పక్క ఏటో బోసిగా అనిపించినాదట, సంగతేటా అని ఊరంతా అనుకుండీ ఒయ్యాలలో ఒ సంటాడు సప్పుట్లు కొడుతూ మా సూక్కులు పడిపోనాదోచ్ అనిగెంతినాడట.

అందరి గుండెలు ఒక్కపాలే సల్లబడిపోనాయట. యింకా నయ్యం. అది రేతిరైంది కనక మూడు గాడిదల సావుతో సరిపోనాది - గాని - నేపోతే ఊరి గుంటలంతా అయ్యోర్లతో సహా సచ్చిపోయివోరు.

అదండీ బాబూ మన సంగతి.

యిక - మా బాబు రంగంలోకి దిగేటప్పటికి మా వూరి పంచాయితీ గతేటంటారేటి ?

"ఇదేటి పంచాయితీ ఆపీసా ? పాకీదొడ్డా ?" అనుకుండీవోరంతా.

అనుకోవడవేఁటి ? ఆ మాటే అడిగీసినాడు ఓపాలి సడన్‌గా సైకిలు మీద దిగిన డిప్ర్యూటీ కలక్టరు - ఒకడు.

"వొరిజినల్‌గా పాకీదొడ్డే సార్. స్థలం లేక అందులోనే ఆపీసు కట్టినారు" అన్నాట్ట ఓ మాల మెంబరు.

"నువ్వు మెంబరుగాదు - ప్రెసిడెంటు అవ్వాలిసిన వోడివి" అన్నాడట ఆ కలక్టరు.

"నిజవేఁ మరి" అన్నాడట ఆ మెంబరు.

పొత్తిరిపూట ఆపీసు అరుగులమీద గాడిదలు తొంగుండీవండి. ఆ దొడ్లో కాంపౌండులో పరుగుకి తొంగుండీవోరండి.

రోడ్లమీద ఎక్కడ సూడండి - పెద్దపెద్ద గుంటలూ - గుంటలనిండా పందులూను. సుబ్బరవైఁన రోడ్డెయ్యకూడదా అని మీలాటి బాబులెవరన్నా అడిగితే

"గుమస్తాల జీతాలకే సాల్దంలేదు డబ్బు. గవర్నమెంటు కాడ అప్పు తెస్తన్నాం" అనీవోడండి ప్రెసిడెంటు.

పట్టుకెళ్తన్న పన్నులన్నీ ఏవైపోతున్నాయి అని అడిగేవోడో లేకపోనాడండి.

"రోడ్లేయిస్తాం, సెరువులు తవ్విస్తాం" అని గవర్నమెంటుకాడ డబ్బు తేడం, నలుగురూ పంచుకొని తినీడం. అంతేనండి పని.

పంచాయితీ ఏ పని చెయ్యకపోయినా పారిటీలు మాత్తరం రెండుండీవండి.

రెండు పారిటీలవోళ్లూ - ఒకళ్ళమీదొకళ్లు కోడికేసో, కుక్కకేసో ఎట్టుకోడం కోరటు సుట్టూ తిరిగి గుమస్తాల్నీ, ప్లీడర్లనీ మేపడం. ఊర్ని సెడిపీటం.

ఇదండి వొరస.

ఏ పండక్కో, పబ్బానికో ఏవుడన్నా - సరే - ఓ సుక్కేసుకుంటేసాలు-అవతల పారిటీవోడు వచ్చీసి యీడి పెళ్లాన్ని బైటికి నాగి, కన్నోరింటికి అంపించీసి, దాన్నేత మనోవర్తికి కేసెట్టించీడం - యీ కేసు తేలీలోగా ఆదొకర్తినీ, అదొకడ్నీ తగులుకోడం సీ ! స్సీ ! ! అడక్కండి బాబూ ఆ ఊసులు.

మనుసులు సెడిపోనారు.

ఊరు కుళ్ళిపోనాది.

కాటికి లేనోడు సస్తే కాటికీడిసేవోడు కూడా నేడు.

వోనా, వారదా వొచ్చి కూలీ, నాలీ తిండినేక సస్తావుంటే అయ్యో అనే వోడుకూడా నేడు.

అదిగో సరిగ్గా అలాటి టయాంలో దిగినాడండి బుల్లిబాబు రంగంలోకి.

ఊళ్లో పెద్దలు పదిమందిరికి కబురెట్టి నాడండి – రమ్మని.

కానైతే పిల్లా, పాపల్తో – ఊరు ఊరంతా ఇరగబడిపోనాదండి మా యింటిమీద.

నిజానికి ఆ బాబు అంతమందిరిలో మాటలాడ్డం – అదే తొలిసుట్టు–అయితే నేండి? తొలిసుట్టు పురుళ్ళా ఆ బాబేం వీం బాదపళ్లేదండే.

మందిని జూసి ఉషారెక్కి–పోనాడు.

జంగంవోడి గంటలా గింగురెట్టేసి నాడండి.

"మనవంతా ఎవరం? ముందు మడుసులం. తరవాతే – బేపనోళ్లం, కోవఁట్లం, కాపోళ్లం, మాలోళ్లం. మనందరికీ ఒకటే కుటుంబం. ఊర్లో మాలోడికి జబ్బుజేస్తే పట్టించుకోనివోడు– ఆడు ఎవుడన్నా సరే – బేపనోడైనా సరే ఆడమ్మ మొగుడైనా సరే – ఆడు మాలోడికన్న కనికిష్టం.

ఊళ్లో ఎవురైనా సరే పస్తుపడుకున్నా దంటే – ఆడు కూలోడైనా, మాలోడైనా సరే – ఆ నీరసం యియేళుంటాది. రేపు ఏదైనా తింటె పోద్ది. కాని ఆ నీరసం పదేళ్లుపోనాక దేశాన్ని పట్టుకుంటాది. దేసెం సచ్చీవొరకూ మరింక ఒగ్గదు.

యీ మాటలు నాయిగావ్.

సచ్చి సొరగాన్నున్నాడే–గాందీగోరు? అదిగో ఆ బాబువి.

ఎవురేటన్నా ఏట్నాటం?

మనకి గవుర్నమెంటు నేదా? రెండున్నాయి.

ఆపీసర్లు నేరా? వొందల కొద్దీ ఉన్నారు.

ఎమ్మెల్లేలు, ఎం.పీలు? సెపక్కర్లేదు.

ఎందరుంటే మాత్తరం ఏటొరుగుతున్నాది?

బతుకు లొరిగిపోతున్నాయి. అంతే.

ఎవుడూ పక్కోడి సంగతి పట్టించుకోడు.

ఎవుడిపట్టు కాడు తన కడుపూ, భోషాణం నింపుకుంటున్నాడు. అంతే.

నానేదో నీతులు సెప్తున్నాననుకోకండి.

ముందు మనూరు బాగుపడాల.

అప్పుడు జిల్లా బాగుపడుద్ది.

జిల్లా బాగుపడితే రాష్టరం బాగుపడుద్ది.

రాష్టరం బాగుపడితే దేశం బాగుపడుద్ది.

దేశం బాగుపడితే పెపంచికవేఁ బాగుపడుద్ది.

ఊరు బాగుసెయ్యడవంటే యీడో సింతపిక్కా, ఆడో ఏపమొక్కా పాతినాటం నేదు.

ఇక్కడ ముష్టోడి కిన్ని గింజలూ,

అల్లా కుష్టోడి కిన్ని మందునీళ్లూ పోసి నాదింనేదు.

యిది ఒకడి వొల్ల అయ్యేపని గాదు అవదు.

అందరం కల్సి సెయ్యాల మరామత్తు.

దానికి సంగాలు, సందాలు అక్కర్లేదు. ఉన్న పంచాయితీ సాలు.

ఊరంతా ఒకే పారిటీ గావాల.

నాకేం వొద్దు.

ఇక్కడున్న - సిన్నా, పెద్దా- అంతా కలిసి-ఆలోసన సెయ్యం . పంచాయితీ మెంబర్లందరి పేర్లూ ఒక లిస్టు ఎయ్యండి - నా పేరు మాత్తరం వొద్దు.

ఆ పేర్లలో లాటరీ తీద్దాం.

ఎవ్వడి పేరొస్తే ఆదే పెసిడెంటు.

ఏటంటారు?" అని కూకుండి పోనాడు.

ఆ బాబంత సక్కగా మనసపంతొల్ని పళ్ళెంలో ఎట్టినట్టు సెప్తే ఎవుడు మాత్తరం ఏటంటారు?

అయితే కిష్టప్పబాబని ఓ సావుకోరు లెగిసినాడు- పుట్టలోంచి సావు లెగిసినట్టు లెగిసినాడు.

లెగిసి ముందు బుల్లిబాబుకి దణ్ణమెట్టి నాడు.

ఆనక జెనానికి దణ్ణమెట్టినాడు.

దణ్ణాలైనాక "యింతసేపూ, బుల్లిబాబూ, నీ మట్టుకు నువ్వు మాటాడినావు. నాను మాత్తరం పెజతరపున మాడట్టాతున్నాను.వొల్లకాదనడానికి నువ్వెవడివి? నీ పేరూ ఎక్కడా వుండకూడదన్నావు.

అసలు లిస్టులో మొదటి పేరు నీదే ఉండాలంటాను. పెసిడెంటువీ నువ్వే అంటాను," అని కూకున్నాడు.

జెనం సప్పట్లు కొట్టేరు సూడండి బాబు, సెవులు సిల్లులడిపోనాయి.

అంతమందిరి మాట కాదన్లేకపోనాడు మా బాబు.

"మెంబరుగా మా వుండవంటే మావుండం" అన్నారందరూ.

యీ బరువు మావు మొయ్యలేమన్నారు.

ఎలాగైతేనేం, మా బాబు అందరికీ నచ్చజెప్పి వొప్పించి, లిస్టులు తయ్యారయ్యేసరికి రేత్తిరి పద్దాటిపోనాది -

(సశేషం)



# నాగరీకం

కౌశికస



మధ్యాహ్నం మూడు గంటలైంది.

నేనప్పుడు సామాన్యంగా విజిటర్స్‌ను చూసే సమయం.

ప్యూను వచ్చి "సార్! మీకోసరం ఎవరో వచ్చారు. లోపలికి పంపించమంటారా?" అన్నాడు.

టేబుల్‌మీద ఆఫీసు కాగితాలను చూసుకుంటున్న నేను కాగితాలమీద నుండి దృష్టి మరల్చకుండానే "సరే పంపించు" అన్నాను. విజిటర్స్‌ను కలవడం రోజూ అనవాయితే కాబట్టి.

"హల్లో! మల్లిక్! హౌ ఆర్ యూ? ఈ ఊరికి ట్రాన్స్ఫరై ఎన్నాళ్లైంది! ఇంట్లో అంతా కులాసాయేనా? ఆఁ అన్నట్లు - ఇంతకీ అసలు నన్ను నీవు గుర్తుపట్టావా? లేదా?"

అని ధారాళంగా మాట్లాడుతున్నవాడల్లా - తన వాగ్ధాటికి తానే బ్రేకువేసి - మధ్యలో నన్ను ప్రశ్నించాడు.

"ఆఁ! లేదండి! మీరెవరో చప్పున గుర్తురావడంలేదు, క్షమించాలి. మరేం లేదు, రోజూ ఆఫీసులో ఎంతోమందిని

కలుస్తుంటాంగదా! కొందరగా గుర్తించ లేకపోతున్నాను. అదీగాక నాకొంచెం జ్ఞాపకశక్తి కూడా తక్కువేలెండి." అన్నాను, కొంచెం అపాలజిటికల్‌గానే.

నిజంగా అతనెవరో ఇప్పటికీ నాకు గుర్తురావడంలేదు లీలగానైనా.

"అదేనోయ్ మల్లిక్. శివపురం హైస్కూలులో మనమిద్దరం ఒకే క్లాసులో చదువుకునేవాళ్ళం. నీవేమో ముందుబెంచీమీద కూర్చునేవాడివి. నేను నీ వెనకాల బెంచీమీద కూర్చునేవాణ్ణి. మనమిద్దరం 'బి' సెక్షన్లో ఉండేవాళ్ళం."

"ఆఁ.... కావచ్చులెండి."

"కావచ్చేమిటీ, నా మొహం - అయితేనూ - మనమిద్దరం కలిసే చదువుకుంటేనూ, మన క్లాసులోనే శేషరత్నం అనే రెండు జడల అమ్మాయికూడా ఉండేది. ఆ అమ్మాయిని మనమందరం ఏడిపించేవాళ్ళం. ఇప్పుడైనా గుర్తుకొస్తున్నానా లేదా?" అన్నాడు, నా చిన్నప్పటి విషయాలన్నీ గుర్తుచేస్తూ -

నేను శివపురంలో చదువుకున్నమాట నిజమే. మా క్లాసులో శేషరత్నం అనే అమ్మాయి ఉన్నమాట నిజమే. ఇవన్నీ గుర్తుకొస్తున్నాయ్. కాని గుర్తుకు రానిదల్లా - ఇదిగో - ఈ జ్ఞాపకంచేస్తున్న రావుగారే!

ఇన్ని మా చిన్నప్పటి విషయాలు చెబుతూంటే అతనెవరో తెలియదంటే మర్యాదగా ఉండదని, "ఆఁ అయితే రావుగారూ! మీరెక్కడ పనిచేస్తున్నారు." అన్నాను మర్యాదకోసమని.

నేను "రావ్స్ అండ్ రావ్స్" అనే కంపెనీలో పనిచేస్తున్నాను. బైదిబై ఇప్పుడు నీ శాలరీ ఎంత?" అతనే అడిగాడు.

"ఆఁ. ఎంతలెండి. అన్నీ కలిపి పది హేనొందలొస్తాయి" అన్నాను.

"సరిగ్గా నా జీతమూ అంతే! కాకపోతే ఎటొచ్చీ నీకంటె ఓ వందరూపాయలు తక్కువ. ఆఁ అన్నట్లు ఈ ఊళ్ళో నీకు సుఖంగా ఉందా" నా యోగక్షేమాలు విచారించాడు.

"ఆఁ ఫరవాలేదు. కాకపోతే ఇక్కడి వాతావరణమే కాస్త చికాగ్గా ఉంది. నాల్గురోజులుంటే అదే అలవాటైపోతుంది" అన్నాను నా ఇబ్బందికి నన్ను నేనే ఓదార్చుకుంటూ.

"వాతావరణానిదేముందిలే-నాల్గురోజులైతే అదే అలవాటైపోతూంది" అని ఇంకా అతను ఏదో మాట్లాడబోతుండగా - సంతకాలకని - మా సెక్రెటరీ శంకరం ఫైలుతీసుకుని లోపలికొచ్చాడు.

సంతకాలు చేస్తున్నంతసేపూ ఏకాగ్రతకు భంగం కల్గిస్తూ నాన్‌స్టాప్ ఎక్స్‌ప్రెస్‌లా ఏదో మాట్లాడుతూనే ఉన్నాడు.

బెల్‌కొట్టి, నూతనాగంతకుడికి, నాకు, మా శంకరావుకు మూడు కాఫీలు ఆర్డరిచ్చాను. కాఫీలొచ్చాయి.

దెయ్యాల కొంప! అయినా ఓర్చుకుంటాగాని ఈ
కాలనీ ఇంట్లో కాపురానికయితే నే చస్తే రాను
మా పుట్టింటికి పోతానంతే !!




మళ్ళీ మొదలెట్టాడు-

"ఈ రోజుల్లో ఊరికే కాఫీ, కాఫీ అని అఘోరిస్తారు కాని - అసలు కాఫీ ఆరోగ్యానికి ఎంత భంగకరమని? అస్తమానమూ ఆఫీసుల్లో పనిచేసేవాళ్ళు అదేపనిగా కాఫీలు తాగుతుంటారు కదా! అదేమైనా రుచా - పచా - దాంట్లో ఏం గొప్ప ఉంధో నా కర్థంకాదు. పైగా వైద్యనిపుణులందరూ కాఫీ ఆరోగ్యానికి భంగకరమైందని నెత్తిన నోరుపెట్టుకొని చెబుతున్నారు. అయినా మనం కాఫీ మానడంలేదు. అవునండి! మీ పేరేమిటో నాకు తెలియదుగాని...."

"నా పేరు శంకర్రావంటారు సార్."

తన పేరు చెప్పుకున్నాడు మా శంకర్రావు.

"చూడండి శంకర్రావుగారు! మీరైనా మావాడికి చెప్పి ఈ కాఫీలు మాన్పించలేకపోయారా? కొంపతీసి మీక్కూడా పదే పదే కాఫీతాగడం ఇష్టమేనేమిటి? నా పిచ్చిగానీ- ఈ రోజుల్లో కాఫీ అంటే చెవికోసుకోనివారు ఎవరుంటారు- అంతకంటె పెద్ద పెద్దవే లాగేస్తూంటేనూ" ఇంకా ఏదేదో మాట్లాడుతూనే ఉన్నాడు.

"మరి వస్తాను సార్! నా కొంచెం పనుంది"- అని అతని దగ్గర- నా దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు మా శంకర్రావు ఈ బోర్ భరించలేక-

అతనికంటే తప్పిందిగాని నాకు తప్పదు గదా! అప్పటికి నాల్గున్నర కావచ్చింది. ఇంకా చూడాల్సిన ఆఫీసు కాగితాలు చాలానే ఉన్నాయి. కాని ఈ నూతనాగంతకుడు నన్ను వదిలేస్తేగా! ఇంకా ధారావాహికంగా- గడగడా- డబ్బాలో రాళ్ళేసి కొట్టినట్లు - మాట్లా

దేస్తూనే ఉన్నాడు కామా _ ఫుల్‌స్టాప్ లేకుండా_

ఇహ ఈ రోజుకి ఆఫీసుపని చేయడం కుదరదు. ఇతనెవరో నన్నొదిలేటట్టు లేడు. నన్నొక్కణ్ణి విసిగించింది చాలక నా కోసరం వచ్చినవాళ్ళనుకూడా పని కట్టుకొని పలకరించి అయినవీ_ కానివీ_ అడ్డమైన కామెంట్సు పాసుచేస్తున్నాడు.

వాళ్ళు నా మొహం చూసి ఊరు కున్నారు కాని_లేకపోతే ఈపాటికి నాల్గు వడ్డించేవాళ్ళే.

నా కోసరం అలాంటి స్నేహితుడు వచ్చినందుకు నాకే ఎంతో సిగ్గుగా ఉంది.

ఇంతలో ఐదుగంటలైంది. ఎలాగూ ఇవాళ్టికి ఇక పని కుదరదని_ ఫైళ్ళన్నీ సర్ది_ ఇంటికి వెళదామని లేచాను_ ఇక నైనా అతను నన్ను వదిలేస్తాడేమోనన్న ఆశ ఏమూలనో నాకు లేకపోలేదు.

"అన్నట్టు_ ఏరా_ ఇల్లెక్కడ తీసుకు న్నావ్. ఇక్కడకు దగ్గరేనా" అన్నాడు.

'హతోస్మి_ హరిభగవంతుడా! ఇక్కడ బోరుకొట్టింది చాలక ఇంటికూడా వస్తాడన్నమాట_ ఈ మహానుభావుడు' నిరాశపడ్డాను.

"ఇల్లు చాలా దూరమండి_ సీతారాం పురంలో _ ఆఫీసుకు కనీసం నాల్గయిదు మైళ్ళైనా ఉంటుంది_" అన్నాను. అలా గైనా నన్ను వదిలేస్తాడేమోనన్న ఆశతో_

"ఆఁ ఫరవాలేదులే. ఇంత పట్టణంలో మరీ ఆఫీసుకి దగ్గర్లో ఇళ్ళు దొరకా లంటే ఎలా కుదుర్తుంది. నాకిప్పుడేం పనిలేదు. మీ ఇంటిదాకా వచ్చి_ మీ శ్రీమతినికూడా చూసి వెళతా. మళ్ళీ ఎన్నాళ్టికి కలుసుకుంటామో ఏమో ?"

అంటూ నాకంటె ముందే చెప్పులు తొడుక్కుని బయట నుంచున్నాడు.

ఇక తప్పేదేముంది. అతన్ని నా స్కూటర్ వెనకాల కూర్చోబెట్టుకొని ఇంటికి తీసుకొచ్చాను.

అతడు చిరపరిచితుడిలా నా కంటే ముందే మా డ్రాయింగ్‌రూంలో కెళ్ళి సోఫాలో వాలి విశ్రాంతి తీసుకుం టున్నాడు.

"ఇప్పుడే వస్తానండి"_ అని డ్రాయింగ్‌రూంలో ఫ్యానువేసి లోపలి కెళ్ళాను.

"ఎవరండీ ఆయన ? ఎప్పుడూ చూసి నట్టులేదు. ఎవరైనా మీ స్నేహితుడా" ప్రశ్నించింది మా శ్రీమతి. ఇంతవరకూ నేను అనుభవిస్తున్న మానసిక వేదన తనకేం తెలుసు.

"ఎవరో బాగా తెలిసినవాడిలాగే మాట్లాడుతున్నాడు. నాకు మాత్రం జ్ఞాపకం రావడంలేదు. నా చిన్నప్పటి విషయాలన్నీ కరెక్టుగా చెబుతున్నాడు. ఓసారి మన ఇంటినీ నిన్నూ చూస్తా నంటూ నావెంటపడి వచ్చాడు." అన్నాను అతన్ని ఇంటికి తీసుకురావడంలో నా తప్పేమీలేదనట్టు.

"అలాగా ! ఎవరో మీ పాతస్నేహి తుడై ఉంటాడులెండి మీ కసలే మతి మరుపు. అప్పుడప్పుడు ఇంట్లోవాళ్ళను

కూడా మీరు మరచిపోతుంటారు! దాందే ముందిలెండి. మీరు పదండి నేను కాఫీ, టిఫిను తిసొ్క్స్తా" నంది మా ఆవిడ.

బతుకుజీవుడా అనుకుంటూ మళ్ళీ డ్రాయింగ్‌రూంలో కొచ్చాను ఆఫీసు గుడ్డలుకూడా విప్పకుండా నే.

ఎలాగూ అతను వెళ్ళింతర్వాత విశ్రాంతి తీసుకుందాంగదా అనుకున్నాను.

ఇంతలో మా శ్రీమతి కాఫీ, టిఫిను తీసుకుని డ్రాయింగ్‌రూంలో కొచ్చింది.

"మా శ్రీమతండీ! పేరు కనకం" పరిచయం చేసాను.

"నమస్కారం! వీడూ - నేనూ- చాలా దగ్గరి స్నేహితులమండీ! వీడికేదీ జ్ఞాపకం ఉండదు. మొదట్నుంచీ ఇంతే వీడి వరస. ఏదో అదృష్టం బాగుండి ఆఫీసరయ్యాడు కాని-బొత్తిగా ప్రపంచం తెలియనివాడు. చివరకు క్లాసుమేటుని- ఆప్తమిత్రుణ్ణయిన నన్నే మర్చిపోయాడు- వీడితో మీరెలా కాపురం చేస్తున్నారో" అని ఓ విట్టు విసిరాడు.

ఆ విట్టుకి వాళ్ళిద్దరూ నవ్వారు. ఇక తప్పదన్నట్లు నేనుకూడా నవ్వాను.

కాఫీ, టిఫిన్లు పూర్తయింతర్వాత మళ్ళీ మొదలేసాడు తన ధోరణి- ఎంతకీ అది తెగడంలేదు ఆరైంది, ఏడైంది- ఎనిమిదైంది

అతను ఇంకా ఏమేమో మాట్లాడుతూనే ఉన్నాడు.

నాలో ఓపిక పూర్తిగా చచ్చిపోయింది. తలనొప్పి కూడా వస్తూన్నది.

ఉదయనుంచి సాయంత్రం దాకా ఆఫీసులో పనిచేసిన నా శరీరం- ఇతని అనవసర ప్రసంగంతో- పూర్తిగా అలసిపోయింది.

ఇంకా సేపుంటే శరీరమూ-మనసూ- స్వాధీనం తప్పుతూందేమో అన్నట్లుగా ఉంది. ఏం చేయాలో తోచక -

"నా కెందుకో విపరీతంగా తలనొప్పి పుడుతోందండీ" అన్నాను.

"సరేరా! మరినేనొస్తా - ఆ తలనొప్పికి బిళ్ళలేవైనా వేసుకో. కొంచెం బజారులో పనుంది. వెళ్ళాలి. నీవు మరోలా అనుకోకపోతే ఓచిన్న రిక్వెస్టు. అర్జంటుగా అవసర మొచ్చింది. ఓ రెండొందలు సర్దావంటే ఎల్లుండి కంపెనీ పనిమీద ఈ ఊరొచ్చినప్పుడు మళ్ళీ ఇచ్చేస్తాను." అన్నాడు నెమ్మదిగా తను వచ్చిన పని బయటపెడుతూ.

నాకు మతిపోయినంత పనైంది

నా దగ్గర రెండొందలు కావుగదా - వంద రూపాయలు కూడా లేవు. ఎలాగూ ఎల్లుండి ఫస్టుతారీఖే కదా అని బ్యాంకు నుంచి డబ్బుతేలేదు. ఇంటి ఖర్చులకని ఉంచిన ఓ యాభై రూపాయలు మాత్రం మా ఆవిడ దగ్గర ఉన్నట్లు జ్ఞాపకం.

ఆ మాటే అతనితో అందామంటే ఉందికూడా లేదని అబద్ధం చెబుతున్నాడని ఎక్కడనుకుంటాడో -? అదీగాక - ఇంటి ఖర్చులకోసం ఉంచుకొన్న యాభై ఇవ్వమంటే మా ఆవిడేమంటుందో?

అడక త్తెర్లో పోకలాగుంది నా పని. సరే? ఎలాగో ధైర్యం తెచ్చుకొని ఉన్న వాస్తవమే అతనితో అన్నాను.

"అరే! సమయానికి–మీరడిగినప్పుడే డబ్బు చేతిలో లేకుండా పోయిందే! మరోలా అనుకోకుండా ఉంటే – ఓ యాభై రూపాయలు మా ఆవిడదగ్గ రుండాలి – ఇవ్వమంటే అడిగిస్తాను" అన్నాను.

"అదేమి మిత్రా! పదిహేనొందలు సంపాదించే ఆఫీసర్నంటున్నావ్. ఆ మాత్రం ముష్టి రెండొందలు నీ దగ్గర్లేక పోయాయా? సరే. పోనీలే–ఏం చేస్తాం– ఆ యాభై ఇటు పడెయ్. మళ్ళీ ఎల్లుండి ఇస్తా"– అని నాతో నిష్ఠూరాలాడి – నా మీద జాలికనబరుస్తున్న పోజుపెట్టి – ఆ యాభై పట్టుకపోయాడు. అతన్ని గుమ్మందాకా సాగనంపి ఇంట్లో కొచ్చాను.

"వెళ్ళాడాండి మీ చిన్ననాటి స్నేహితుడు"–మా ఆవిడ ప్రశ్నించింది.

"ఆఁ వెళ్ళాడుఇప్పటికి. నా ప్రాణాలు నిలువునా తోడేశాడు. అసలు వీడెవడో నాకిప్పటికీ గుర్తు రావడంలేదు" అన్నాను దీనంగా ముఖం పెట్టి.

"మీకు దొరికే స్నేహితులంతా ఇలాంటివాళ్ళేలేండి. ఇకలేవండి భోం చేద్దాం." అంది మా ఆవిడ, నా మీద కామెంటు చెయ్యడానికి వచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని.

అలా – ఆ రోజు ఎల్లుండి వస్తానని పోయినవాడు మూణ్ణెల్లైనా కన్పించలేదు.

పోతే పోయిందిలే– యాభై రూపాయల్తో వదలిపోయింది పీడ అని తృప్తి పడి ఊరుకున్నాం.

ఉన్నట్టుండి మళ్ళీ మూణ్ణెల్ల తర్వాత ఓ రోజు అకస్మాత్తుగా ఊడిపడ్డాడు.

ఈసారి ఆఫీసుకురాక సరాసరి ఇంటికే వచ్చేసాడు.

"సారీరా మల్లిక్! మళ్ళీ ఈ ఊరు రావడం ఇన్ని రోజుల్నుంచి పడనేలేదు. నీ యాభై రూపాయలు నా దగ్గరే ఉండి పోయాయి. నీ వేమనుకుంటున్నావో ఏమోనని సిగ్గుతో చచ్చిపోతున్నాననుకో" అని యాభైనోటు తీసి చేతిలోపెట్టాడు.

"ఆఁ. దాందేముందిలెండి. మనిషన్న తరువాత అవసరమనేది ఎవరికైనా వస్తూంది. దాని కింతగా చెప్పాలా? ఎటొచ్చీ ఆ రోజు మిరడగ్గానే రెండు వందలు సర్దలేకపోయానే అని కొంచెం నేనే బాధపడ్డాను" అన్నాను. అతని నిజాయితీని అనవసరంగా శంకించిన నన్ను నేనే తిట్టుకుంటూ–

మళ్ళీ ఓ రెండు మూడు గంటలు లోకాభిరామాయణంతో నన్ను విసిగించి భోంచేసి వెళ్ళిపోయాడు.

"చూశారా! అనవసరంగా ఖంగారు పడ్డారు. పాపం అతను నిజాయితీ గలవాడే. మనమే అనవసరంగా అతన్ని శంకించాం" అంది అ తప్పు పూర్తిగా నాదేనన్నట్లు మా శ్రీమతి.




ఈసారి మళ్ళీ వారం తిరక్కుండానే వచ్చాడు. నాకు ఇంకా జ్ఞాపకంరాని-మా రావ్.

సరిగ్గా మేం భోజనానికి లేచే టైం.

మేము భోజనానికి లేవబోతున్నాం.

అతను సూటుకేస్ తీసుకొని వచ్చాడు.

మేము భోజనానికి లేవడం ఆపి-

"సరిగ్గా సమయానికే వచ్చారు. లేవండి అందరం కలిసే భోంచేద్దాం" అన్నాను అతని నుద్దేశించి.

"ఒరేయ్. ఇవాల్టికి నన్ను క్షమించరా! బాగా ఆకలిగా ఉంటే వస్తూ వస్తూ హోటల్లో భోంచేసి వచ్చాను. మరోసారి మీ ఇంట్లో తప్పకుండా భోంచేస్తాగా. మీరు కానివ్వండి. నేను ఈ లోపు పేపరు చూస్తుంటా!" అని నా సమాధానం కోసం ఎదిరుచూడకుండానే పేపర్లోకి తలదూర్చాడు.

సరే. ఇహ అతన్ని బలవంత పెట్టి లాభంలేదనుకొని మేము వెళ్ళి భోంచేసి వచ్చాం.

మా భోజనాలయి వచ్చేసరి ఓ అర గంటో, ముప్పావు గంటో అయి ఉంటూంది. ఈలోపు ఆగంతకుడు నిద్రతో కూర్చొట్లపడుతున్నాడు.

మేం భోంచేసి రాగానే-ఎప్పుడు గంటలు గంటలు మాట్లాడేవాడల్లా-ఇక ఉండలేనన్నట్లు-లేచి నిల్చొన్నాడు.

"ఒరేయ్! మల్లిక్! నేనొస్తాన్రా! రాత్రంతా ట్రెయిన్లో నిద్రలేదు.

ఉదయంనుంచి కంపెనీ పన్లే సరి పోయాయి. నిద్ర ముంచుకొస్తూంది. మరి నేనొస్తా సెలవ్"

అని సెలవుతీసుకొని వెళ్ళిపోయాడు

ఈరోజు ఇంత తొందరగా మమ్మల్ని వదిలి వెళ్లినందుకు భగవంతుడికి మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకొన్నాను.

కాస్సేపు న్యూసుపేపరు తిరగేసి - ఇక పడుకుందా మనుకునే సరికి - మా అవిడ కూడా వంటింట్లో పని ముగించు కొని - తడిచేయి తువ్వాలుకు తుడుచు కొంటూ డ్రాయింగ్‌రూంలో కొచ్చింది.

"ఏమిటి అలా కూర్చున్నారు. అంత డల్‌గా ఉంటే రేడియో ఆన్‌చేయండి. ఇవాళ్ళేదో మంచి నాటకం కూడా ఉంటూంది" అంది.

నేను యధాలాపంగా కుర్చీమీది నుంచి లేవకుండానే రేడియోవైపు చేయి పోనిచ్చాను. కాని రేడియో దాని స్థానంలో లేదు.

"కనకం! ట్రాన్సిష్టరు లోపల పెట్టి నన్ను రేడియో పెట్టమంటే ఎలా?" అన్నాను.

"అబ్బే లేదండి. నేను రేడియో లోపలికి తీసుకెళ్ళందే. అక్కడే ఉండాలి చూడండి." అంది ఖంగారుగా.

ఇల్లంతా వెతికాం. ఇంకెక్కడి రేడియో. మా ఫారిన్ రేడియోతోపాటు, టేప్‌రికార్డరు, నా కొన్టిలీ రిస్ట్‌వాచీ, టేబుల్‌మీద పర్సు కన్పించలేదు.

మా ఆవిడ లబోదిబోమంది.

అంతా కలిపి నాల్గయిదు వేలదాకా పోయినట్లే!

ఏం చేస్తాం. పెళ్ళాంతో దెబ్బలు తిన్నా - అంగట్లో ధగాపడ్డా ఎవరికీ చెప్పకూడదంటారు-సరిగ్గా అలాగే ఉంది మా పరిస్థితి కూడా.

ఇంతలో మా అవిడ ఏడుస్తూనే చెప్పడం మొదలెట్టింది!

"సిటీలో కొత్తగా వచ్చినవాళ్ళను నమ్మకూడదంటే మీరు వింటారా? అడ్డమైనవాళ్ళను కొంపమీదికి తీసుకొస్తారాయె!" అని ఇంకా ఇలా అంది.

"పక్కింటి రామాయమ్మ చెప్పింది.

"మొన్నోకరో ఇలాగే హరిహరరావు గారింటికొచ్చి - నేను హరిహరరావుగారి బావమరిదిని - మా అక్కయ్య, బావ రైల్వేస్టేషన్లో ఉన్నారు. ఇంట్లో కొత్త బట్టల సూటుకేసు మరచిపోయారట. మీ ఇంటి దగ్గర తాళంచెవి ఉంది - తాళపు చెవి తీసుకొని సూటుకేసు తీసుకురమ్మన్నారు" అని పక్కింటి వాళ్ళను నమ్మించి తాళం అడిగి పుచ్చుకొని - సుబ్బరంగా ఓ పావుగంటలో పదివేల దాకా ఖాష్లీ సామాన్లు సూటుకేసులో పెట్టుకొని - తాళం మళ్ళీ పక్కింట్లో ఇచ్చేసి - రిక్షా తెప్పించుకొని - ఎక్కి చక్కాపోయాడుట -

"తరవాత హరిహరరావుగారి వాళ్ళు వచ్చి - మాకు బావమరది లేడు- వల్లకాడు

లేదు - అని నెత్తీ-నోరు బాదుకున్నారట.

"అసలే రోజులు బాగాలేవు. అందునా ఈ పట్టణాల్లో మోసగాళ్ళు - ఎప్పుడు - ఏ రూపంలో ఏవంక పెట్టుకొని వస్తారో- తెలియకుండా ఉంది."

అంది తన లేటెస్టు అనుభవాన్ని వివరిస్తూ-

"సరే! ఇప్పుడనుకొని ఏం లాభం- చేతులు కాలింతర్వాత ఆకులు పట్టు కొన్నట్లు" - అన్నాను.

"మరిప్పుడేమిటి దిక్కు. మన పోయిన వస్తువులను అలా వదిలేసి నట్లేనా !?" అంది నిస్పృహగా - మా శ్రీమతి.

"వదిలేయక చేసేదేముంది!

ఇలా మా మాటలు పూర్తికాకముందే- "టెలిగ్రాం సార్ !" అని టెలిగ్రాం తెచ్చాడు టెలిగ్రాఫిస్టు.

అందులో ఇలా ఉంది. "సారీరా మల్లిక్! నీ రేపురికార్డరు అవి ఓసారి చూద్దామని తెచ్చాను. కాని అవి ఏమీ బాగాలేవు తెలుసా! అలాంటి అరిగి పోయిన రేపురికార్డర్ - నీ లాంటి గెజిటెడ్ ఆఫీసర్ ఇంట్లో ఉండ వలసిందేనా! అది మీ ఇంట్లో ఉంటే నీ స్టేటస్‌కే భంగం. అంచేత అనుకో కుండా నాతో తెచ్చేసాను. ఏమీ అను కోకేం! మళ్ళీ అవన్నీ పంపిద్దామను కున్నాను. కాని ఎందుకులే-ఈ మూలంగా నైనా నీవు కొత్త వస్తువులు కొనుక్కుం టావని నాతోటే ఉంచేసా! చాలా థ్యాంక్సురా! మరి ఉండనా! గుడ్ బై" అని ఉందికాని ఆ టెలిగ్రాం ఎక్కడ నుంచి వచ్చిందో అడ్రసుమాత్రం లేదు.

ఆ టెలిగ్రాం చూసి మా ఆవిడా- నేను అవాక్కైపోయాం. బహుశా ఇది కూడా ఈనాటి నాగరికతలో ఒక భాగం కామోసు" అని ముక్కుమీద వేలు వేసుకున్నాము.





# ఈ కథ ఎప్పటికీ ఇంతేనా!

'మోహనకృష్ణ'

ఎవరేనా సహనం గురించి మాట్లాడితే పావనమూర్తి చిన్న చిరునవ్వు నవ్వి ఎటో చూసేవాడు. ఇది అతనికి పుట్టుకతో వచ్చిన అలవాటు మాత్రం కాదు. జీవితం నిర్దాక్షిణ్యంగా అన్నివైపుల నుంచీ విపరీతమైన దెబ్బలు కొడుతూ, కుంగదీస్తున్నప్పుడు, తన లక్ష్యం ఎలాగో బతకడమేగాని చావడం కాదని అనిపించినప్పుడు, బాధ్యతలు మరింత బరువుని నెత్తిమీద మోపేసి 'బతకాలి బాబూ' అని హెచ్చరించినప్పుడూ ఆ చిరునవ్వు అతని పెదవులమీద స్థిర నివాసం ఏర్పరుచుకుంది. చేతి రేఖలకీ పుట్టుమచ్చలకీ, భాష్యకారులున్నట్లు, మనిషి కొన్ని కొన్ని పరిస్థితుల్లో విసిరే చిరునవ్వుకి అర్థం చెప్పగలిగేవాళ్ళుంటే 'భూదేవికే కాదు, సహనం గురించి నాకూ బాగా తెలుసు' అన్న భావం ఆ చిరునవ్వు వెనక తప్పకుండా కనిపిస్తుంది.

రాత్రి పదకొండు గంటలవేళ.

పావనమూర్తి దిద్దుతున్న కాంపోజిషన్ పుస్తకాలు కట్ట కట్టి పక్కకి తోసేసి, ఒళ్ళు విరుచుకుని, పెద్దగా ఆవలించేడు.

"ఇంకా పడుకోలేదూ?" అంటూ వచ్చింది సావిత్రమ్మ. లైటు వెలుగులో భార్య మొహాన్ని పరీక్షగా చూసేడు పావనమూర్తి. ఆవిడ మొహంలో గూడు కట్టుకున్న అలసట చూడగానే అతని గుండె బరువెక్కింది. భారంగా నిట్టూర్చేడు.

"ఈ కట్టలు దిద్దేదాకా నిద్రెలా పడుతుందే నాకు? ఇన్‌స్పెక్షన్ తోసుకుంటూ వచ్చేస్తోంది ఓ పక్కనుంచి!" అన్నాడు పావనమూర్తి.

సావిత్రమ్మ గట్టిగా నవ్వింది. నవ్వుతూనే గుమ్మంలో తలుపు కానుకుని కూర్చుంది.

"ఎందుకే నవ్వుతున్నావ్ ?" అని ప్రశ్నించేడు పావనమూర్తి.

మధ్య మీరెప్పుడూ స్కూలూ, పాఠాలూ. కాంపోజిషన్లూ తప్ప మరో విషయం పట్టించుకోవడమే మానేశారు. ఇన్‌స్పెక్షను స్కూలుకీ, మీకే కాదు! మనందరి బతుకులకీ కూడా జరుగుతుంది నేడో రేపో!" అన్నది సావిత్రమ్మ గంభీరంగా.

పావనమూర్తి ఉలిక్కిపడ్డాడు.

"సావిత్రీ!" అన్నాడు దిగులుగా.

"అప్పుడే అలా అయిపోయారేవిఁటి? కథ యింకా నాందిలోనే వుంది." అన్నది సావిత్రమ్మ. పైటకొంగుచివర్ల నుంచీ వేలాడుతున్న దారపు పోగుల్ని లాగి, నోట్లో పెట్టుకుని చప్పరిస్తూ.

"ఏవిఁటా కథ?" అనడిగేడు పావనమూర్తి.

"అయ్యో రాత! ఇంత మతిమరుపేవిఁటండీ మీకు?" అన్నది సావిత్రమ్మ. భర్తలో ఆవిడకి నచ్చిన సుగుణాలు చాలా వున్నాయి. నచ్చనివి బహుకొద్ది. అంతమాత్రాన భర్తని విమర్శించడం, తీవ్రమైన పదజాలంతో వాదానికి దిగడం ఆవిడ తత్వానికి వ్యతిరేకం. ఎప్పుడైనా మరీ భరించలేని పరిస్థితుల్లో వ్యంగ్యంగా ఓ మాటంటే నే మొహం గంటుపెట్టుకుని లోలోపల బాధపడే భర్తని చూస్తుంటే జాలి కలిగేది. ఏ సంగతి గ్రహించగానే అలా అనడం కూడా తగ్గించేసింది. దానికి మరో కారణం కూడా వుంది. సంఘటన ఎంత తీవ్రమైనదైనా, సమస్య ఎంత క్లిష్టమైనదైనా తనకి సంబంధించనిదైనట్లు, తన నేమీ కదలించనట్లు ప్రవర్తించి, వాటి పరిష్కారానికి అహోరాత్రాలూ తపించే పావనమూర్తి అంటే ఆవిడకి వల్లమాలిన ఆరాధన.

"అంత మరచిపోవడానికి అసలు జరిగిందేమిటని?" అంటూ పావనమూర్తి, సావిత్రమ్మని ఆలోచనల్లోంచి బైటకు లాగేడు.

"అమ్మాయిని గురించి!" అన్నది సావిత్రమ్మ.

"అమ్మాయిని గురించా?" అని ఆశ్చర్యపడ్డాడు పావనమూర్తి. అంతలో ఒక్కసారిగా లెక్కలేనన్ని ప్రశ్నలు.

సుభద్ర విషయంలో తను బాధ్యతని విస్మరించిందేమీ లేదు. తొలిచూలు ఆడపిల్ల. ఆడపిల్లే కావాలని కలలు కన్నాడు. సావిత్రితో రోజుల తరబడి హోరాహోరి పోరాటం సాగించేడు, ఆడపిల్లని కనమని. కోరుకున్న బిడ్డని కనడం సావిత్రి చేతిలో పనే అన్నట్లు ఆమె నవ్వుకునేది కూడాను, తన అమాయకత్వానికి. చివరికి తన మాట చెల్లించింది సావిత్రి. మెరిసే కళ్ళతో కృతజ్ఞతలు చెప్పాడు. అంత అపురూపంగా పొందిన సుభద్రని అల్లారుముద్దుగా పెంచాడు. ఏ వయసులో ఏ ముచ్చట్లు జరగాలో, అవన్నీ

జరిపించాడు. ఆమె కోరినట్లే కాలేజీలో ప్రవేశపెట్టాడు. డబ్బు ఇబ్బందులూ, అప్పులూ, వడ్డీలూ ఆమె దృష్టికి రాకుండా జాగ్రత్తపడి, కాలేజీ చదువు పూర్తి చేయించాడ. తన్నతండ్రిగా తన బాధ్యతని యిప్పటిదాకా సక్రమంగా నిర్వర్తించాడు. మరి యిప్పుడు సావిత్రి తనేదో మరచిపోయినట్లు ఎత్తిపొడవడానికి కారణమేమిటో ఊహించలేక పోతున్నాడు.

"విషయమేమిటో స్పష్టంగా చెప్పు సావిత్రీ! ఈ మధ్య నువ్వన్నట్లు, చాలా విషయాల్లో నేను వెనకబడి పోతున్నానేమో అన్న అనుమానం నాకు వస్తోంది" అన్నాడు పావనమూర్తి, ఆలోచనలకు ఫుల్‌స్టాప్ పెడుతూ.

"అదేనండీ! అమ్మాయి పెళ్ళి విషయం!" అన్నది సావిత్రి!

"ఏమిటి?"

"ఏమిటేమిటి, నా మొహం. చదువెందుకండీ ఆడపిల్లకి అంటే వినకుండా డిగ్రీదాకా చదివించారు దాన్ని. మీ ముచ్చట నేనెందుకు కాదనాలని నోరు మూసుకు పడున్నాను. సరే అనుకున్న డిగ్రీ వచ్చింది. ఇకనన్నా దాన్నో యింటిదాన్ని చేసే ప్రయత్నాలు ప్రారంభిస్తారా, లేక మీ కాంపోజిషన్లు దిద్దుకోవడంతోనే సరిపెట్టుకుంటారా? చూడండి మాష్టారూ! కుర్రాడేదైనా తప్పు రాస్తే, ఎర్రసిరాతో కొట్టేసి, సరైనమాటేదో పక్కన రాస్తారు మీరు. కాని ఆడపిల్ల జీవితం కాంపోజిషన్ కాదు. ఇక్కడేదేనా పొరపాటు రాస్తే ఏ సిరాతోనూ కొట్టెయనూలేం, సరైన మాటేదో రాసి చూపించనూలేం." అన్నది సావిత్రి.

పావనమూర్తి భార్య మొహంలోకి తీక్షణంగా చూశాడు. ఇప్పుడతనికి ఆవిడ మొహంలో అలసటకన్నా బాధ ఎక్కువగా కనిపిస్తోంది. అతని మనసులో ఏ మూలో ఏదో జరగకూడనిది జరిగి పోతోందేమో అన్న సందేహం చురుక్కున పొడిచింది. అతని ఒళ్ళంతా ఒక్కసారి కంపించింది. కుర్చీలోంచి లేచివెళ్ళి మంచంమీద వాలాడు.

"ఇలారా సావిత్రీ!" అన్నాడు.

సావిత్రమ్మ గుమ్మం దగ్గిర్నుంచి లేచివెళ్ళి భర్త పక్కనే మంచంమీద కూర్చుంది.

"చూడు సావిత్రీ! నాతో పాతికేళ్ళ జీవితం పంచుకున్నావ్. ఏం సంపాదించానో, ఎలా సంపాదించానో, మిమ్మల్ని ఎంతవరకు సక్రమంగా, సంతృప్తికరంగా చూసుకోగలిగానో నాకన్నా నీకే ఎక్కువ తెలుసు. అంతేగాదు! ఈ లోకాన్ని నాకన్నా నువ్వే ఎక్కువ అర్థంచేసుకున్నావ్. మొదట్నుంచీ, నన్నెలా నడిపిస్తూ వచ్చావో, ఇప్పుడు కూడా అలాగే నడిపించమని కోరడం

నెలరోజులక్రితం చావాల్సిన మన రామంగారు. ఈరోజు చచ్చాడు!

మెదడుంచే వారు చాలా బద్ధకస్తులు!

సీత..

కన్న నేను చెయ్యగలిగిందేముంది, చెప్పు !" అన్నాడు.

"అంటే ! పిల్లకి సంబంధం కూడా నన్నే వెతుక్కురమ్మంటారా, మహాశయా ?" అన్నది సావిత్రి.

"తప్పేముంది ? కన్నబిడ్డ పట్ల నాకొక్కడికేనా బాధ్యత ? సగం నీకూ వుందిగా ! నువ్వెలా చెబితే అలా చేస్తాను !" అన్నాడు పావనమూర్తి, ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటూ.

సావిత్రమ్మ క్షణకాలం భర్త మొహంలోకి కన్నార్పకుండా చూసింది.

"సుభద్ర యిప్పుడు చిన్నపిల్ల కాదండీ, మనం ఇద్దరం చెప్పినట్లు నడుచుకుందుకి. దానికీ వ్యక్తిత్వంవుంది. దాని జీవితం సౌఖ్యవంతం కావాలని కన్నవాళ్ళుగా మనం కోరుకోవడం సహజం. కాని....డిగ్రీ చదివినపిల్లగా దానికీ కొన్ని అభిప్రాయాలు వుంటాయి. వాటిని మనం జాగ్రత్తగా అర్థంచేసుకోవాలి." అన్నది.

పావనమూర్తికి కంగారు పుట్టింది.

"సావిత్రీ ! అయితే సుభద్ర ఏదేనా నిర్ణయం తీసుకుంటున్నదా? నీతో ఏమైనా చెప్పిందా ? నువ్వేమన్నావ్ ?" అని ఒక్కమాటుగా ప్రశ్నలు కురిపించేడు.

"అబ్బబ్బ ! ఏమిటా కంగారు ? ఏకబిగిని అన్ని ప్రశ్నలు వేస్తే ఎలా జవాబివ్వ గలననుకున్నారు ? ఒక్కొక్కటీ అడగండి చెప్తాను. సరేగాని, హార్లిక్స్ కలుపుతాను. కాస్త తాగుతారా?" అంటూ లేచింది సావిత్రమ్మ.

కావాలని జాప్యంచేస్తోందని అర్థమైంది పావనమూర్తికి. చెప్పకూడదని

కాదన్నావని, సాధ్యమైనంతవరకు ఆందోళనని తగ్గించడానికి ప్రయత్నించడం ఆమె తత్వమని అతనికి తెలుసు. అందుకే ఆమె లేచి వెళుతుంటే అడ్డం ఏమీ చెప్పలేదు.

సావిత్రమ్మ వంటింట్లోకి వెళ్ళగానే పావనమూర్తి లేచి బైటికి వెళ్ళాడు. ముందు గదిలో లైటు వెలుగుతూనే వుంది. సుభద్ర మాత్రం మంచంమీద గాఢనిద్రలో వుంది. ఆమె గుండెల మీద ఓ ఇంగ్లీషు నవల.

"సుభద్రా!" అని పిల్చాడు పావనమూర్తి.

సుభద్రకి మెలకువ రాలేదు. పుస్తకం తీసి టేబుల్‌మీద పడేసి లైటు తీసేసి, తలుపు బొత్తాలు ఓరగా వేసి, మళ్ళీ తన గదిలోకి వచ్చేశాడు. వాలుకుర్చీలో వాలేడు. ఇంతలో సావిత్రమ్మ స్టీలు గ్లాసుతో హార్లిక్స్ తెచ్చి భర్తకి అందించింది.

"నువ్వూ కాస్త తాగకూడదూ!" అన్నాడు పావనమూర్తి.

"తాగేనులెండి" అన్నది సావిత్రమ్మ.

పావనమూర్తి మౌనంగా గ్లాసు ఖాళీ చేసి పక్కన పెట్టేడు.

"ఏం పిల్లలో ఏమిటో! బొత్తిగా అర్థంగాకుండా పోతున్నారు ఈ రోజుల్లో! ఏమన్నా అంటే ప్రేమ అంటారు. ప్రేమించే ముందు స్థితిగతులూ, కుల గోత్రాలు చూసుకోవాలిగదరా అంటే ప్రేమకి ఆ భేదాలు వుండవని కొండవీటి చాంతాడంత ఉపన్యాసం చెబుతారు అక్కడికి ప్రేమ గురించి మనకేమీ తెలీనట్లు. నాకు తెలీక అడుగుతాను మాష్టారూ, ఏ ప్రేమా లేకుండానే మనం యిన్నేళ్ళుగా ఈ నాలుగ్గోడల మధ్య దాంపత్యం సాగించామా! ఏమిటో, వెర్రి పిల్లలూ, వెర్రి మనసులూ!" అన్నది సావిత్రమ్మ.

పావనమూర్తి నిశ్శబ్దంగా వింటున్నాడు. తదేకంగా భార్య మొహంలోకే చూడసాగేడు. సావిత్రమ్మ బరువుగా నిట్టూర్చింది.

"ఈ పేళ నేను మీ స్నేహితుడు భాస్కరంగారింటికి వెళ్ళిపోతే ఈ సంగతి ఇంకెన్నాళ్ళు మనకి తెలీకుండా వుండేదో మరి. మీరు బలవంతంచేసి పంపడం మంచిదైంది. మన సుభద్రా-అతనూ ఒకే రిక్షాలో వెళ్ళడం చూశాను. కనీసం టాపు కూడా వేయించుకోకుండా వెళుతున్నారు. ఎంత ధైర్యమండీ వాళ్ళకి!" అన్నది.

ఒక్కసారిగా పావనమూర్తి శరీరంలో రక్తమంతా ఉడికిపోయినట్లైంది. పరువుగా బతుకుతున్న ఏ తండ్రి అయినా పెళ్ళిగాని తన కూతురు ఓ మగాడి పక్కన రిక్షాలో షికార్లు చేస్తోందని విన్నప్పుడు- అటువంటి పరిస్థితికే రావాలి మరి

"చూసి ఎలా సహించావు సావిత్రీ!"

అని ప్రశ్నించాడతను కోపాన్ని దిగమింగుకుని. సావిత్రమ్మ మంచంమీద కూర్చుంది. క్షణకాలం మౌనందాల్చింది.

"సహించక ఏం చెయ్యమంటారు? అప్పటికప్పుడు రిక్షా ఆపుచేసి ఈ చెంపా, ఆ చెంపా వాయగొట్టి ఇంటికి లాక్కురమ్మంటారా? కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుందంటారు. నయం, నే నొక్కదాన్నే చూశాను. పక్కన మరెవరూ లేరు" అన్నది కొన్నిక్షణాల తరవాత.

"ఈ వేళంటె స్వయంగా చూశావు నువ్వు. గతంలో ఇంకెందరు చూశారో? మన ఎదట అనలేక చాటుమాటుగా ఎందరు చెవులు కొరుక్కుంటున్నారో మనకేంతెలుసే!"

"అవునా విషయమూ కొట్టిపారెయ్యడానికి వీల్లేదు. ఇలాంటి పరిస్థితుల్లో ఆవేశపడి ప్రయోజనంలేదని మీకూ తెలుసు. జాగ్రత్తగా ఆలోచించి పిల్లని దారిలో పెట్టుకోవాలి!"

"ఇంతకీ ఆ కుర్రాడెవరో?"

"నాకు మాత్రం ఏం తెలుసు? ఇంతవరకూ దాని మనసేవిఁటో, ఆలోచన ఏవిఁటో ఎప్పుడేనా చెప్పింది గనకనా! కన్నతల్లిని, నా దగ్గర కూడా దాపరికమేనా దానికి?" అన్నది సావిత్రమ్మ గద్గదికంగా.

పావనమూర్తి కరిగిపోయేడు.

"ఎందుకే బాధపడతావ్? ఇప్పుడేం జరిగిందని? నువ్వు అధైర్యపడి కళ్ళనీళ్ళు పెట్టుకుంటే నాకు కాళ్ళూచేతులూ ఆడవు. సుభద్రతో నేను మాట్లాడతానుగా!" అన్నాడు.

"ఏం మాట్లాడతారో, ఎలా మాట్లాడతారో ఏవిఁటో! నాకంతా అయోమయంగావుంది. దాని మనసేవిఁటో ఆలోచనలెలాంటివో స్పష్టపడతేగాని, ఏ నిర్ణయం తీసుకోడానికీ వీల్లేని పరిస్థితి. పడుకోండి. బాగా పొద్దుపోయింది," అంటూ లేచింది సావిత్రమ్మ.

ఆ రాత్రి పావనమూర్తీ, సావిత్రమ్మ కంటిమీద కునుకులేకుండానే గడిపేశారు.

* * *

సాయంత్రం అయిదుగంటలు దాటుతోంది. పావనమూర్తి, రమణారావూ స్కూల్లోంచి బైటపడి రోడ్డువారగా నడుస్తున్నారు.

"పావనం! సుభద్రకేవేనా సంబంధాలు చూస్తున్నావా లేదా? ఎదిగిన పిల్లని ఎన్నాళ్ళట్టిపెట్టుకుంటావురా యింట్లో? ఏనాటికైనా పరాయింటికి పంపక తప్పదు గదా! ఎన్నాళ్ళు భరిస్తావురా గుండెలమీద కుంపటిని?"

"గుండెలమీద కుంపటా - ఏవిఁట్రా ఆ మాటలు! దాని తరవాత పుట్టిన మగపిల్లలిద్దరూ తీరని అన్యాయం చేసిపోయారు. అల్పాయుష్కులు. ఇక మిగిలింది సుభద్రేగా! అది నాకు భారం

కాదురా!" అన్నాడు పావనమూర్తి. రమణారావు సంభాషణ ఎక్కడికి దారి తీస్తుందో అతనికి అర్థంగాకపోలేదు. అయినా బింకం సడలకుండా గబ గబ అనేశాడు.

"ఛ ఛ! నా వుద్దేశ్యం నీకు భారమని కాదు. దాన్నో యింటిదాన్ని చేసే బాధ్య తని గుర్తుచేస్తున్నాను. అంతే."

"మర్చిపోతే గదా నువ్వు గుర్తు చెయ్యడానికి!"

"నిజమే! కాని పరిస్థితులు విషమించకముందే బాధ్యత నిర్వర్తించడం మంచిదని!"

"రమణా!" అన్నాడు పావనమూర్తి రవ్వంత ఆవేశంగా.

రమణారావు చప్పున పావనమూర్తి చెయ్యి అందుకున్నాడు.

"పావనం! నన్ను క్షమించు. నీ మీద, స్నేహితుడిగా నాకున్న అభిమానం కొద్దీ చెబుతున్నాను. ఈ మధ్య మన సుభద్రా, ఎమ్మెల్యేకొడుకూ కలిసి తిర గడం చూశాన్నేను." అన్నాడు.

పావనమూర్తి గుండె పగిలిపోతోంది. ఈ వార్త తనదాకా రాకముందు చాలా చోట్ల వ్యాపించింది. తను మాత్రం కళ్ళుమూసుకుని కూర్చున్నాడు. మొట్ట మొదటిసారిగా తనమీద తనకే అసహ్యం వేసింది పావనమూర్తికి.

"మన బిడ్డలమీద మనకి ప్రేమాభి మానా లుండాలి. నమ్మకం ఉండాలి. కాదన్ను. కాని వాటినన్నింటినీ వాళ్ళు, మన చాతగానితనంగా భావించి, మన పరువుప్రతిష్ఠలతో ఆడుకోవడం సహించ కూడదేమో!" అన్నాడు, రమణారావు.

"అవును నిజం! సహించకూడదు. సహించను." అన్నాడు పావనమూర్తి చాలా కఠినంగా.

పావనమూర్తి ఆవేశం చూసి, అంత కంటె వివరాలు చెప్పడానికి గాని, సలహా లివ్వడానికి గాని సాహసించలేకపోయేడు రమణారావు. ఇద్దరూ కొంతదూరం నడిచి ఎవరిమార్గానికి వాళ్ళు విడిపోయేరు.

పావనమూర్తి యింట్లో కాలుపెట్టే సరికి లోపల్నుంచి సావిత్రమ్మ కంఠం కొంచెం గట్టిగానే వినపిస్తోంది. అంత గట్టిగా కాకపోయినా, నేనూ వున్నాను సుమా అన్నట్లు సుభద్ర గొంతుకూడా వినవస్తోంది. పావనమూర్తి తల్లీకూతుళ్ళ వాగ్వివాదంలో వెంటనే కలగజేసుకోవ డానికి సాహసించలేక, గదిలోకి నడిచేడు. బట్టలు విప్పి వంకెకి తగిలించి లుంగీ చుట్టుకున్నాడు. మౌనంగా పెరట్లోకి వెళ్ళి ముఖప్రక్షాళనం పూర్తిచేసి మళ్ళీ లోపలికి వచ్చేడు. ఓసారి వంటింటివైపు చూసి, "సుభద్రా!" అని కేకేశాడు, సాధ్యమైనంత సౌమ్యతని పిలుపులో పొదిగి.

"వస్తున్నా నాన్నా!" అంటూ సుభద్ర వచ్చింది.

పావనమూర్తి కూతురివైపు తేరిపార జూసేడు. ఆమె కళ్ళు ఎర్రగా వున్నాయి.

ఆమె బాగా ఏడ్చివుంటుదన్న విషయం అతనికి అర్ధమైంది.

"ఎందుకమ్మా, ఆ పిచ్చిదానితో వాగ్యుద్ధం? ఈ మధ్య మీ అమ్మకి చాదస్తం మరీ ఎక్కువవుతోంది! రాత్రంతా నీ భవిష్యత్తు గురించి లేనిపోని అనుమానాలన్నీ నా ముందు వెళ్ళబోసి నా ప్రాణంతీసింది." అన్నాడు పావనమూర్తి పెదవులమీదికి చిరునవ్వు తెచ్చుకుని.

సుభద్ర తలవంచింది. ఆమె కళ్ళల్లోంచి అశ్రువులు చెక్కిళ్ళమీదికి జారుతున్నాయి.

"నువ్వెళ్ళి గదిలో కూర్చోమ్మా! తరవాత నేవచ్చి మాట్లాడతాను. అమ్మని నేను మందలిస్తాన్లే, ఊరుకో!" అన్నాడు పావనమూర్తి. సుభద్ర పైటకొంగుతో కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయింది. పావనమూర్తి బరువుగా వంటగదిలోకి నడిచాడు. సావిత్రమ్మ పీట వాల్చింది. అతను కూర్చున్నాడు. పకోడీల ప్లేటు అతని ముందుకి తోసిందావిడ.

"నేను పిచ్చిదాన్నంటారా మాష్టారూ? నాకు చాదస్తంకూడా ఎక్కువైపోయిందంటారా? ఇన్ని నిజాలు ఎప్పుడు కనిపెట్టారండీ, నాకు తెలీకుండా?" అన్నది సావిత్రమ్మ.

పావనమూర్తి ఓసారి ఆమె మొహంలోకి చూసి తలవంచుకుని పకోడీలు తినసాగేడు.

"ఎలా వున్నాయో చెప్పకుండా తింటున్నారేవిటి? కొత్త అలవాట్లు నేర్చుకుంటున్నారా?" అన్నదావిడ. కుంపటి వేడికి మొహంమీద కమ్మిన స్వేదబిందువుల్ని పైటకొంగుతో తుడుచుకుంటూ.

పావనమూర్తి మాట్లాడలేదు. రెండు క్షణాలు జవాబుకోసం ఎదురుచూసి, "ఇవ్వాళ, నిజం చెప్పాలంటే సరిగా కుదర్లేదులెండి. మనసునిబట్టే వుంటుంది రుచికూడా!" అన్నది సావిత్రమ్మ.

"అవును. రుచులనేవి మనసునిబట్టే!" అన్నాడు పావనమూర్తి తలెత్తకుండానే.

"అలాని గంజినీళ్ళకి గతిలేనివాడు, గులాబ్‌జాంని గురించి కలలుకంటూ గిన్నె తన్నేసుకుంటే ఏం లాభిస్తుందండీ? మబ్బుల్లో నీరుచూసి చెంబులో నీరు పారబోసుకున్నట్లు?" అన్నది సావిత్రమ్మ.

"అంత తెలివితక్కువ పని చెయ్యమని ఎవరంటారు సావిత్రీ, అంతా నీ పిచ్చిగాని?" అన్నాడు పావనమూర్తి.

"ఎవరూ చెప్పరు గదా! ఆ మాటే నేనూ సుభద్రకి చెప్పాను. ఆ మాటకే దానికి పౌరుషం పొడుచుకొచ్చింది. మన పరువుప్రతిష్ఠలను గంగపాలుచేసే పనికి తనేమీ ఒడిగట్టలేదని వాదిస్తోంది. పెళ్ళికాకుండా ఓ పరాయి మగాడితో రిక్షాలో తిరగడం పరువుని పెంచేపనంటావా అని అడిగాను. అంతే! తన ఘనకార్యం మనదాకా వచ్చేసిందన్న

ఉడుకుమోత్తనమో ఏవిఁటో, ఏడుస్తుంది. ఆ మాత్రం మాటనడం చాదస్తం అనేగా మీ అభిప్రాయం ?" అన్నది సావిత్రమ్మ చురుగ్గా.

"నే నన్నది నీకు సరిగ్గా అర్థంగాలేదు సావిత్రీ !"

సావిత్రమ్మ భర్త చెప్పబోయే సంజా యిషీకి గట్టిగా నవ్వింది.

"అర్థమైంది మాష్టారూ ! పూర్తిగా అర్థమైంది. కాని మీరు తెలుసుకోవలసిం దేమిటంటే చిలక్కి చెప్పినట్లు చెప్పే పరిస్థితి కాధండీ యిది కొంచెం కరుగ్గా వుంటే తప్ప వీల్లేమా అని!" అన్నది.

పావనమూర్తి సగం పకోడీలతో ప్లేటుని అవతలికి జరిపేశాడు. ఇన్ని కాఫీనీళ్ళు గొంతులో పోసుకుని, మూతి తుడుచుకుంటూ సరాసరి కూతురి గదిలోకి వెళ్ళేడు.

సుభద్ర కిటికీవార నిలబడి బైటికి చూస్తోంది.

పావనమూర్తి మంచంమీద కూర్చుని, పక్కన పడున్న మేగజైన్ చేతిలోకి తీసుకుని పేజీలు తిరగేస్తూ, "ఇవ్వాళ రమణారావుకూడా నాతో అన్నాడమ్మా ! నీ మీద అసూయతో లేనిపోనివేవో కల్పించి చెప్పాడేమో అనుకోడానికి వీల్లేకుండా రాత్రే మీ అమ్మ కళ్ళతో చూసేనని చెప్పింది. పోనీ రమణారావుకి అసూయ అనుకున్నా, మీ అమ్మకి అలాంటి భావం వుండటానికి ఆస్కారం లేదనుకుంటాను !" అన్నాడు.

సుభద్ర వెక్కి వెక్కి ఏడుస్తోంది.

పావనమూర్తి హృదయం కరిగి కన్నీరైపోతోంది. కూతురి తలను గుండెలకి హత్తుకుని ఓదార్చాలని పించింది. కాని కూర్చున్న చోట్నుంచి అరంగుళం కూడా కదల్లేకపోయాడు.

"రాజు చాలా మంచివాడు నాన్నా !" అన్నది సుభద్ర కొన్ని క్షణాల తరవాత వెక్కిళ్ళమధ్య.

"నీ నమ్మకాన్ని గానీ, నీ కతని మీదున్న ప్రేమాభిమానాలను గాని కాద నాలని లేదు సుభద్రా నాకు. ప్రేమిం చడం, ప్రేమింపబడటం స్త్రీ పురుషుల జన్మహక్కు. కాని నువ్వు చాలా మంచి వాడని కితాబిస్తున్న ఆ రాజు మహారాజు కుమారుడు ! అతనికి సింహాసనాలూ కిరీ టాలూ లేకపోవచ్చు. లక్షాధికారి, ఎమ్మెల్యే గారి ఏకైక పుత్రుడు అనే భుజకీర్తు లున్నాయి. అలా పొగుడుతూ అతనిలో లేని అహంకారాన్ని, ఐశ్వర్యమదాన్నీ రెచ్చగొట్టే వందిమాగధులు దేశంనిండా లక్షోపలక్షలున్నారు. ఈ వైకుంఠపాళిలో పాములబారి పడకుండా, నిచ్చెనలెక్కి ఆ పరమపదం చేరే అవకాశం మనలాంటి వాళ్ళకి ఉండదు తల్లీ అని చెప్తున్నాను. చేరగలనన్న నమ్మకం నీకుండొచ్చు. కాని, ఆ నమ్మకాన్ని వాస్తవంగా మార్చ డానికి తగిన ఆర్థికపునాది నీ కివ్వగలి గిన స్తోమతు నీ కన్నతండ్రికి లేదని చెప్పడమే నా అభిమతం !" అన్నాడు









పావనమూర్తి. చివరి మాటలు సాధ్యమైనంత నొక్కి నొక్కి చెప్పాడు.

"రాజుకి ఆ భేదాలు లేవు నాన్నా! మన పరిస్థితులు అతనికి పూర్తిగా తెలుసు," అన్నది సుభద్ర చాలా దృఢంగా.

పావనమూర్తి నవ్వేడు.

ఎప్పుడో ఏదో సినిమాలో విన్నాడో, ఏ నవలలోనైనా చదివాడో అతనికి గుర్తులేదు సరిగ్గా. యివే మాటలు కాకపోయినా, యిలాంటివే గుర్తొచ్చేయి.

"సుభద్రా! ఆ రాజుకి లేకపోవచ్చు. కాని రాజు తండ్రి రాజులాంటివాడూ, రాజులాంటి మంచివాడు కావాలనిలేదుగా! అప్పుడీ సమస్యకి పరిష్కారం ఎలాగో ఆలోచించావా!"

సుభద్ర వెంటనే జవాబు చెప్పలేకపోయింది.

"వాస్తవం కలలంత అందంగానూ, మంత్రుల పర్యటనకోసం ప్రత్యేకంగా వేసిన తార్రోడ్డులా నిరాటంకంగానూ ఉండదు సుభద్రా! అసలు మనలాంటి వాళ్ళ జీవితాలు గోతులతోనూ, ముళ్ళకంచెలతోనూ నిండివుంటాయి. అందుకే మీ అమ్మా నేనూ నీ భవిష్యత్తు గురించి ఇంతగా బెంగపడుతున్నాం. ఒక్క ప్రశ్న అడగమంటావా తల్లీ" అన్నాడు పావనమూర్తి.

"అడగండి నాన్నా!" అన్నది సుభద్ర.

అడగబోయి ఆగిపోయేడు పావనమూర్తి. కొన్ని నిముషాలపాటు

మీదే కూర్చుండిపోయాడు అడగకూడదన్న నిర్ణయానికి వచ్చి "వద్దులే సుభద్రా! వద్దులే!" అంటూ లేచి గది బైటికి నడిచేడు. సుభద్ర చప్పున తండ్రికి అడ్డుగా వచ్చింది.

"మీ రడక్కపోయినా ఆ ప్రశ్న నాకు తెలుసు నాన్నా!" అంటూ తండ్రి వక్షస్థలంమీద తలవాల్చి బావురుమన్నది సుభద్ర.

పావనమూర్తికి దుఃఖం పెల్లుబికింది.

"ఏడవకు సుభద్రా! ఈ సమస్యకి పరిష్కారం వెతుకుతాను. కన్న తండ్రిగా ఈ పాటి చెయ్యగలను" అని, కూతురి తలనిమిరి బైటికి నడిచేడు. గుమ్మంపక్కనే నిలబడివున్న సావిత్రమ్మవైపు ఓసారి చూసి తల దించుకుని నడిచిపోయేడు వీధిలోకి.

సావిత్రమ్మ భర్త వెళ్ళినవైపు సజల నేత్రాలతో చూస్తూ వీధి గుమ్మంలో నిలబడిపోయింది. కూతురి గదిలోంచి వెక్కిళ్ళు ఆవిడ చెవుల్లో ప్రతిధ్వనిస్తూనేవున్నాయి.

* * *

సంఘంలో ప్రతిదీ వ్యాపారంగా మారిపోయింది. ప్రతి వస్తువునూ-ఆఖరికి రక్తమాంసాలతో, ప్రాణంతో వున్న శరీరాన్నికూడా అమ్ముకోవచ్చు. ఓపిక వున్నవాడూ, అవసరం వున్నవాడూ కొనుక్కోవచ్చు. అమ్మడం ముందుపుట్టిందో కొనడం నుందుపుట్టిందో చెప్పలేం, విలదీసి ప్రశ్నిస్తే, విత్తుముందా, చెట్టుముందా అన్న ప్రశ్నకి ఏ జవాబొస్తుందో, అదే జవాబు వస్తుంది. ప్రజాస్వామ్యంలో ఓట్లు, కులాలు, మతాలు, కుల సంఘాలు అన్నీ కొనడానికి దొరుకుతాయి.. అమ్మకానికి సిద్ధంగా వుంటాయి. అలాగే పెళ్ళిళ్ళకి.... పెళ్ళికొడుకులు కూడా వివిధ రేట్లలో దొరుకుతున్నారు. డబ్బుకి విలువ పెరిగి, మానవులమధ్య పరస్పర సంబంధాలకీ, అనుబంధాలకీ విలువలు పడిపోయినప్పుడు- జరిగేది వ్యాపారం తప్ప మరేమీ కాదనుకోవడంలో ఆశ్చర్యం లేదు! అసహజమూ వుండదు.

ఎమ్మెల్యే రావుగారు భూస్వామిగా, వ్యాపారస్తుడిగా వుంటూ వున్నప్పుడు కొడుకు రాజురేటు ఒకరకంగా వుండేది. ఆయన ఎమ్మెల్యే అయ్యాక ఆ రేటులో 'సహజంగా' అభివృద్ధి వచ్చింది. పెద్ద భూస్వాములతోనో, వ్యాపారవేత్తలతోనో సంబంధం కలుపుకోవాలన్న ఆలోచన మరో మెట్టు పైకెక్కి, ఇప్పుడు భూస్వామీ + వ్యాపారవేత్త +రాజకీయ నాయకుడితోనో, లేక మంత్రులతోనో సంబంధాలు కలుపుకోవడం మీదికి మళ్ళింది. ఈ మలుపు అనేక విధాలుగా అభివృద్ధికి దోహదకారి అన్న సత్యం ఆయనకి పూర్తిగా అర్థమైంది.

ఆ స్థితిలో - ఎదురుగా కూర్చుని, తన కూతుర్ని - రాజుకి చేసుకోమని



అడగవచ్చిన మాష్టారు పావనమూర్తి ఎమ్మెల్యే రావుగారికి చెల్లని సత్తుపావలా కాసులా కనిపించాడు.

పావనమూర్తికి కూడా తెలుసు, తనెంత సాహసం చేస్తున్నాడో, ఎంత దురాశకి లోనవుతున్నాడో! కాని అతను సరిపెట్టుకున్నాడు. ఈ ప్రయత్నం తనకోసం కాదు. తన బిడ్డకోసం.

"మాష్టారూ! మీరు చెప్పదల్చుకున్న దంతా చెప్పేశారా? ఇంకేమైనా మిగిలిందా?" అనడిగేరు ఎమ్మెల్యే రావుగారు.

"ఇంకేం చెప్పమంటారు సార్! చెప్పవలసిందంతా చెప్పాను. ఇక ఆదుకోవలసిందీ, నా పరువు ప్రతిష్ఠల్ని నిలబెట్టవలసిందీ మీరు!" అన్నాడు పావనమూర్తి వినయంగా.

ఎమ్మెల్యే రావుగారు నవ్వారు. ఆయన నవ్వు ఆ నాలుగు గోడలమధ్య ప్రతిధ్వనించింది. తెల్లబోయి ఆయన వైపే చూస్తూ వుండిపోయాడు పావనమూర్తి.

"మీ రింతసేపూ మీ పరువు ప్రతిష్ఠల గురించి చాలా చెప్పుకుంటూ వచ్చారు. నేను చాలా ఓపిగ్గా విన్నాను. కాని మీరు

తెలుసుకోలేనిది ఒకటుంది. మా వెధవ తెలివితక్కువగా మీ అమ్మాయిచుట్టూ తిరిగి తన అంతస్తుని ఎంత దిగజార్చుకున్నాడో, నా ప్రతిష్ఠకి ఎంత భంగం కలిగించాడో అర్థంచేసుకోలేకపోతున్నారు. సరే! ఒక్క విషయం చెప్తాను వినండి! మీ అమ్మాయిని మా వాడికి చేసుకుంటే మీ రేపాటి కర్చు పెట్టగలరు? నుంచున్న పళాన మా రాజుకి యాభై వేలిస్తామని వస్తున్నారు." అన్నారు రావుగారు చాలా తాపీగా.

పావనమూర్తికి నోట మాటరాలేదు.

"అయినా నాకు తెలీకడుగుతాను మాస్టారూ! మీ అమ్మాయికి చిన్నప్పట్నుంచీ మీ యింటి పరిస్థితులేమిటో తెలియజెప్పలేదటండీ! అంతస్తులు తెలుసుకుని ఆశలు పెంచుకోవాలన్న సంస్కార భావాన్ని ఎందుకు కలిగించలేకపోయారు?" అన్నారు మళ్ళీ రావుగారు.

పావనమూర్తిలో వుద్రేకం గుండె గోడల్ని తన్నుకుని పైకొస్తోంది. కాని గట్టిగా ఎదిరించి మాట్లాడటానికీ, ఆయన అన్నదానిని కొట్టిపారెయ్యడానికి వీల్లేదు. ఇప్పుడాయన మగపిల్లవాడి తండ్రి, పైగా పెద్ద పలుకుబడి గలవాడు. అన్నింటినీ మించి బాగా డబున్నవాడు.

"పోనీ అవన్నీ వదిలెయ్యండి. వాటిని ఎలాగోలా సరిపెట్టుకుందామన్నా, కనీసం మన కులంకూడా ఒకటికాదే!" అన్నారు రావుగారు.

పావనమూర్తి కుంగిపోయాడు. ఇంక తను ఏరకంగానూ ఆయన్ని ఒప్పించలేడు.

"క్లాసులో కూచుని, నీతులు వల్లించినంతమాత్రాన, సంఘంలో పూర్తిగా మార్పొచ్చేస్తుందని ఆశించడం ఆరోగ్యదాయకంకాదు మాస్టారూ! అంత తేలిగ్గా సంఘం మారదు." అన్నారు రావుగారే మళ్ళీ.

"నిజమే రావుగారూ! మీరు చెప్పింది పూర్తిగా నిజం. పొరపాటు నాదే! సంఘంలో వేళ్ళు తన్నుకున్న కుల తత్వాలూ, వర్గవేదాలూ, వరకట్నంలాంటి దురాచారాలూ పోగొట్టడానికి మన తరం వాళ్ళు నదుంకట్టలేకపోయినా, కనీసం పైతరం వాళ్ళయినా పూనుకుంటారన్న ఆశకొద్దీ పసిమనస్సుల్లో ఆదర్శాలు పొదగడానికి ప్రయత్నిస్తున్నాం. కాని, మీలాంటి మహానాయకులు ద్వంద్వ స్వభావాలతో వుంటున్నంతకాలం ఆ ఆశ తీరదని కానుకోలేకపోతున్నాం. వేదికల మీద మీరు చెప్పే ఉపన్యాసాలకీ, ఆచరణలో మీరు చేస్తున్న పనులకీ పొంతన లేనట్లే, తరగతి గదుల్లో మేంచెప్పే నీతులకీ, బైటికి వచ్చాక పిల్లవాడి చుట్టూ వుండే వాతావరణానికీ సంబంధంలేదు. ఏ నీతులైనా, బోధలైనా మార్పుకి దోహదం చెయ్యడం అసంభవం.




ఇలాంటి అస్తవ్యస్త పరిస్థితుల్లో మనిషి మనిషిగా గౌరవింపబడడం గానీ, మనస్సులోని పవిత్రమైన ఆలోచనలకి విలువగానీ వుండవు." అన్నాడు పావన మూర్తి, రాని చిరునవ్వుని పెదవుల మీదికి తెచ్చుకుని.

రావుగారి మొహం జేవురించింది. ఆయనేదో అనాలని ప్రయత్నిస్తూండ గానే, ఆయన సుపుత్రుడు రాజు గబ-గబ లోపలికి వచ్చేడు. సరాసరి మేడ మీదికి వెళుతున్నవాడల్లా తండ్రితో మాట్లాడుతున్న కొత్తవ్యక్తిని చూసి ఆగేడు.

"రాజు బాబూ! వీరు పావనమూర్తి మాష్టార్రా! తన కూతుర్ని నీకివ్వాలని వచ్చారు! ఆ పిల్ల నీ మీద మనసు పడిందటగా?" అన్నాడు రావుగారు.

రాజు గట్టిగా నవ్వేడు. ఆ నవ్వు అచ్చు గుద్దినట్లు రావుగారి నవ్వే. నాలుగు గోడల మధ్య ప్రతిధ్వనించింది.

"ఆ అమ్మాయి నీతో చాలా స్నేహంగా తిరిగిందిట?" అని ప్రశ్నించేరు రావుగారు.

"నాతో తిరిగిన ప్రతి ఆడపిల్లని పెళ్ళిచేసుకోడానికి ఎలా సాధ్యమవుతుంది నాన్నా! అలా చేసుకోవాలంటే కనీసం దశనుమందికైనా తాళికట్టాలి. నా వల్లకాదు. నేనేవీఁ శ్రీకృష్ణపరమాత్మని కాదుమరి. ఆ విషయం మాష్టారికి స్పష్టంగా చెప్పండి!" అంటూ మెట్లెక్కి-పైకి వెళ్ళిపోయాడు ప్రిన్స్, చార్మింగ్, డార్లింగ్ అఫ్ ద సిటీ!

రావుగార్ని ఎదిరించి, ప్రేమకోసం గట్టిగా నిలబడే ఆదర్శ యువకుడేమో

అతనని ఏమూలో అశ పెంచుకున్న పావనమూర్తి పాతాళానికి పడిపోయాడు. చప్పున లేచి నిలబడి, గుమ్మంవైపు కదిలాడు.

"గొప్ప జోకులు వేస్తావురా రాజూ నువ్వు!" అని కొడుకుని మెచ్చుకుంటున్న రావుగారి గొంతు పావనమూర్తి చెవుల్లో సీసం కరిగించి పోసినట్లు ధ్వనించింది.

జీవంలేని శిధిలశిల్పంలా రోడ్డుమీద నడుస్తున్నాడు. కళ్ళు వర్షిస్తున్నాయి. హృదయం రోదిస్తోంది. ప్రపంచం పరిహసిస్తోంది. కాని ఆయన పెదవుల మీద చిరునవ్వు అలాగే వుంది.

గుమ్మంలో కాలుపెట్టిన పావనమూర్తికి సుభద్ర ఆశగా ఎదురొచ్చింది.

"అమ్మా సుభద్రా! నిస్వార్థంగా పంచియిచ్చే నీ వంటి ఆడపిల్ల ప్రేమని పొందే అర్హత రాజులాంటి వాళ్ళకి లేదమ్మా! వాళ్ళు అపాత్రులు! అంతే!" అన్నాడు పావనమూర్తి.

సావిత్రమ్మ కూతుర్ని గుండెల్లో పొదువుకుని మౌనంగా కన్నీరు కారుస్తోంది.

"ఈ పరిస్థితుల్లో నేను వెదికితెచ్చిన వాణ్ణి చేసుకోమని అడగలేను. నాకు మగపిల్లలు లేనేలేరు. నేటినుంచి ఆ స్థానం నీదేనమ్మా. ఈ కుటుంబభారాన్ని కొంత భరించడానికి ప్రయత్నించు. ఆ పైన మన అదృష్టం ఎలా వుంటే అలా జరుగుతుంది." అన్నాడు పావనమూర్తి.

చేతిరేఖలకీ, పుట్టుమచ్చలకీ భాష్యకారులున్నట్లు, మనిషి కొన్ని కొన్ని పరిస్థితుల్లో విసిరే చిరునవ్వుకి అర్థం చెప్పగలిగేవాళ్ళుంటే, 'భూదేవికే కాదు, సహనం గురించి నాకూ బాగా తెలుసు' అన్నభావం ఆ చిరునవ్వు వెనుక తప్పకుండా కనిపిస్తుంది.






(గత సంచిక తరువాయి)

పూర్ణయ్య యింక మాట్లాడలేదు. కాని నాగార్జున భవిష్యత్తు గురించి ఆలోచించకుండా వుండలేకపోయాడు. తనకు తెలిసినంతవరకు కృష్ణమరాయునికి యింక మిగిలింది పశువుల మేతకు మిగిలిన బీడు తప్ప మాగాణీ అంటూ సెంటు భూమి కూడా మిగలలేదు. ఇంట్లో కూడా ఏమీ మిగలలేదని తనకి తెలుసు. వారి తాతతండ్రులు దాన ధర్మాలుగా యిచ్చిన సత్రవు మాన్యాలు, ఆలయ మాన్యాలూ, దేవదాసీ మాన్యాలు వారి వారి అధీనంలో వున్నాయి. వాటిని కృష్ణమరాయుడు ఏనాడో మరచిపోయాడు. వాటిని ఆశించే మనస్తత్వం కాదతనిది. మరి భవిష్యత్తు గడవడం

**వి. యన్. రావు & శివదత్**

ఎలాగో ఎంత ఆలోచించినా పూర్ణయ్యకు పాలుపోవడంలేదు.

## 42

పట్నం వెళ్ళి భూమి రిజిస్ట్రేషను చేయించి సొమ్ము తీసుకొని పూర్ణయ్య, కృష్ణమరాయుడూ తిరిగివచ్చారు. తిరిగి వచ్చేసరికి పొద్దుపోయింది. ఆకాశం నిండా మబ్బులు కమ్ముకున్నై, గాలి చాలా తీవ్రంగా వీస్తోంది. చినుకు చినుకు గాలివాన అయిందన్నట్లు ఆ గాలీ మబ్బులూ గాలివానగా మారాయి. రెండు రోజులపాటు మనిషి బయటకు రావడానికి వీలులేకుండా గాలివాన. చిన్న చిన్న పూరిళ్ళు, తాటాకిళ్ళు కప్పులు లేచి పోయాయి. కొన్ని పాతిళ్ళు కూలి పోయాయి.

పూర్ణయ్య యింటికి ఆయన బావ మరిది రాఘవాచారి వచ్చి వుండి పోయాడు, గాలివానకు దడిసి. "ఇంత పెద్ద తుఫాను యీ మధ్య నేను చూడ లేదు," అన్నాడు పూర్ణయ్యతో రాఘవా చారి కాస్త వాన తెరిపిచ్చిన రోజున.

"నేను పుట్టేక చూడలేదు" అన్నాడు పూర్ణయ్య. ఇద్దరూ ఆలయానికి బయలు దేరారు. అదే సమయానికి కృష్ణమ రాయుడు కూడా ఆలయానికి చేరు కున్నాడు.

రాఘవాచారి కృష్ణమరాయునికి తెలి సినవాడే. కృష్ణమరాయునికి రాఘవాచారి అంటే గౌరవం. వారు భద్రాచలం రామాలయంలో పెద్ద పూజారి.

"ఎప్పుడు వచ్చారు?" అని ఆదరంగా పలకరించాడు కృష్ణమరాయుడు, వారికి నమస్కరించి.

"తుఫానుకి ముందురోజున బాబూ." అన్నాడు రాఘవాచారి.

"వెంట తీసుకువచ్చాడు మా బావ" అన్నాడు నవ్వుతూ పూర్ణయ్య.

ముగ్గురూ నవ్వుకున్నారు. అలా ఆలయప్రాంగణంలో తిరుగుతూ వుండగా చటుక్కున రాఘవాచారి దృష్టి ధ్వజస్తంభంమీద పడింది.

"అన్నన్నా! ఎంతపని జరిగింది?" అన్నాడు రాఘవాచారి.

"ఏమిటి స్వామీ? ఏమైంది?" అన్నాడు కృష్ణమరాయుడు కాస్త కంగారుగా.

"ధ్వజస్తంభం వరిగింది. బహుశా తుఫానుకుముందే యీ స్తంభం వరిగి వుంటుంది. అందుకే యింత తుఫాను వచ్చింది. ధ్వజస్థంభం వరగడం గ్రామానికి అరిష్టం." అన్నాడు రాఘవాచారి.

"మరిప్పుడు ఏమి చెయ్యాలి?" అన్నాడు కృష్ణమరాయుడు.

"పునఃప్రతిష్ట చేయించాలి వెంటనే."

"దానికి చాలా ఖర్చు అవుతుంది. అది మాటలతో జరిగేపనా?" అన్నాడు పూర్ణయ్య.

కృష్ణమరాయుడు క్షణంపాటు మౌనంగా వుండిపోయాడు. 'రాఘవా చారి పేరుమోసిన వాస్తుశాస్త్రవేత్త.

అతని చేతిమీదుగా దాదాపు పది వైష్ణవాలయాలు కట్టించాడు. అంతటి పెద్ద మనిషి చెబుతూవుంటే కొట్టిపారేయడానికి వీలులేదు. గ్రామానికే అరిష్టం అంటే జాప్యంచేయడం సబవుకాదు.' అలా తనలో తనే ఆలోచించుకుంటూ వుండిపోయాడు కృష్ణమరాయుడు.

"సరేలెండి, నెమ్మదిగా శాంతి పెళ్ళి జరిగిపోయాక చూద్దాం. అందాకా బోటు పెట్టించి నిలబెడదాం స్తంభాన్ని" అని సలహా యిచ్చాడు పూర్ణయ్య.

"అలాకాదు పూర్ణయ్యగారు. గ్రామానికి అరిష్టమని రాఘవాచారిగారు చెప్పినా ఉపేక్షించడం సబవుకాదు. దైవకార్యంకంటే స్వకార్యం ముఖ్యం కాదు. గ్రామక్షేమంకంటే మన క్షేమం, మన సుఖం ప్రధానం కాదు. ఆలస్యం చేయక వెంటనే ధ్వజస్తంభం పునః ప్రతిష్టకు ఏర్పాట్లు చేయండి." అని ఆదేశించాడు కృష్ణమరాయుడు. పూర్ణయ్య మారుమాటకుండా శిలాప్రతిమలా వుండిపోయాడు.

"నేను అలా గూడెంవైపు వెళ్ళి వస్తాను. యిళ్ళు కప్పులు లేచిపోయాయట." అంటూ ఆలయం దగ్గరనుంచి గూడెంవైపుకు బయలుదేరాడు కృష్ణమరాయుడు.

అడ్డయిళ్ళు కూలిపోయి నీడలేని జనం కృష్ణమరాయుణ్ని చూడడంతోటే తప్పిపోయిన బిడ్డకి తల్లి కనిపించినంతగా ఆనందించాడు.

"మీరంతా సత్రవులోకి వెళ్ళండి. మీ యిళ్ళు యీ రోజునుంచే బాగుచేయించే ఏర్పాటు చేస్తాను. పిల్లల్ని, ఆడవాళ్ళని సత్రవుకు తీసుకువెళ్ళి ముందు భోజనాలు చేయండి." అని వాళ్ళకు ధైర్యంచెప్పాడు. దగ్గరవుండి వెంట ఆ జనాన్నందరినీ సత్రవుకు తీసుకొని వెళ్ళి, సత్రపు గుమాస్తాతో వాళ్ళందరికీ భోజనాలు ఏర్పాటు చేయమని చెప్పాడు. అలా ఆ రోజంతా తుఫానుకు గురైన జనాన్ని ఆదరణతో పలకరించడం, ఆదరించడంతోటే సరిపోయింది. చీకటిపడ్డాక యిల్లు చేరుకున్నాడు కృష్ణమరాయుడు.

కృష్ణమరాయుని రాకకోసం పూర్ణయ్య ఎదురుచూస్తున్నాడు కచేరి సావిట్లో కూర్చొని.

"నాన్నగారు యింకా రాలేదా తాతగారు." అని పలకరించి వెళ్ళింది శాంతి.

"లేదమ్మా" అని బదులుచెప్పి, ఆలోచనలోపడ్డాడు పూర్ణయ్య.

శాంతి కృష్ణమరాయునికి ఒక్కగానొక్క కూతురు. ఆ పిల్ల పెళ్ళికని వున్నదంతా తెగనమ్మి డబ్బు సిద్ధం చేసుకొని, తీరా ఆ డబ్బు ధ్వజస్థంభం కోసం ఖర్చుపెడితే, పిల్ల పెళ్ళి ఎలా జరుగుతుందని కృష్ణమరాయుని ఆలోచన: మరీ యింత దూరదృష్టి లేనివాడయ్యేదేమిటి? అతన్ని ధ్వజస్థంభ పునః ప్రతిష్ట కార్యక్రమం నుంచి మళ్ళించి,

శాంతి పెళ్ళి ధ్వజస్థంభ పునఃప్రతిష్ట కంటే ముఖ్యమని ఎలా చెప్పించడం— తన బావమరిది రాఘవాచారి ముందుగా ఆ ధ్వజస్థంభం సంగతి తనతో మాట్లాడి వున్నా కృష్ణమరాయుని ముందు చెప్ప విచ్చి వుండేవాడు కాదు తను. సరాసరి కృష్ణమరాయుని ముందే అనేసాడు వూరుకు అరిష్టమని. కృష్ణమరాయుడు ధ్వజస్థంభ పునఃప్రతిష్ట జరగాల్సిందేనని అనేశాడు. అన్నమాట వెనక్కి తీసుకోవడం ఆ వంశంలో నేలేదు. కృష్ణమరాయునికి అసలు చేతగాదు— అలా పూర్ణయ్య ఆలోచిస్తూ కచేరీ సావిట్లో పచార్లు చేస్తూవుండగా కృష్ణమరాయుడు వచ్చాడు.

"ఎంత సేపైంది మీరొచ్చి?" అన్నాడు లోపలికివస్తూ కృష్ణమరాయుడు.

"ఆలయంనుంచి సరాసరి యిటె వచ్చాను." అన్నాడు పూర్ణయ్య తల వంచుకొని.

"ఏదేనా పనిమీద వచ్చారా?"

"ఔను. ఒకమాట చెప్పిపోదామని వచ్చాను."

"సెలవియ్యండి?"

"యిప్పుడు ఈ ధ్వజస్థంభ ప్రతిష్ట కంటే శాంతి పెళ్ళి ముఖ్యం."

కృష్ణమరాయుడు పూర్ణయ్య మాటలకు చిరునవ్వు నవ్వాడు. "మీకు మా కుటుంబంమీద వున్న అభిమానంకొద్దీ అలా ఆలోచిస్తున్నారు గానీ, నిష్పక్షపాతంగా ఆలోచిస్తే ధ్వజస్థంభ పునప్రతిష్టే ఇప్పుడు ముఖ్యమని మీరే చెప్పకుంటారు," అన్నాడు కృష్ణమరాయుడు.

"తనకు మాలిన ధర్మం వుండదు కృష్ణమరాయా" అన్నాడు పూర్ణయ్య అతన్ని ఎలా ఒప్పించాలో తెలియక.

"తనకోసం ఆలోచించేవాడు దాన ధర్మాలు చేయలేడు పూర్ణయ్యగారు. అందుకే దానకర్ణుడని పేరు తెచ్చుకున్న మహానుభావుడు కుడిచేత్తో చేసే దానం ఎడంచేతికి తెలియనిచ్చేవాడు కాదట. ఎడమచేతికి దొరికినది ఎడమచేత్తోటే దానం చేసేవాడు కాని, కుడిచేతికి మార్చే దాకా ఆగేవాడు కాదట. కారణం ఆ వస్తువు ఎడమచేతినుంచి కుడిచేతికి మారే లోపున మనసు మారుతుందని భయం— ఇంత తర్జనభర్జన దేనికీ— ఒక్క ప్రశ్న అడుగుతాను సమాధానం చెప్పండి. శాంతి పెళ్ళికోసం డబ్బు ఏర్పాటు చేసాము నిజమే. ఇప్పుడు అనుకోకుండా నాకే ఏదో పెద్ద జబ్బుచేసింది. చాలా డబ్బు ఖర్చవుతుంది మీరు ఆ డబ్బుతో నాకు వైద్యం చేయిస్తారా, శాంతికి పెళ్ళి జరిపిస్తారా?"

"మీకు వైద్యమే చేయిస్తాను."

"ఎందుకనీ?"

"పెళ్ళి వాయిదావేసి మరో ముహూర్తాన జరిపించవచ్చు. వ్యాధిని వుపేక్షించి వైద్యం వాయిదావేస్తే మనిషే దక్కకపోవచ్చు కదా."

"ఔనా మరి! నా బిడ్డ పెళ్ళే ముఖ్య మని గ్రామ ప్రజలకు పట్టిన అరిష్టాన్ని వదలింపెడం వాయిదావేయడం కూడా నా వ్యాధికి వైద్యం వాయిదావేయడం లాంటిదే కదా."

పూర్ణయ్యకు కృష్ణమరాయుని వాదా నికి సమాధానం దొరకలేదు.

కాని చివరికి ఒక్క మాట మాత్రం అనగలిగాడు పూర్ణయ్య-

"ఈ గ్రామానికీ, ఆలయానికీ 'ధర్మ కర్తగానే ఆలోచిస్తున్నావు గాని, ఆడ పిల్ల తండ్రిగా ఆలోచించడం లేదు నీవు కృష్ణమరాయా" అని.

"బాధ్యతలకీ బంధాలకీ ఎప్పుడూ సంఘర్షణ తప్పదు పూర్ణయ్యగారు. బంధాలను వదలుకొని ఏనాడో బాధ్యత లకు తలవంచాను. యీ జీవితం యిలాగే సాగిపోనివ్వండి. రాఘవచారి గారిని ధ్వజస్థంభం నిలబెట్టేదాకా యిక్కడే వుండమని నా మాటగా చెప్పండి. ఏర్పాట్లు చూడమనండి." అని చెప్పి లోపలికి వెళ్ళి డబ్బు తెచ్చి పూర్ణయ్యచేతికిచ్చాడు కృష్ణమరాయుడు. పూర్ణయ్య మాడుమాట్లాడకుండా డబ్బు తీసుకున్నాడు.

వయసులో తలనెరసినవాడే అయినా కృష్ణమరాయుని ముందు చాలా చిన్న వాడిగా అయిపోయాడు పూర్ణయ్య ఆ క్షణంలో.

## 43

రాఘవాచారి సరిగ్గా నెలరోజుల వ్యవ ధిలో ధ్వజస్థంభ ప్రతిష్టకు ముహూర్తం పెట్టాడు. ప్రస్తుతం వరిగిన స్థంభం నిలబెట్టడంకంటే కొత్త స్థంభం తెప్పించడమే శ్రేయస్కరమని నిర్ణ యించి, దండకారణ్యప్రాంతానికి మను షుల్ని పంపించాడు వేరే స్థంభం తీసు కొని రావడానికి.

ముహూర్తానికి నాలుగురోజుల ముందే స్థంభం వచ్చేసింది. పాతస్థంభం కంటే యీ స్థంభం భారీగానూ, లావుగాను కూడా వుంది. దాని చుట్టూ కంచురేకు కప్పించారు చితికిపోకుండా.

చుట్టుప్రక్కల గ్రామాల నుంచీ, పుణ్యక్షేత్రాల నుంచీ బ్రాహ్మణ్యాన్నీ పండిత శ్రేష్టులనూ పిలిపించాడు రాఘవయ్య.

ఊరు కలకలలాడుతోంది పందెళ్ళ తోటీ, అలంకరణలతోటీ, ధ్వజస్థంభ ప్రతిష్టకై జరిగిన ఏర్పాట్లతోటీను.

ముహూర్త ప్రకారం ప్రతిష్ట జరిగి పోతోంది. చాలామంది జనం వచ్చారు. సంతర్పణలూ, సమారాధనలు మూడు రోజులపాటు ఎడతెరిపిలేకుండా జరి గాయి. కొత్త వియ్యాలవారు రాజా చంద్రశేఖరంగారి కుటుంబం కూడా ఆ వుత్సవ వైభవాన్ని చూడ్డానికి. వచ్చారు. వెంట కిషోర్ కూడా వచ్చాడు. కిషోర్ శాంతిని చూసాడు. శాంతి

కిషోర్‌ను చూసింది. ఒకరిని చూసి ఒకరు లోలోనే మురిసి పోయారు. వారలా మురిసిపోవడం చూసిన పూర్ణయ్య వారిద్దరినీ ఎలాగైనా ఓ యింటివాళ్ళను చేయి స్వామీ అని వేణుగోపాలుడ్ని మనసారా ప్రార్థించు కున్నాడు.

నూతన ధ్వజం ఆలయానికే కొత్త అలంకరణలా వుంది మెరసిపోతూ.

ప్రతిష్ఠాకార్యక్రమం ముగిసింది. జనం సద్దుమణిగారు. రాజాచంద్రశేఖరం గారు కూడా కృష్ణమరాయుడ్ని అభినం దించి శలవుతీసుకొని వెళ్ళిపోయారు. వెళ్ళబోయే ముందు "శుభలేఖలు త్వర లోనే పంపిస్తాను" అని కృష్ణమరాయు నికీ, పూర్ణయ్యకూ చెప్పి మరీ వెళ్ళా రాయన.

కృష్ణమరాయుడు కాదనలేదు. నవ్వుతూ "మీ రెలా అంటే అలాగే. మేము సిద్ధమే" అని మాత్రం అన్నాడు.

కృష్ణమరాయుని ధైర్యానికి ముగ్ధ డయ్యాడు పూర్ణయ్య.

ఆస్థి అమ్మగా వచ్చిన డెభ్భైఅయిదు వేల రొఖ్ఖంలోనూ - యీ క్రతువుకే దాదాపు నలభై వేలదాకా ఖర్చు అయి వుంటుంది. యిళ్లు కూలిపోయినవాళ్ళకీ, కప్పులు లేచిపోయినవాళ్ళకీ దానంగా యిచ్చినది కనీసం యిరవై వేలుదాకా వుంటుంది. ఇక మిగిలింది పదిహేను వేలకంటే వుండదు. ఆ పదిహేను వేలతో పెళ్ళి ఎలా చేద్దామని కృష్ణమ రాయుడు అనుకుంటున్నాడో పూర్ణయ్యకు అర్థంకాలేదు. జరిగేది చూస్తూ వుండడం తప్ప తాను చేయ గలిగింది ఏమీ లేదన్న నిర్ణయానికి వచ్చాడు చివరికి.

కాకపోతే అన్నింటికీ ఆ వేణు గోపాలుడే వున్నాడన్న తృప్తివాక్యాన్ని మనసులోనే నెమరువేసుకున్నాడు ఓసారి.

## 44

రాజా చంద్రశేఖరంగారు శుభలేఖ పంపించారు. ముహూర్తం సరిగా యింక యిరవై అయిదు రోజులు మాత్రమే వుంది. శుభలేఖ కృష్ణమ రాయుడు అందుకొని తృప్తిగా చూసాడు. మర్యాద నిలబెట్టుకోవడం కోసం తాను కూడా మూడు రోజులలోనే శుభలేఖ అచ్చువేయించి రాజా చంద్రశేఖరంగారి దివాణానికి పంపించాడు.

ఉన్న డబ్బుతో పెళ్ళిపనులు జరుగు తున్నాయి. శాంతి తల్లిలేని పిల్ల అన్న జాలితో యిరుగుపొరుగు ఆడవాళ్ళు పెళ్ళిపనులు చేసిపెడుతున్నారు. పూర్ణయ్యగారి భార్య ఉదయం వచ్చి, సాయంత్రం యింటికి వెడుతోంది పెళ్ళి పనులు చూసుకుని.

రోజులు గడుస్తున్నాయి.

రోజులు గడుస్తున్నకొద్దీ ముహూర్తం దగ్గర పడుతోంది.

# ఆగస్ట్ నెల యువ
# భావ పరిచయ పోటీ

**బహుమానము రూ 25-00**



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

*గమనిక :* వ్యాఖ్యలు పోస్టుకార్డుపై వ్రాసి ఆగస్టు 5వ తేదీలోగా పంపవలెను.

---

జూన్ నెల భావపరిచయ పోటీ

రూ 25.00 బహుమతి పొందిన వ్యాఖ్య

సంతాన ప్రగతి

సంసారం అధోగతి

—శ్రీమతి ఆర్. స్వర్ణలత, కాగితాలపేట, కడప జిల్లా.

ముహూర్తం దగ్గర పడుతున్నకొద్దీ కృష్ణమరాయునిలో అస్థిమితం పెరుగుతోంది. పూర్ణయ్యకు యీ ముహూర్తానికి పెళ్ళి ఎక్కడ జరక్కుండా పోతోందోనన్న భయం పెరుగుతోంది.

ఆలయ మండపంలో పూర్ణయ్య, కృష్ణమరాయుడు కూర్చున్నారు ఓ సాయంత్రపువేళ.

"ముహూర్తం యింక వారం రోజులే వుంది" అన్నాడు పూర్ణయ్య.

"ఔను" అన్నాడు కృష్ణమరాయుడు విరక్తంగా.

"ఏభై వేలు యిస్తామన్నాం కట్నంగా. వుందా మరి ?"

"భోజనాల ఏర్పాట్లకు ఉన్నది సరిపోతుంది. కట్నంగా యిద్దామనుకున్న యాభై వేలూ, పెళ్లివారికి బట్టలూ, లాంఛనాలు వగైరాలకి ఎక్కడేనా అప్పు చేయాలి."

"శెట్టిని కబురంపి అడక్కపోయారా?"

"అతని కివ్వాల్సిందే యివ్వలేదు. మళ్ళీ అడగడం బాగోదు. అడిగినా లేదనొచ్చు."

"మరింకెవరిని అడగాలనుకుంటున్నట్లు ?"

"బయటవూరివాళ్ళను అడిగితే బాగుంటుందేమో అనుకుంటున్నాను."

"తీర్చే మార్గం ?"

"యిల్లు వుందిగా యింకా ?"

కృష్ణమరాయుడు ఆమాట అనగానే పూర్ణయ్యకు నెత్తిన పిడుగుపడ్డట్టనిపించింది. విలవిలలాడిపోయాడు.

"ఆ యింట్లో తరతరాలుగా సర్వభోగభాగ్యాలూ అనుభవించారు. యిప్పుడు ఆ యింటిని అమ్మడం" అని పూర్ణయ్య మాట పూర్తిచేయకుండానే

"భోగభాగ్యాలు అనుభవించడానికి అంత యిల్లు కావాలిగాని, లేమిని అనుభవించడానికి అంత యిల్లు అక్కర్లేదు పూర్ణయ్యగారూ" అన్నాడు కృష్ణమరాయుడు.

"లేమిని గుట్టుగా అనుభవించాలన్నా అంత యిల్లు కావాలి కృష్ణమరాయా" అని మాత్రం అనగలిగాడు బొంగురుపోయిన గొంతుతో పూర్ణయ్య.

"మీకు తెలిసినవారెవరైనా వున్నారా, యింటిమీద అప్పు యివ్వడానికి ?" అన్నాడు కృష్ణమరాయుడు తల వంచుకొని.

"మీరు దానధర్మాలు చేసినంత విరివిగా అప్పు పుట్టదు కృష్ణమరాయా. అప్పిచ్చేవాడు చాలా లెక్కలు వేసుకుంటాడు. అంత యిల్లు ఏంచేసుకోవాలో కూడా ఆలోచిస్తాడు. అయినా ప్రయత్నిద్దాం" అని లేచాడు పూర్ణయ్య.

కృష్ణమరాయుడూ బయలుదేరాడు.

'నదిలో నీరున్నన్నాళ్లు ఎవరు దాహం తీర్చుకున్నా అడ్డు చెప్పదు. నీళ్ళు ఇంకుతున్నాక ఎండిన నదికి దాహం

తీర్చుకుందుకు వచ్చేవాళ్లూ వుండరు. నదిలో నీరు పోసేవాళ్ళూ వుండరన్న సంగతి గ్రహించలేకపోయాడు కృష్ణమరాయుడు' అనుకున్నాడు పూర్ణయ్య.

## 45

ఓ పర్వదినాన రాధా భీముడూ కలిసి ఆలయానికి వచ్చారు. పూర్ణయ్యగారి చేత అర్చన చేయించిన తర్వాత తీర్థ ప్రసాదాలు తీసుకుంది రాధ. పూలసజ్జ అందుకుంటూ "పెళ్ళివనులు ఎంతవరకూ వచ్చాయి?" అని అడిగింది రాధ శాంతి పెళ్ళిని ఉద్దేశించి పూర్ణయ్యను.

పూర్ణయ్య బరువుగా నిట్టూర్చి "యేదో వానాకాలం చదువులా సాగుతున్నాయమ్మా" అన్నాడు నిస్పృహగా.

బయలుదేరబోయిన రాధకు అడుగు ముందుకు పడలేదు. అక్కడే ఆగిపోయింది. పూలసజ్జ భీమునిచేతికి అందించి "కాస్త విపులంగా చెప్పండి.ముహూర్తం దగ్గర పడుతోందనుకుంటాను. పెళ్ళి పనులు మందకొడిగా జరగడానికి కారణమేమిటి?" అని గుచ్చి అడిగింది రాధ.

స్వామి దర్శనానికి వచ్చే భక్తులరద్దీ యింకా పెరగకపోవడంతో "నీకు గాక యింకేవరికి చెబుతాను? రా అమ్మా! యిలా కూర్చో" అంటూ పూర్ణయ్య ముందున్న మండపంలో ఓ స్థంభానికి చేరబడి చతికిలబడ్డాడు.

రాధా భీముడూ కూడా పూర్ణయ్యకు అభిముఖంగా కూర్చున్నారు.

"ముహూర్తం దగ్గర పడిందంటున్నావు. పెళ్ళి ఎప్పుడో నీకు తెలీదా అమ్మా" అన్నాడు పూర్ణయ్య.

"తెలీదండి" అంది రాధ.

"సరిగ్గా యీ నాటికి పదిరోజులు మాత్రమే వుంది వ్యవధి. పదవరోజుకి పెళ్ళివారు మనవూళ్ళోకి దిగుతారు."

"మరింకా ఎక్కడా హడావిడి లేదేమిటి? కృష్ణమరాయులవారి పెళ్ళికి యీ పాటికి ఎంత హడావిడిగా వుందో మీకు మాత్రం గుర్తులేదా!" అంది రాధ కాస్త కంగారుగా.

"గుర్తువుందమ్మా కాని ఆ పెళ్ళి నాటి పరిస్థితులు వేరూ- యీ పెళ్లినాటి పరిస్థితు వేరు. అయితే నీకు యింతవరకు పెళ్ళి ఎప్పుడో ఖచ్చితంగా తెలీదన్న మాట."

"తెలియకపోయినా ఫరవాలేదులెండి కాని, శాంతి పెళ్ళి వైభవంగా జరగాలి" అంది రాధ ఆవేశంగా-

"అసలు జరుగుతుందా అన్నదే నా భయం" అన్నాడు పూర్ణయ్య ముక్తసరిగా-

"వచ్చిన యిబ్బంది ఏమిటోచెప్పండి. మొగపెళ్ళివారు తరఫునుంచి ఏదైనా యిబ్బంది వచ్చిందా- లేక " అని యింకా రాధ పూర్తిచేయకుండానే, పూర్ణయ్య "అదేమీ కాదమ్మా యిబ్బంది వచ్చింది మన పక్కనుంచే! మొగపెళ్ళివారు కావాలని శాంతిని తమ

ప్రకృతి రహస్యం కనుగొనబడింది!




# ఇది సహజంగా, మృదువుగా మీ వంటి చాయను పెంపొందిస్తుంది

ఫెయిర్ అండ్ లవ్లీలో గల ఒక ప్రత్యేకమైన పదార్థం చర్మం లోపల పనిచేస్తుంది. అదీ సహజంగా, మృదువుగా, సురక్షితంగా. అంతేకాదు, ఫెయిర్ అండ్ లవ్లీ మీ చర్మాన్ని బయట నుంచి కూడా సంరక్షిస్తుంది. దీనిలోని సూర్య కిరణాలను వడబోసే పదార్థాల మిశ్రమం, మీ చర్మం ఎండవల్ల నల్లబడకుండా కాపాడుతుంది. అయినప్పటికి సూర్య కిరణాలలోని ఆరోగ్యమంతటినీ మీరు పూర్తిగా పొందగలుగుతారు. ఫెయిర్ అండ్ లవ్లీని రోజూ గనక వాడితే, 6 వారాలలో మీ శరీర చాయను ఇతరులు మెచ్చేలాగ ఎర్రబరుస్తుంది.




**ఫెయిర్ అండ్ లవ్లీ—నల్లని చర్మాన్ని ఎర్ర బరచడం కోసం సున్నితమైన తీరు**

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్ FALOV 10 1710 TL

యింటి కోడలుగా చేసుకుంటున్నారు. మనం ఎలా అంటే అలాగే అన్నారు గాని వారంతట వారుగా ఏమీ కోరలేదు. నిర్దేశించ లేదు. ఇంతకీ మనం యిచ్చిన మాట నిలబెట్టుకొనే నిమిత్తం మన కృష్ణమరాయుడు చెరువు క్రింది సుక్షేత్ర ఖండికలాంటి మాగాణీ చెక్కను అమ్మి శాంతి పెళ్ళికి సిద్ధంచేసారు.

"కాకపోతే అదే సమయానికి తపానూ, ధ్వజస్థంభం ప్రతిష్ఠ సంతర్పణలూ, సమారాధనలూ మీకు తెలిసినవేగా.... దాంతో శాంతి పెళ్ళికోసం కేటాయించిన పైకం హారతి కర్పూరంలా అరాయించుకు పోయింది. పెళ్ళి చూస్తే దగ్గర పడుతోంది. మరో మార్గం ఏమీ కనబడటం లేదు. యిటువంటి పరిస్థితులలో పెళ్ళిపనులు మందకొండిగా కాక చకచకా ఎలా సాగుతాయమ్మా." అని వివరించాడు రాధకు.

రాధ బరువుగా నిట్టూర్చి, ఒకక్షణం ఆలోచించి, "రేపు ఒకసారి తమరు మాయింటికి రాగలరా ?" అంది.

"తప్పకుండా నమ్మా"

"యీ పెళ్ళి ఎట్టి పరిస్థితులలోనూ అగడానికి వీల్లేదు పూర్ణయ్య గారు," అని రాధ ఆలయంనుంచి యింటికి వెళ్ళి పోయింది.

## 46

"నీ కబురు అందాక యింక ఆలశ్యం చేయలేక వచ్చి వాలిపోయాను. మరొకరెవరేనా యింత రాత్రివేళ కబురంపితే నేను చచ్చినా వెళ్ళను." అని వెకిలి నవ్వు నవ్వాడు శెట్టి రాధయింట్లో రాధకు ఎదురుగా కుర్చీలో కూర్చుని.

రాధ శెట్టికి ఎదురుగా వున్న గుమ్మానికి ఆనుకొని నిలబడి వుంది.

"తమతో ముఖ్యమైన పనివుండి కబురంపాను." అంది రాధ.

"చెప్పు యింకా ఆలశ్యం దేనికి."

"నా మాట తీసెయ్యనని మాటిస్తే చెబుతాను."

"విషయం తెలియకుండా మాటెలా యిమ్మంటావ్ రాధా ? అసలే నా మనసు వెన్నపూస. నువ్వడిగితే నే కాదంటానా"

"నాకు డబ్బు కావాలి."

"ఎంత ? వందా ? రెండొందలా ? వెయ్యా ? చెప్పు ?"

"యాభై వేలు పైనే కావాలి"

"అమ్మబాబోయ్. యాభై వేలు పైనే! నన్ను నడివీధిలో నిలబెట్టి అమ్మినా అందులో సగం రాదు. నావల్ల కాదు తల్లో. వస్తాను." అని లేచాడు శెట్టి.

"కూర్చోండి శెట్టిగారూ నేనుఅడుగుతున్నది దానంగానో, అప్పుగానో కాదు. నాకున్న ఆస్థి మొత్తం రాయించుకొని యిమ్మంటున్నాను."

"నీ ఆస్థి ఎంతవుందో, ఎక్కడుందో నాకేం తెలుసు చెప్పు."

"ఊళ్ళోవారు మీకు తెలీదంటే నమ్ముతానా నేను. యీ యిల్లు కనబడుతోనే వుంది కదా," అంది రాధ.

"రైటే యిల్లు బాగానే వుంది. యీ వీధిలోవున్న యింటికి నేనొచ్చి కాపురం పెట్టలేను కదా. యీవూళ్ళో యిలాంటి యింటికి ఏమి ధర పలుకుతుంది చెప్పు. ఇదే పట్నంలో వుంటే నువ్వడిగిన యాభై వేలూ కళ్ళుమూసుకొని నీకాళ్ళ ముందు గుమ్మరించేవారు."

"ఇల్లు ఒక్కటే కాదులెండి. కృష్ణమ రాయులవారి ముత్తాతలు మా కిచ్చిన మాన్యాలున్నాయి. నా స్వాధీన హక్కు భుక్తాలలో వున్న భూమి చెరువు కిందది పదిహేను ఎకరాలు. ఎంత లేదన్నా మూడువేలు దగ్గరగా పలుకుతుంది. ఆ భూమీ, యీ యిల్లు రాయించుకొని, నాకు అరవై వేలు యిప్పించండి. మీ మేలు నేను జన్మలో మరచిపోను," అంది రాధ బతిమాలుతున్నట్లుగా.

శెట్టి లోలోపలే లెక్కలు వేసుకు న్నాడు. పదిహేను ఎకరాల భూమి, యిల్లు- అరవై వేలకు దండగ లేదు. మంచి బేరమే. అయినా అంత సులువుగా 'సరే' అనడం దేనికని, "అరవై వేలు అంటే కష్టం. నీకూ నష్టంలేకుండా నాకు నష్టంలేకుండా యాభై వేలుకి ఖాయం చేసుకుందాం. అది కూడా మా యింట్లో ఆడవాళ్ళతో ఓ మాట అన్నాకే సుమా" అన్నాడు శెట్టి.

తన యిల్లూ, మాన్యం అమ్మాల్సి వస్తుందని కలలో కూడా అనుకోలేదు రాధ. అవసరం అలాంటిది కాబట్టి యాభై వేలకే అంగీకరించింది.

"ఓ చిన్న మాట" అంది రాధ.

"చెప్పు. నువ్వు మాట్లాడతా వుంటే సంగీతంలా వుంటుంది నా ప్రాణానికి" అన్నాడు శెట్టి.

"ఇల్లు నేను వెంటనే ఖాళీచేయలేను. ఒక ఏడాది గడువు కావాః. యీ డబ్బు మాత్రం నాకు రేపే కావాలి" అంది రాధ.

శెట్టి ఒక్క క్షణం ఆలోచించి, "సరేలే నా యింట్లో నువ్వు వుంటానంటే నే కాదంటానా? నా యిల్లు ఒకటీ నీ యిల్లు ఒకటీనా" అని ఆశగా నవ్వాడు.

శెట్టిని అర్థంచేసుకున్న రాధ "ఏడాది పాటూ అద్దెయిస్తాను లెండి. వూరికే వుండను." అని వివరించింది.

"అదంతా తరవాత చూసుకోవచ్చులే. అగ్రిమెంటు రాయించి పంపుతాను. సంతకం చేసెయ్. అడ్వాన్సు పంపు తాను." అన్నాడు శెట్టి.

"అగ్రిమెంటు అవసరంలేదు. సరాసరి రిజిస్ట్రేషనే. రేపేవెడదాం పట్నానికి" అంది రాధ.

శెట్టి అంగీకరించాడు.

"ఒక చిన్న ప్రార్థన" అంది రాధ.

వెళ్ళబోతున్న శెట్టి నవ్వుతూ ఆగి పోయాడు ఏమిటన్నట్టు.

"యీ విషయం మరెవరికీ తెలియ కూడదు." అంది రాధ.

"నీమాట నే నేదీ కాదనను" అన్నాడు శెట్టి.

మర్నాడు పట్నంలో సబ్ రిజిష్ట్రారు ఆఫీసునుంచి రాధ, శెట్టి, పూర్నయ్య బయటకు వచ్చారు.

"మీరు సాక్ష్యానికి రావడంతో నాకు కొండంత ధైర్యం వచ్చేసింది పూర్నయ్య బాబుగారు. లేకపోతే ఆడమనిషిని మోసంచేసి రాయించుకున్నా నన్నొచ్చు మాయదారి జనం. యింక నాకా భయం లేదు." అన్నాడు శెట్టి పూర్నయ్యతో.

"రాధ చిన్నపిల్ల కాదుకదా శెట్టీ. చాలామందికంటె చాలా తెలివైనదీ, ఉత్తమురాలూను." అన్నాడు పూర్నయ్య.

"పోనీలెండి. కొనుక్కున్న వాళ్ళకి భయం వుండటం సహజం. సమయానికి ఆదుకున్నారు శెట్టిగారు. మీ ఋణం యీ జన్మకి నేను తీర్చుకోలేను." అంది రాధ.

"నువ్వెప్పుడూ తియ్యగానే మాట్లాడతావులే కాని, అసలు యింత అర్జంటుగా భూమీ, యిల్లూ అమ్మాల్సిన అవసరం ఏమొచ్చిందో చెప్పు ఏమీ అనుకోక పోతేనూ." అన్నాడు శెట్టి.

వెంటనే సమాధానం చెప్పలేక పోయింది రాధ. నవ్వి ఏదో సమాధానం కోసం వెతుక్కుంటూ వుండగా శెట్టే అందుకొని "ఏదేనా వ్యాపారం పెడుతున్నావా? లేక వూరువదిలి వెళ్ళిపోతున్నావా - అసలు ఏమిటి కథ" అన్నాడు.

"వ్యాపారమూ లేదు, వూరు వదిలి వెళ్ళే వుద్దేశ్యమూ లేదు. మన వూళ్ళో వుంటే ఓపూట ఆలయంలో ప్రసాదమూ, మరోపూట సత్రవులో భోజనమూచేసి రోజు చింపెయ్యొచ్చు. పుట్టినవూరును వదిలివెళ్ళడం అంటే కన్నతల్లికి దూరం కావడమే. మా దగ్గరబంధువుల కెవరికో పీకలమీదికి వచ్చింది. సహాయం చేస్తానని మాటిచ్చాను. అందుకని యింత అర్జంటుగా ఆస్తిని అమ్మాల్సివచ్చిందండి." అని బదులుచెప్పింది రాధ, శెట్టికి.

ఆ సమాధానం శెట్టికి తృప్తిగాలేక "సరేలే నీ ఆస్తి నువ్వు అమ్ముకున్నావ్. నాకెందుకు?" అన్నాడు.

"ఇంక బయలుదేరుదామా?" అన్నాడు పూర్నయ్య, యింక ఆ సంభాషణ పొడిగించడం ఇష్టంలేక.

సరేనన్నట్టు తలవూపింది రాధ.

ముగ్గురు పట్నంనుంచి తమ వూరుకు బయలుదేరారు.

(సశేషం)



Printed and Published by A. Chandra Seker Rao at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor : A. SUDHAKARA RAO

